FOR MOMS

Himalaya
SINCE 1930

# మాతృత్వం వేడకలు జరుపుకుందాం

మీ బిడ్డతో మీ పొట్ట పెరగడాన్ని మీరు మొదటిసారిగా అనుభూతి చెందడం

మీ బిడ్డ చిట్టికాళతో కొట్టడాన్ని మీరు మొదటిసారిగా అనుభూతి చెందడం

మీ బిడ్డను మీరు మొదటిసారి పట్టుకోవడం

మీరు మొదటిసారి స్తన్యం ఇచ్చినది

హిమాలయ ఫర్ మామ్స్, కేవలం బిడ్డకు మాత్రమే కాకుండా తల్లికి కూడా ఒక కొత్త ప్రపంచం మరియు కొత్త జీవితం ప్రారంభం అవుతుందని అర్థం చేసుకుంది. మీ విలువైన చిన్నారి విషయంలో మీరు మరింత శ్రద్ధ తీసుకోవాలని మేం విశ్వసిస్తున్నాం. మీ ప్రయాణంలోని ప్రతి దశలోనూ, హిమాలయ ఫర్ మామ్స్ మీ మాతృత్వం మరింత అందమైన అనుభూతులను మిగిల్చేందుకు ఒక బహుమతిని అందిస్తుంది.




హిమాలయ ఫర్ మామ్స్ 11 రకాల వనమూలికల శక్తిని కలిగి ఉంది, ఇది తల్లులకు సురక్షితమైన, మృదువైన మరియు బిడ్డకు ఎలాంటి దుష్ప్రభావాలు కలిగించని ఉత్పత్తులను అందిస్తుంది.

ఆన్‌లైన్ అందుబాటులో ఉంది www.himalayastore.com



THE LARGEST CIRCULATED TELUGU WEEKLY

# స్వాతి

## సపరివార పత్రిక

FOUNDER PROPRIETOR EDITOR : VEMURI BALARAM

ESTABLISHED 1984 | సంపుటి 34 | 23.3.2018 | సంచిక 38

అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002


పాఠక దేవుళ్ళకు నమస్కారం

ఎడిటర్

## వేమూరి బలరామ్

When the mind is one with the deeper spirit,
there results the absolute knowledge of the self

సీరియల్స్, కథలు, స్పెషల్ ఫీచర్స్
మరియు శీర్షికలు



ముఖచిత్రం
యుగపురుషునికి స్వాగతం
చిత్రకారుడు : బి.కె.ఎస్.వర్మ

పాఠకదేవుళ్ళు, రచయిత(త్రు)లు,
చిత్రకారులు, రథసారథులు,
ప్రకటనకర్తలు, శ్రేయోభిలాషులందరికీ
ఈ ఉగాది పండుగ సందర్భంగా, గో, సువర్ణ,
రజిత, రత్న, పుస్తక, ధాన్య, ఛత్ర, గృహ, తిలా,
కన్యా, గజ, అశ్వ, శయ్యా, వస్త్ర, భూదాన
ఫలితాలను సిద్ధింపజేయవలసిందిగా
కాలపురుషుడిని ప్రార్థిస్తూ
సర్వులకు ఉగాది పండుగ శుభాకాంక్షలు


E-mail: advtswati@gmail.com swativja@eth.net

Editor: VEMURI BALARAM Swati Publications Anil Buildings Suryaraopet Vijayawada 520 002 Printed and Published by the owner VEMURI BALARAM
Printed at Anil Swati Press Autonagar Vijayawada Cover at Kala Jyothi Process Pvt.Ltd., Hyderabad
Tel.: (0866) 243 1862 243 4017 Advt. 243 1233 Mktg. 243 3938 Fax: 0866-243 0433









**9.3.2018**

**మా**కెంతో ఉపయోగపడే ఎన్నో జాగ్రత్తలు 'పొట్ట జాగ్రత్త' ఫీచర్‌లో తెలుసుకున్నాం.సమయపాలన అనుసరించేవారు సీరియస్ ప్లానర్ అయివుండాలి అనే విషయాన్ని 'పంక్చువాలిటీ' ఫీచర్‌లో వివరణ బాగుంది.

'మనిషిలో మనిషి', 'హృదయం ఎక్కడున్నదీ...', 'సామ్రాట్ సముద్రగుప్త', 'జై భారత్' సీరియల్స్ చాలా బాగుంటున్నాయి.

'తీపి-చేదు','శిబి' కథలు అద్భుతం. 'చిట్టిబాబు పెళ్ళిసందడి' కథ మమ్మల్ని ఎంతో నవ్వించింది.

*తేనేటి రమ్యదీప్తి సత్తెన్నపల్లి*

'**చా**క్లెట్ చీర్' రచన అనేక సంగతులు వెలువరించింది.

'హెల్త్ బిట్స్' ఉపయోగకరం.

'చివరిరోజుల్లో...' అన్నాదురై నుండి ఎన్టీఆర్‌దాకా ఐదుగురి ముఖ్యమంత్రులతో నటించిన అపూర్వ నటీమణి మనోరమ సంగతులు ఎంతో ఆసక్తికరంగా ఉన్నాయి.

*ఎన్.ఎస్.చంద్రబోస్ విశాఖపట్నం*

**బా**పుగారి బొమ్మ రమణీయంగానే కాక ఆలోచనాత్మకంగా ఉంది. మోడల్‌గా వ్యవహరించేవారి మనోవేదనను కళ్ళకు కట్టింది. 'ఒక చిన్నమాట' శీర్షికను భాగ్యలక్ష్మిగారి చేయి తిరిగిన కలం రసభరితం చేస్తోంది.

రసరాజుగారి కథ 'తీపి-చేదు' బాగుంది. 'చివరిరోజుల్లో...' శీర్షికలో మనోరమగురించి తెలుసుకున్నాం.

*కళాభూషణ్ కర్నూలు*

'**మ**నిషిలో మనిషి', 'హృదయం ఎక్కడున్నదీ...', 'సామ్రాట్ సముద్రగుప్త', 'జై భారత్' సీరియల్స్ అన్నీ ఇంట్రెస్టింగ్‌గా సాగుతున్నాయి.

'తీపి-చేదు', 'చిట్టిబాబు పెళ్ళిసందడి', 'శిబి' కథలు బాగున్నాయి.

'ఫర్ U', 'ఈ శీర్షిక మీదే', 'B హ్యాపీ' శీర్షికలు బాగున్నాయి.

*లక్ష్మీనారాయణ విశాఖపట్నం*

'**మ**నిషిలో మనిషి', 'జై భారత్' సీరియల్స్ బాగున్నాయి.

'హేలికా పూర్ణిమ', 'పొట్ట జాగ్రత్త', 'మనీ టాక్', 'పంక్చువాలిటీ' ఫీచర్స్



బాగున్నాయి. 'నేనెవరో తెలుసా!', 'ఒక చిన్న మాట','Whats App' శీర్షికలు ఆకట్టుకున్నాయి.

'ఈ శీర్షిక మీదే' నవ్వించింది.

*ఆర్.మరుద కాశీ కడప*

**బ్యాం**క్‌లను దోచేసిన నేరంరాజకీయ నేతలది. ఋణాలు మంజూరులో కమీషన్లకి బ్యాంక్ సిబ్బంది ప్రజలను పీడిస్తున్నారు అనేది బ్యాంక్‌ల అధికారిక దోపిడిద్వారా ఉన్నది ఉన్నట్లు తెలియజేశారు.

*బి.రాజశేఖర్ హైదరాబాద్*



# ఇది మంచి సమయం

**15.3.2018 నుండి 21.3.2018 వరకు శ్రీ హేవళంబి నామ సంవత్సరం, ఉత్తరాయణం, వసంతఋతువు, ఫాల్గుణమాసం, కృష్ణపక్షం.**
**18.3.2018 నుండి విలంబి నామ సంవత్సరం, చైత్రమాసం, శుక్లపక్షం.**

**15.3.2018 గురువారం**
తిథి: త్రయోదశి సా. 5.19 వరకు
నక్షత్రం: ధనిష్ఠ సా. 5.12 వరకు
వర్జ్యం: రా. 12.52-2.34 వరకు
దుర్ముహూర్తం : ప. 10.18-11.05 వరకు. మ. 3.00-3.47 వరకు
రాహుకాలం: మ.1.43-3.11 వరకు
మంచి సమయం : ఉ. 5.55-7.50 వరకు
సూర్యోదయం: 6.13కి
సూర్యాస్తమయం: 6.11కి

**16.3.2018 శుక్రవారం**
తిథి: చతుర్దశి సా. 6.18 వరకు
నక్షత్రం: శతభిషం సా. 6.44 వరకు
వర్జ్యం: రా. 1.26-3.96 వరకు
దుర్ముహూర్తం: ప.8.43 నుండి 9.30 వరకు. మ. 12.38-1.25 వరకు
రాహుకాలం:ప.10.47-12.15 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.12కి
సూర్యాస్తమయం: 6.11కి

**17.3.2018 శనివారం**
తిథి: అమావాస్య సా. 6.11 వరకు
నక్షత్రం: పూర్వాభాద్ర సా.7.43 వరకు
వర్జ్యం: తె. 5.30 లగాయతు
దుర్ముహూర్తం: ఉ. 6.21-7.55 వరకు
రాహుకాలం: ప. 9.19-10.47 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.11కి
సూర్యాస్తమయం: 6.11కి

**18.3.2018 ఆదివారం**
తిథి: చైత్ర శుద్ధ పాడ్యమి సా.6.32 వరకు
నక్షత్రం: ఉత్తరాభాద్ర రా.8.10 వరకు
వర్జ్యం: ... ఉ. 7.08 వరకు
దుర్ముహూర్తం: సా.4.34-5.21 వరకు
రాహుకాలం: సా.4.39-6.08 వరకు
మంచి సమయం:ప.8.30-8.50 వరకు
సూర్యోదయం: 6.18కి
సూర్యాస్తమయం: 6.11కి
ఉగాది

**19.3.2018 సోమవారం**
తిథి: విదియ సా. 5.53 వరకు
నక్షత్రం:రేవతి రా. 8.08 వరకు
వర్జ్యం: ప. 8.10-9.46 వరకు
దుర్ముహూర్తం : మ. 12.38 నుండి 1.25 వరకు.మ. 3.00-3.47 వరకు
రాహుకాలం: ఉ. 7.50-9.18 వరకు
మంచి సమయం: సా. 5.45 నుండి 7.21 వరకు
సూర్యోదయం: 6.09కి
సూర్యాస్తమయం: 6.11కి

**20.3.2018 మంగళవారం**
తిథి: తదియ సా. 4.51 వరకు
నక్షత్రం: అశ్విని సా. 7.44 వరకు
వర్జ్యం : మ. 3.48 నుండి 5.22 వరకు. తె. 5.03 లగా...
దుర్ముహూర్తం: ప. 8.41 నుండి 9.28 వరకు రా.11.01-11.48 వరకు
రాహుకాలం: మ. 3.11-4.39 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.09కి
సూర్యాస్తమయం: 6.12కి

**21.3.2018 బుధవారం**
తిథి : చవితి మ. 3.29 వరకు
నక్షత్రం: భరణి సా. 7.01 వరకు
వర్జ్యం: ...ఉ. 6.36 వరకు
దుర్ముహూర్తం : ప. 11.50 నుండి 12.37 వరకు
రాహుకాలం: మ.12.44-1.42 వరకు
మంచి సమయం: లేదు
సూర్యోదయం: 6.08కి
సూర్యాస్తమయం: 6.12కి

* మీ అదృష్టాన్ని పరీక్షించుకోండి.

CallHealth
Everything about health

Happy W8MEN's Day

# మీ ఆరోగ్యం మీ శక్తి

**మహిళలు సమున్నత స్థాయికి చేరుకునేందుకు సహకరించే ఓచిన్న అడుగు. ప్రత్యేకమైన ఆరోగ్య ప్యాకేజ్ లను వినియోగించుకోండి. మెరుగైన జీవితాన్ని సొంతం చేసుకోండి. #LiveBetter**

చైల్డ్ కేర్
5 – 12 సంవత్సరాలు



పోషక విలువలు, గ్రోత్, హార్మోన్ల సంతులనం, జీవ ప్రక్రియకు సంబంధించిన పరీక్షలు చేయించండి .మీ చిన్నారుల ఆరోగ్యాన్ని పరిరక్షించుకోండి.

40+ పారామితులు ~~₹998~~ ₹499

హెల్దీ టీన్
13-19 సంవత్సరాలు



ఒత్తిడి కి లోను కాకండి. బలహీనత, అలసట, రుతుస్రావానికి చెందిన అసాధారణ పరిస్థితులు, బరువు హెచ్చుతగ్గులు, హార్మోన్ల సంతులనం, అవాంఛిత జుట్టు, చర్మం లోపాలు లాంటి పరీక్షలు చేయించుకోండి.

40+ పారామితులు ~~₹2398~~ ₹1199

అడ్వాన్స్ మహిళల ఆరోగ్య పరీక్ష
20-45 సంవత్సరాలు



డయాబెటిస్, జుట్టు రాలిపోవడం, బలహీనత, హార్మోన్ల సంతులనం, బోన్ హెల్త్, ముఖ్యమైన విటమిన్ స్థాయిలు, బరువు హెచ్చుతగ్గులు ఇంకా ఇతర ఇబ్బందులకు చెందిన పరీక్షల ద్వారా మీ జీవన శైలిని సరిదిద్దుకోండి.

60+ పారామితులు ~~₹2165~~ ₹1299

అడ్వాన్స్ మహిళల ఆరోగ్య పరీక్ష
45+ సంవత్సరాలు



మహిళలకు సంబంధించిన అత్యంత అధునాతన ప్రత్యేక పరీక్షల ప్యాకేజీలు వీటిలో బోన్ హెల్త్, గుండె ఆరోగ్యం, ముఖ్యమైన విటమిన్ & పోషణ స్థాయిలు, డయాబెటిస్, కొలెస్ట్రాల్ అసమతుల్యత ఇంకా ఇతర అంశాలు మీ మనోహరమైన వృద్ధాప్యంకి.

70+ పారామితులు ~~₹3165~~ ₹1899

**ఆరోగ్యానికీ, క్షేమానికీ ఎంతో అనువైన మా పరిష్కారాల ద్వారా మీ ఆరోగ్యాన్ని కాపాడుకోండి**

**డయాగ్నోస్టిక్స్ & ఇమేజింగ్**

డయాగ్నోస్టిక్స్
70%* వరకు డిస్కౌంట్
లిపిడ్ ప్రొఫైల్, రక్తం-షుగర్, యూరియా-సీరం వంటి పరీక్షలపై పొందండి

ఇమేజింగ్
60%* వరకు డిస్కౌంట్
CT - మెదడు, మామోగ్రఫీ, X-ray, ఛాతి వంటి స్కాన్లపై పొందండి

**మందులు మరియు మెడికల్ సామాగ్రి**
40%* వరకు డిస్కౌంట్
ప్రిస్క్రిప్షన్ మందులు మరియు ఉత్పత్తులపై

**myవెల్నెస్**
40%* వరకు డిస్కౌంట్
బరువు నిర్వహణ, భావోద్వేగ శ్రేయస్సు & ఇతరులపై

**ఇంక్లూడింగ్ 20% క్యాష్ బ్యాక్ (కాల్ హెల్త్ వ్యాలెట్ లో 10% + పేటిఎం ద్వారా 10% )**

కీలకమైన అనారోగ్యానికి దారితీసే జన్యుసంబంధమైన హానిని పసిగట్టేందుకు 100+ పరిస్థితులను, ఆరోగ్య సమస్యల ఆనవాళ్ళను గుర్తించేందుకు లోతైన పరీక్షలు ₹999* మొదలుకుని

CallHealth వాలెట్ క్యాష్బ్యాక్ myWellness సేవలకు వర్తించదు

*T&C. గిఫ్ట్ క్యాష్బ్యాక్ Paytm పై Rs.100 వరకు మారవచ్చు. CallHealth అత్యవసర సర్వీస్ సేవలు అందించడం లేదు.

91 33 55 77 99 callhealth.com

| Doctor Consultation | Family Doctor | Second Opinion | myWellness | Emotional Wellbeing-Psychiatry & Psychology | Diagnostics and Imaging | Medicines and Medical Supplies | Medical Equipment - Buying & Leasing | Medical Tourism | Physiotherapy | Nursing | Bedside Attendant | Hospitalization Assistance | Health Insurance Services | eHealth Records


Scan to download app

Download App

Follow us for health tips

Paytm Preferred Payments Partner

• Hyderabad • Vizag • Rajahmundry • Guntur • Kurnool • Warangal • Vijayawada • Nellore • Tirupati • Delhi • Gurugram • Noida

ASSOCIATED

మార్చి మొదటివారంలో పార్లమెంట్ సమావేశాలు తిరిగి ప్రారంభమవుతున్న సమయంలో రెండు కీలకమైన రాజకీయ సంఘటనలు జరిగాయి. అందులో ఒకటి ప్రజా తీర్పు, రెండవది నాయకుల నిర్ణయం. ఆ రెండింటికి సంబంధం లేదన్నట్టుగా కనిపించినా, రెండు వేరు వేరు ప్రాంతాలలో జరిగినా అవి ఒక విధంగా జాతీయ రాజకీయాలను ప్రభావితం చేసేవే. ఈశాన్య భారతదేశంలోని చిన్న రాష్ట్రం త్రిపుర.

# కె.సి.ఆర్. కొత్త ఎత్తుగడ



జాతీయ పాత్రపై కె.సి.ఆర్. ఆశ

బంగారు తెలంగాణ వదిలి ఢిల్లీకి

ఆ రాష్ట్ర శాసనసభకు జరిగిన ఎన్నికలో పాతిక సంవత్సరాలుగా అధికారంలోవున్న సి.పి.ఎమ్‌ని పెకిలించి బి.జె.పి ప్రభుత్వం ఏర్పాటుచెయ్యటం. నాటివరకు ఆ రాష్ట్రంలో బిజెపి ఉనికి నామమాత్రమే. ఒక్కడంటే ఒక్క మునిసిపల్ కౌన్సిలర్ కూడా ఆ పార్టీకి లేదు.

2013 ఎన్నికల్లో బిజెపికి వచ్చింది 1.3 శాతం ఓట్లు మాత్రమే.కాని ఐదేళ్ళు తిరిగేసరికి ఆ రాష్ట్రంలో 43 శాతం ఓట్లు రాబట్టుకున్నది బి.జె.పి.

ఇది ఏ రాజకీయపార్టీకి ఐనా అనూహ్య విజయమే. పైగా తొలిసారిగా రెండు భిన్నసిద్ధాంత రాజకీయ పార్టీలు ఒకరితో ఒకరు తలపడిన గోదా త్రిపుర.

కమ్యూనిస్టుల సిద్ధాంతానికి, బి.జె.పి. సిద్ధాంతాలకు చుక్కెదురు. కాని ఆ రెండు పార్టీలు ప్రధాన ప్రత్యర్థులుగా తలపడిన తొలి సంఘటన ఇదే.

ఆ తొలి యత్నంలోనే సి.పి.ఎమ్.ని మట్టికరిపించి సైద్ధాంతిక విజయం తమ ఖాతాలో వేసుకున్నది బి.జె.పి. 2014 ఎన్నికల తర్వాత బి.జె.పి. విస్తరణ అనూహ్యంగా జరిగింది.

ఒకనాడు మధ్య, పశ్చిమభారత్‌లకు మాత్రమే పరిమితమైన పార్టీగా బి.జె.పి.కి ముద్ర వుండేది. 2014లో కేంద్రంలో అధికారం చేపట్టిన తర్వాత ఆపార్టీ ఒక పథకం ప్రకారం ఒక రాష్ట్రం నుండి మరో రాష్ట్రానికి విస్తరిస్తున్నది.

ఈశాన్య భారతదేశంలో ఏమాత్రం పలుకుబడిలేని బి.జె.పి. ఆ రాష్ట్రంలోని మణిపూర్ మినహా మిగిలిన రాష్ట్రాలన్నింటిలో స్వయంగా లేదా సంకీర్ణంగా అధికారం చేపట్టింది. నాగాలాండ్ వంటి క్రైస్తవ మెజారిటీ రాష్ట్రంలో కాంగ్రెస్‌ని తిరస్కరించేలా చేయగలిగింది బి.జె.పి. ముస్లిమ్ మెజారిటీ జమ్ము- కాశ్మీర్ రాష్ట్రంలో మిత్రపక్షంతో కలిసి అధికారం చేపట్టింది.

తూర్పు రాష్ట్రాలైన బెంగాల్‌లో బి.జె.పి. రెండవ స్థానంలో వుంటున్నది. ఒకనాడు ఆ రాష్ట్రంలో బలీయశక్తి అయిన వామపక్షాలు,కాంగ్రెస్‌లు మూడు నాలుగు స్థానాలకోసం కలబడాల్సిన పరిస్థితి. ఒరిస్సాలో అధికారంలోకి రాగలమన్న ధీమా బిజెపిలో కనిపిస్తోంది. ఇక మిగిలింది దక్షిణ భారతదేశం. కర్ణాటకలో మేలోగా ఎన్నికలు జరుగుతాయి. ఆ రాష్ట్రంలో కాంగ్రెస్‌ని ఎదుర్కొనే పార్టీ తమదని బిజెపి ప్రచారం ప్రారంభించింది.

కేంద్రంలో అధికారం,భారీఎన్నికలనిధులు, ప్రధాని నరేంద్రమోడీ పాప్యులారిటీ, అమిత్‌షా రాజకీయ చతురత, చిత్తశుద్ధితో పనిచేసే కార్యకర్తలు బిజెపి గెలుపుకు దోహదపడుతున్నాయి.

కర్ణాటకలో బి.జె.పి. విజయం సాధిస్తే తదుపరి వారి దృష్టి మిగిలిన దక్షిణాది రాష్ట్రాలమీద పడుతుందనేది తెలిసిన విషయమే. అందుకే దక్షిణాది రాష్ట్రాలు అప్రమత్తమవటం సహజం.

దక్షిణాది రాష్ట్రాలలో అధికారంలోవున్న ప్రాంతీయ పార్టీ నేతలు రాజకీయంగా అప్రమత్తమై బి.జె.పి. వ్యతిరేక కూటమికి ప్రతిపాదన చెయ్యటమే మార్చి మొదటి వారంలో జరిగిన రెండవ కీలక రాజకీయ ఘటన.

ఒకనాడు ప్రాంతీయ పార్టీలన్నింటినీ ఏకతాటి మీదికితెచ్చి కాంగ్రెస్-బిజెపి వ్యతిరేకఫ్రంట్‌ని ఏర్పాటు చేసిన ఘనత తెలుగుదేశం పార్టీది.

ఎన్టీఆర్ అధికారం చేపట్టిన తొలినాళ్ళలోనే విజయవాడ వేదికగా కాంగ్రెస్ వ్యతిరేక కూటమిని ఏర్పాటుచేసే యత్నం చేశాడు.

నాడు ఎన్టీఆర్ చేసిన ఆ యత్నంవల్లనే 1989లో వి.పి.సింగ్ ప్రధానిగా నేషనల్‌ఫ్రంట్ ప్రభుత్వం ఏర్పడింది. ఆ తర్వాత 1996లో ఏర్పడిన యునైటెడ్ ఫ్రంట్‌లో కీలకపాత్ర తెలుగుదేశం పార్టీ అధినేత చంద్రబాబు నాయుడిదే.

నాడు రెండు సందర్భాలలో కూడా జాతీయ నాయకులుగా ఎదిగే అవకాశం వచ్చినా ఎన్టీఆర్, చంద్రబాబులు ఆ అవకాశాన్ని వదులుకున్నారు.నాడు వారి ఆలోచన స్వరాష్ట్రంమీదే వున్నాయి.

స్వరాష్ట్రంలో పూర్తిగా తాము అనుకున్న అభివృద్ధి ఎజెండా పూర్తిచేయకుండా, జాతీయస్థాయిలో చక్రం తిప్పాలనిగాని, ప్రధాని పదవిని స్వీకరించాలనిగాని తెలుగుదేశం నేతలు అనుకోలేదు.

1989లో చంద్రబాబు ఎ.పి.ని వదిలి ఢిల్లీకి వెళ్ళినా దేశ రాజకీయాలు, ఎ.పి. రాజకీయాలు ఎలా వుండేవో! తెలుగువారి మీదున్న మద్రాసీ ముద్ర పోగొట్టి ఒక ప్రత్యేక గుర్తింపు తెచ్చిన ఎన్టీఆర్, హైదరాబాద్ నగరాన్ని జాతీయ స్థాయిలో అభివృద్ధి నమూనాగా చూపించిన చంద్రబాబు చెయ్యని ఒక సాహసంచేసేందుకు తెలంగాణ ముఖ్యమంత్రి కె.సి.ఆర్. ఉత్సాహం చూపటమే రెండవ కీలక ఘటన.

రాజకీయాలలో టైమింగ్ అనేది చాలా ముఖ్యం. ప్రస్తుతం బి.జె.పిని అడ్డుకోవాలనే ఆలోచన బిజెపీయేతర పక్షాలన్నింటిలో వున్నది.ఎన్.డి.ఎ.మిత్ర పక్షాలుగా వ్యవహరిస్తున్న శివసేన, అకాలీదళ్, తెలుగుదేశంవంటి పార్టీలు కూడా బిజెపి వ్యవహారశైలితో సంతృప్తిగా లేవు.

> వామపక్షాలు అంతరిస్తే భారత్‌కి ముప్పు తలెత్తుతుంది.
> -జైరామ్ రమేష్, కాంగ్రెస్ నేత



# స్త్రీ పునరుత్పత్తి వ్యవస్థ క్యాన్సర్స్ - ముందు జాగ్రత్తలు

క్యాన్సర్స్‌లో మనదేశపు స్త్రీలలో ఎక్కువగా కన్పించేది గర్భాశయ ముఖద్వార క్యాన్సర్ (సర్వైకల్ క్యాన్సర్). ఈ క్యాన్సర్ బారిన పడకుండా అమ్మాయిలకు హెచ్.పి.వి. వ్యాక్సిన్ ఉన్నా, అవగాహన లేక వేయించుకోకపోవడం ఒక కారణమైతే, పరిశుభ్రత తక్కువగా ఉండటం, కాన్పులు ఎక్కువ కావటం, చిన్న వయస్సు నుండే శృంగార జీవితం, గ్రామీణ నేపథ్యంలో తేమ ఎక్కువగా ఉన్నా ప్రాంతాలలో హెచ్.పి.వి. వైరస్ ఎక్కువగా ఉండటం, ఇతర కారణాలుగా చెప్పుకోవచ్చు. అందుకే పెళ్లి కాని అమ్మాయిలకు లేదా పెళ్లి అయినా ఈ క్యాన్సర్ లేదని పరీక్షలద్వారా నిర్ధారించుకున్న తర్వాత మూడు డోసులు ఈ వ్యాక్సిన్ వేయించుకుంటే ఈ క్యాన్సర్ బారిన పడకుండా కాపాడుకోగలగుతాము. ప్రపంచ వ్యాప్తంగా ఈ క్యాన్సర్ స్త్రీలలో ప్రధానంగా ఉన్నా వ్యాక్సిన్స్ వేయించుకోవటం వలన, పాప్‌స్మియర్ పరీక్ష చేయించుకుని ఈ క్యాన్సర్ వచ్చే ప్రమాదాన్ని ముందే పసిగట్టి ట్రీట్‌మెంట్ తీసుకోవటం వలన ఈ క్యాన్సర్ బారిన పడకుండా, ఒకవేళ గురయినా ట్రీట్‌మెంట్స్‌తో బయటపడే వారి సంఖ్య పెరుగుతూ ఉండటం కొంతవరకు శుభపరిణామం అని చెప్పుకోవచ్చు. గర్భాశయ ముఖద్వార క్యాన్సర్ హెచ్.పి.వి. వైరస్‌లో 16, 18 రకాలు, అవి సోకకుండా వ్యాక్సిన్స్. అన్ని జాగ్రత్తలు తీసుకున్నా అరుదుగా ఇతర కారణాలవల్లా ఈ క్యాన్సర్ వచ్చే ప్రమాదం కూడా ఉంటుందని గుర్తుంచుకోవాలి. అందుకనే డాక్టర్ సలహా మేరకు అప్పుడప్పుడు పాప్‌స్మియర్స్ చేయించుకుంటూ ఉంటే గర్భాశయ ముఖ ద్వారంలోని కణాలమార్పును ముందే పసిగట్టగలుగుతాము. ఇంకా స్త్రీలలో పునరుత్పత్తి వ్యవస్థకు సంబంధించి ఏఏ క్యాన్సర్స్ ఉన్నాయి, వాటి లక్షణాలు ఏమిటి? ఒకసారి తెలుసుకుందాం.

**అండాశయాల(ఒవేరియన్) క్యాన్సర్ :** స్త్రీలలో గర్భాశయ ముఖ ద్వార క్యాన్సర్స్ తర్వాత ఈ క్యాన్సర్ ఎక్కువ అని చెప్పుకోవచ్చు. అండాశయం పొట్టలోపలఉండటం వలన లక్షణాలు చాలా లేటుగా గుర్తించగలుగుతాము. అందుకే ఈ క్యాన్సర్‌ను సైలెంట్ కిల్లర్‌గా పేర్కొంటూ ఉంటారు. పిల్లలు కలుగని స్త్రీలలో, బ్రెస్ట్, కోలన్ క్యాన్సర్ వచ్చిన వారిలో, దీర్ఘకాలం పాటు హార్మోన్స్, కొవ్వు పదార్థాలు అధికంగా తీసుకునే వారిలో ఈ క్యాన్సర్ వచ్చే ప్రమాదం ఎక్కువ. మొదట్లో లక్షణాలు అజీర్తి, యూరినరి ఇన్‌ఫెక్షన్స్ అని పొరబడటం వలన తొలిదశలో ఈ క్యాన్సర్‌ను గుర్తించలేకపోవచ్చు.

లక్షణాలు : 1. పొత్తి కడుపు ఉబ్బి, నొప్పిగా ఉండటం, 2. అజీర్తి, వికారం, తేన్పులు వంటి జీర్ణ సంబంధ సమస్యలు, 3. యోని స్రావాలు అసాధరణంగా, మూత్రం ఎక్కువగా రావటం, 4. అలసట, జ్వరం.

సి.ఎ. 125 రక్త పరీక్ష, అల్ట్రాసౌండ్ స్కానింగ్‌లతో ఈ క్యాన్సర్‌ను నిర్ధారించగలుగుతాము.

**యుటెరైన్ లేదా ఎండోమెట్రియల్ లేదా గర్భాశయ క్యాన్సర్స్ :**

గర్భసంచిలో లైనింగ్ ఎండోమెట్రియమ్, ఈ పొర మరీ పలుచగా, లేదా 14 మి.మీ. కంటే ఎక్కువగా మందంగా ఉండటం మంచిది కాదు. పిల్లలు కలుగని స్త్రీలలో, శరీరంలో ఈస్ట్రోజెన్ లెవల్స్ ఎక్కువ కాలం పాటు ఉన్నా, రొమ్ము క్యాన్సర్ వచ్చిన వారిలో, నెలసర్లు 9 ఏళ్ల కంటే ముందు ప్రారంభం అయిన వారిలో, మెనోపాజ్‌కు చేరుకున్న స్త్రీలలో, అధిక బరువు ఉన్నవారు ఈ క్యాన్సర్‌కు గురయ్యే ప్రమాదం ఉంటుంది. 50 నుండి 64 మధ్య వయస్సు స్త్రీలలో ఈ క్యాన్సర్ ఎక్కువగా కన్పిస్తోంది. అందుకనే మెనోపాజ్ దశకు చేరుకున్న స్త్రీలకు నెలసర్లు పూర్తిగా ఆగిపోయిన ఒక సంవత్సరం తర్వాత రక్తస్రావం అప్పుడప్పుడు అయినా, తరచుగా అయినా లేక చాలా కొద్దిగా రక్తం కన్పించినా నిర్లక్ష్యం చేయకూడదు. స్త్రీలు ఇలాంటి పరిస్థితులు ఎదురైనప్పుడు "ఏంటి? మళ్లీ ఈ వయస్సులో నెలసర్లు మొదలయ్యాయి, ఎవ్వరితో చెప్పుకోను" అని మొహమాట పడ్తూ ఉంటారు కాని, మొహమాట పడి నిర్లక్ష్యం చేయాల్సిన సందర్భం కానే కాదు అని గుర్తుంచుకోవాలి.

బ్రెస్ట్ క్యాన్సర్‌కు టొమాక్సిఫెన్ మందు వాడిన స్త్రీలు, పెల్విస్‌కు రేడియేషన్ తీసు కున్నవారు, హార్మోన్ థెరపి దీర్ఘకాలంపాటు తీసుకున్నవారు, 55 ఏళ్లు పైబడినా నెలసర్లు ఆగని స్త్రీలలో ఈ క్యాన్సర్ వచ్చే ప్రమాదం ఎక్కువ.

నెలసర్లు మధ్యలో, మెనోపాజ్ దశ దాటాక రక్తస్రావం కన్పిస్తే అల్ట్రాసౌండ్, హిస్టిరోస్కోపి, బయాప్సి వంటి పరీక్షలు తప్పనిసరి.

**వజైనల్ మరియు వల్వా క్యాన్సర్స్ :** ఇది స్త్రీలలో పునరుత్పత్తి, వ్యవస్థకు సంబంధించి బయటకు కన్పించే అవయవాలు, యోని, యోని పెదాలకు సంబంధించిన క్యాన్సర్స్ అరుదుగా కన్పించేవే కాని ఈ అవయవాలు క్యాన్సర్స్‌కు గురయితే ట్రీట్‌మెంట్ ఇవ్వటం మరింత కష్టతరం, అదుపులో పెట్టి జీవితకాలం పెంపొందించటం కూడా అంత సులువేమి కాదు. మెనోపాజ్ వయస్సులో థైరాయిడ్




**Dr. Ch. Mohana Vamsy**
Chief Surgical Oncologist
Omega Hospitals, Hyderabad.
Ph : 98480 11421
**KURNOOL : 08518 273001**


హార్మోన్ సమస్య ఉన్నవారిలో, హెచ్.పి.వి. వైరల్, హెపటైటిస్ సి వైరల్ ఇన్‌ఫెక్షన్స్ లేదా ఖచ్చితమైన కారణం తెలియకుండా వచ్చే ఒక ఆటో ఇమ్యూన్ డిజార్డర్ అయిన "లైకన్ స్క్లిరోసిస్" అనే చర్మవ్యాధి వలన స్త్రీలకు యోని ప్రాంతంలో తెల్లటి మచ్చలు, దురదలు కలిగి మచ్చలు పడతాయి. ఆ మచ్చలు "వల్వార్ కార్సినోమా" అనే చర్మ సంబంధ క్యాన్సర్ వచ్చే రిస్క్ చాలా ఎక్కువ. 'లైకన్ స్క్లిరోసిస్' చర్మ వ్యాధి ఉన్న స్త్రీలు ట్రీట్‌మెంట్ తీసుకోవటంతో పాటు తప్పనిసరిగా క్యాన్సర్ వంటి మార్పులు ఏమైనా చోటు చేసుకుంటున్నాయా అని ఎప్పటికప్పుడు గమనించుకుంటూ ఉండాలి.

స్త్రీలు గైనిక్ క్యాన్సర్స్‌కు చెక్ పెట్టాలంటే పాప్ స్మియర్ పరీక్షలు చేయించుకుంటూ ఈ లక్షణాలను నిర్లక్ష్యం చేయకూడదు.

1. పొత్తికడుపు బరువుగా, పెరుగుతున్నట్లు ఉండటం, 2. అసాధారణమైన యోనిస్రావాలు, రక్తస్రావం, 3. కలయిక సమయంలో రక్తం కన్పించడం, 4. నెలసర్లు ఆగిపోయిన కొంతకాలం తర్వాత రక్తస్రావం, 5. అలసట, జ్వరం, బరువు తగ్గటం.

గైనకాలజికల్ క్యాన్సర్స్‌ను ఇతర శరీర భాగాలకు వ్యాపించక ముందే గుర్తిస్తే హిస్టరెక్టమి లేదా ఊఫరెక్టమి లను చిన్నకోతతో చేసే సర్జరీలద్వారా చేయించుకున్న వెంటనే కీమో, రేడియోథెరపిలను తగినంత కాలం తీసుకోవటంతో ఈ క్యాన్సర్స్‌ను పూర్తిగా అదుపులో ఉంచటం సాధ్యం అవుతుంది.

(సశేషం)

బిజెపి ప్రాంతీయపార్టీల ఉనికిని దెబ్బతీస్తుందన్న భయం శివసేనది. తనకు తగినంత గౌరవం ఇవ్వటం లేదన్నది అకాలీల ఆలోచన. ఆర్థికంగా ఆంధ్రప్రదేశ్‌కి చేయూతనివ్వక తనను రాజకీయ ఇరకాటంలో పెడుతున్నదన్న భావన చంద్రబాబుది.

కాని వారెవరూ గళం విప్పగలిగిన స్థితి ప్రస్తుతానికి లేదు.పరిస్థితులను పూర్తిగా అధ్యయనం చేయకుండా, సరైన సమయం చూడకుండా తన గొంతు విప్పే అలవాటు చంద్రబాబుకి లేదు. రాజకీయ వాతావరణాన్ని బిజెపికి వ్యతిరేకంగా మార్చే యత్నంలో చాలా బిజీగా వున్నాడు చంద్రబాబు.

ఎన్.డి.ఎ.తో తెగతెంపులు చేసుకుని ఆంధ్రప్రదేశ్ ప్రజలకు బి.జె.పి.ని దోషిగా చూపించి,వారి ఆగ్రహాన్ని తన 2019 ఎన్నికల్లో గెలుపుకు అనుకూలంగా మార్చుకోవాలన్నది చంద్రబాబు ఎత్తుగడ.

తగిన టైమింగ్‌కోసం ఎదురుచూస్తున్న చంద్రబాబుకన్నా బి.జె.పి. వ్యతిరేకతలో తానే ముందున్నానని అనిపించుకునేందుకు కె.సి.ఆర్. వేసిన కొత్త ఎత్తుగడే ప్రాంతీయపార్టీల సామూహిక వేదిక నిర్మాణం. రాజకీయనాయకులకు వుండే మరో చతురత తమ వ్యక్తిగత ఎజెండాని ప్రజల ఎజెండాగా ప్రచారంలోకి తీసుకురావటం.

ఎప్పటికప్పుడు ప్రజలను రెచ్చగొట్టి, తమ వైఫల్యాలను కప్పిపుచ్చుకుని, మరెవరి మీదికో ప్రజల ఆగ్రహాన్ని మలచటం రాజకీయ చతురత. ఇప్పుడు కె.సి.ఆర్. ప్రదర్శిస్తున్నది ఆ చతురతనే.

## * ప్రాంతీయశక్తుల కలయిక కల

జాతీయ ప్రత్యామ్నాయ రాగం తాను పాడితే మిగిలిన ప్రాంతీయ నాయకులందరూ గొంతులు కలుపుతారన్నది కె.సి.ఆర్ ఆలోచన.

అందుకే ప్రాంతీయ పార్టీలన్నింటిలో కామన్‌గా కనిపించే కేంద్ర వ్యతిరేకతను ప్రస్తుతానికి ఎజెండాగా ప్రజల ముందుంచారు. కేంద్రంలో బి.జె.పి., కాంగ్రెస్‌ల్లో ఎవరు అధికారంలో వున్నా పరిస్థితి ఒకేలా వుంటుందన్న కె.సి.ఆర్. వ్యాఖ్యను ఎవరు సీరియస్‌గా తీసుకుంటారో తెలియదు.

కొంతమంది పత్రికాధిపతులు, సినీరంగంనుండి రాజకీయాలలోకి వస్తున్న హీరోలు హైదరాబాద్ నగరంతో ముడిపడున్న వారి సంపద దృష్ట్యా కె.సి.ఆర్. ప్రకటనలకు తక్షణం స్వాగతం చెప్పినా మిగిలిన ప్రాంతీయపార్టీలు ఏవీ బహిరంగంగా స్పందించినట్టు కనిపించదు.

కాంగ్రెస్, బిజెపియేతర కూటమికి చెందిన పశ్చిమ బెంగాల్ ముఖ్యమంత్రి మమతా బెనర్జీ, చత్తీస్‌ఘడ్, జార్ఖండ్ మాజీ ముఖ్యమంత్రులు తనతో టచ్‌లో వున్నారని కె.సి.ఆర్. ప్రకటించటమే తప్పించి జాతీయ స్థాయిలో మిగిలిన ప్రాంతీయపార్టీలెవరూ స్పందించ లేదు. నిజానికి ప్రాంతీయపార్టీలు అత్యంత బలంగా వున్నది తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాలలోనే.అక్కడ అధికారంలోవున్న సి.ఎమ్.లు, కె.సి.ఆర్ ప్రకటనకు 'సై' అన్నట్టుగా కనిపించరు.

కె.సి.ఆర్.నైజంమీద, ఆయన సిద్ధాంతాలు, ఎత్తుగడలు మీద ఎవరి సందేహాలు వారివి.

కె.సి.ఆర్. హఠాత్తుగా భారతదేశపు భవిష్యత్తు మీద అంతులేని ప్రేమ పుట్టుకవచ్చిందంటే నమ్మేంత అమాయకులు కారు భారతీయులు. నిన్నమొన్నటి వారి పొరుగు ప్రాంతప్రజలను నీచమైన మాటలతో అవమానించిన నైజం కె.సి.ఆర్.ది.

నేటికీ ఆ ప్రాంతప్రజలమీద కసితో ఆస్తుల పంపకాలలో వారి వాటా వారికి ఇవ్వటానికి అడ్డంకులు సృష్టిస్తున్న ప్రభుత్వాధినేత కె.సి.ఆర్.అటువంటి నాయకుడు కేంద్రంలో అధికారంలో వున్న నరేంద్రమోడీ ప్రభుత్వం దేశంలోని కొన్ని ప్రాంతాల పట్ల వివక్షత చూపుతుందని అనగానే 'ఆహా' అనటం అంత సులభం కాదు ఏ పార్టీ వారికి.

'బంగారు తెలంగాణ' కె.సి.ఆర్. నినాదం. నాలుగేళ్ళలో తెలంగాణ బంగారం పండించిందని ఎవరు అంగీకరించటం లేదు. అయినా వచ్చే సంవత్సరం ఎన్నికలకు వెళ్ళకతప్పదు.గత ఎన్నికల్లో ఇచ్చినవాగ్దానాలన్నింటినీ తీర్చకపోతే తిరిగి ఓట్లు అడగటానికి రాను అని కె.సి.ఆర్. పదే పదే చెప్పినమాట వుండనే వున్నది. ఉద్యమసమయంలో శత్రువులుగా చూపించిన ఆంధ్రులలో ఉన్నతస్థాయి, సంపన్న వర్గాలతో కె.సి.ఆర్. లాలూచీ బహిరంగ రహస్యమే. ఇప్పుడిక ఆంధ్రుల మీద విసుర్లు, నిందలు పనికిరావు.

ఆంధ్ర వలసపాలకుల విధ్వంసం నుండి తెలంగాణను కాపాడారనే ఆ ప్రాంత ఓటర్లు ఆయనకు పట్టం కట్టారు. ప్రజల ఆశలను, ఆశయాలను ఏమేరకు తీర్చగలిగారన్న ప్రశ్నకు కె.సి.ఆర్. ఆయన ప్రభుత్వం సమాధానం చెప్పకతప్పదు.

పాత సెంటిమెంట్ పలచబడినపుడు కొత్త సెంటిమెంట్‌ని సరైన పద్ధతిలో నిర్మించుకున్న రాజకీయ నాయకుడికే మనుగడ. ఆ విషయం బాగా తెలిసిన రాజకీయనేత కె.సి.ఆర్. అందుకే ఇప్పుడు జాతీయ రాజకీయ బాధ్యత భుజానికి ఎత్తుకున్న తెలంగాణ బిడ్డరూపం ధరించి ఆ ప్రాంతప్రజలమీద కొత్తసెంటిమెంట్ సమ్మోహన అస్త్రంగా ప్రయోగిస్తున్నాడు.

తన రాష్ట్రంలో వున్న 17 లోక్‌సభ సీట్లతో జాతీయ స్థాయిలో చెయ్యగలిగిందేమీ లేదని తెలిసినా ప్రజల ముందు ఒక భారీ ఊహను చూపించాలనుకుంటున్నారు.ప్రాంతీయపార్టీలలో బలంగా వున్నవి రెండు మూడు మాత్రమే. అన్నింటికన్నా అధిక ప్రాంతీయపార్టీ చరిత్ర కలిగిన రాష్ట్రం తమిళనాడు.

50 ఏళ్ళుగా అక్కడ ద్రవిడపార్టీల అధికారం. 38 లోక్‌సభ సీట్లు కలిగిన రాష్ట్రం అది. అక్కడే రెండు ప్రాంతీయపార్టీలు ఏదో ఒక జాతీయపార్టీ పంచన చేరుతున్నాయి. ఆ తర్వాత 42సీట్లు కలిగిన రాష్ట్రం పశ్చిమబెంగాల్. అయినా ప్రాంతీయపార్టీ మొత్తం సీట్లను గెలుచుకోలేని పరిస్థితి.

ప్రాంతీయ పార్టీలన్నీ కలిసినా వాటిబలం వంద నుండి 150 సీట్లకు మాత్రమే పరిమితం.

ఆ 150 సీట్లు పూర్తిగా ప్రాంతీయ పార్టీల సొంతం అయ్యే అవకాశం లేదు. కాని ఎన్నికల ఫలితాల గణాంకాలలో జాతీయపార్టీలైన బిజెపి, కాంగ్రెస్‌ల కన్నా ప్రాంతీయ పార్టీలు, ఇతర పార్టీల ఓట్లు అధికంగా కనిపిస్తాయి.ఆ గణాంకాలనాధారం చేసుకుని జాతీయ స్థాయిలో ప్రాంతీయశక్తుల పునరేకీకరణ ఆలోచన చెయ్యటం బలహీన పునాది మీద భారీ భవనం నిర్మించటం లాంటిదే.

*** సైద్ధాంతిక పునాది ఏది**

ప్రాంతీయ శక్తులు ఢిల్లీలో ప్రభుత్వం ఏర్పాటు చెయ్యలేవు. ఏదోక జాతీయపార్టీ మద్దతుతో మాత్రమే ప్రభుత్వాన్ని ఏర్పాటు చేస్తాయి. అలా ఏర్పాటుచేసిన నేషనల్, యునైటెడ్ ఫ్రంట్‌ల చరిత్ర భారతీయులందరికీ తెలిసినదే. పేరుకు ప్రాంతీయ పార్టీల నేత ప్రధాని, కాని అధికారం జాతీయపార్టీ నాయకుల దయాదాక్షిణ్యంమీద.

వి.పి.సింగ్, చంద్రశేఖర్, దేవగౌడ్, ఐ.కె.గుజ్రాల్ వంటివారంతా మాజీ ప్రధానులుగా ఎంత వేగంగా మారిపోయిందీ,అందుకు దారితీసినపరిస్థితులుఎటువంటివో ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరంలేదు.

అలా ప్రాంతీయపార్టీల కూటమి విఫలమైన ప్రతిసారి ప్రజలు తిరిగి జాతీయపార్టీలకు ఓటువేసి గెలిపించారనేది వాస్తవం. ప్రాంతీయపార్టీ కూటమితో ప్రజలు విసిగిపోయారు. రాజకీయ సుస్థిరతవల్ల అభివృద్ధి సాధ్యమవుతుందనే విషయం గడచిన 20ఏళ్ళలో రుజువైంది.

2019 ఎన్నికల నాటికి నరేంద్రమోడీ ప్రభ తగ్గుతుందని,కాని కాంగ్రెస్ కోలుకోలేదని,మోడీకి పోటీగా నిలవగలిగిన సత్తా రాహుల్‌గాంధీలో లేదన్న అంచనాతో ఆ ప్రతిపక్షనేతస్థానాన్ని తాను భర్తీచెయ్యగలనన్నది కె.సి.ఆర్. ఆలోచన అయివుండవచ్చు.

కాని అటువంటి అవకాశం కె.సి.ఆర్.కి దొరకటం కష్టం.ఇతర పార్టీలతో దీర్ఘకాల సత్సంబంధాలు కలిగిన చంద్రబాబునికాదని కె.సి.ఆర్.వైపు ఏ ప్రాంతీయ శక్తులైనా ఎందుకు మొగ్గుతాయి. ప్రాంతీయ పార్టీలు లేదా తృతీయఫ్రంట్ భావన అంగీకారమే అయినా సైద్ధాంతిక పునాది లేనటువంటిది ఆ ఫ్రంట్.

ప్రాంతీయపార్టీల నాయకులందరివీ అత్యాశలే.

**డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు**

# క్రీడాకారులకు ఉపయోగపడే డీఎన్ఏ స్కాన్




**డా॥ అజయ్ సింగ్ ఠాకూర్**
కన్సల్టెంట్ ఆర్థోస్కోపీ అండ్ స్పోర్ట్స్ సర్జన్
భుజం, మోకాలు గాయాల నిపుణులు
స్టార్ హాస్పిటల్స్, రోడ్ నెం.10,
బంజారాహిల్స్, హైదరాబాద్.
Ph: 70970 60006, 040-44777777


కష్టపడి పనిచేసే తత్వం, అంకిత భావం తప్పనిసరిగా క్రీడాకారుడికి ఉండాల్సిన లక్షణాలు. అయితే మనలోని జన్యువులు కూడా ఇందుకు దోహదం చేస్తాయా? 1999వ సంవత్సరంలో బెర్లిన్‌లో ఒక సూపర్ బేబి పుట్టాడు. అతడి తొడలు, భుజాల దగ్గర ప్రత్యేకంగా బలమైన కండరం అభివృద్ధి చెందడం మొదలు పెట్టింది. నాలుగు(4) సంవత్సరాల వయసు వచ్చేనాటికి చాలా మంది పెద్దలు కష్టంగా చేసే పనులు కూడా ఆ బాబు చాలా సులభంగా చేయగలిగాడు. అతడిలోని జీన్స్‌లో చిన్న పరిణామం చెందడం వల్ల ఇలా జరిగింది. అప్పటి నుంచి శరీరంలోని రహస్యాలను తెలుసు కునేందుకు ప్రపంచ శాస్త్రవేత్తలంతా కూడా జన్యువుల బ్లూప్రింట్ అధ్యయనం మీద దృష్టి సారించారు. డీఎన్ఏ అధ్యయనం ద్వారా ఏ మనలోని జన్యువులు డీఎన్ఏ అనే చిన్నచిన్న బ్లూ ప్రింట్స్‌తో ఏర్పడుతాయి. ఈ డీఎన్ఏలోనే జీవిత రహస్యాలు దాగి ఉంటాయి. వీటి ద్వారానే శరీరంలోని అన్ని కణాలకు వాటి విధులను నిర్వర్తించేందుకు అవసరమైన సమాచారం చేరుతుంది. ఈ అంశం గురించిన పరిశోధనలు జరుపుతున్న శాస్త్రవేత్తలు స్పీడ్ జీన్ లేదా స్ప్రింట్ జీన్ అనే ఒక జన్యువును గుర్తించారు. ఈ జీన్స్ రెండు జతలు కలిగిన వారు సాకర్, బాస్కెట్ బాల్, షార్ట్ స్విమ్మింగ్ షార్ట్ బైకింగ్ వంటి క్రీడల్లో ప్రతిభ కలిగి ఉంటారు. ఇలాంటి జీన్స్ లేని వారు లాంగ్ స్విమ్మింగ్, రన్నింగ్, బైకింగ్ వంటి వాటిల్లో ప్రతిభ కలిగి ఉంటారు ఒక జత స్పీడ్ జీన్స్ కలిగిన వారు ఎలాంటి క్రీడలోనైనా పెద్దగా కష్టం లేకుండానే రాణిస్తారు.



స్పోర్ట్స్‌లో ఎవరు ఎంత వరకు విజయం సాధించవచ్చు వంటి విషయాలను కొంత వరకు అంచనా వెయ్యవచ్చు. అంతేకాదు క్రీడల్లో ఎలాంటి గాయాలు అయ్యేందుకు ఆస్కారం ఉంది, ఎలాంటి ఆహారం తీసుకోవడం మంచిది వంటి అంశాలను సైతం అంచనా వెయ్యడం కొంత వరకు సాధ్యపడుతుంది. ఇప్పడు అందుబాటులో ఉన్న శాస్త్ర పరిజ్ఞానాన్ని ఉపయోగించి క్రీడా కారుల డీఎన్ఏ స్కాన్ చెయ్యడం ద్వారా వారిలో నైపుణ్యాలు పెంపొందించుకోవడానికి కావాల్సిన జాగ్రత్తలు తీసుకోవడానికి అవకాశం ఏర్పడుతుంది. ఇది వారిలోని పోటితత్వానికి ప్రోత్సాహాన్ని ఇస్తుంది.

క్రీడల వల్ల కలిగే గాయాల తాకిడిని తగ్గించుకునేందుకు జీన్ టెస్టింగ్ ఉపయోగడుతుంది. ఈ గాయాలు చాలా సందర్భాల్లో క్రీడాకారుల క్రీడా జీవితానికి ముగింపుకు కారణమవుతాయి. ఇది వ్యక్తిగతంగా క్రీడాకారులకు మాత్రమే కాదు క్రీడా సమాఖ్యలకు కూడా తీరని నష్టానికి కారణమవుతాయి. గాయాలకు దూరంగా ఉంటూ ఆరోగ్యాన్ని కాపాడుకోవడం క్రీడాకారులకు తప్పనిసరి. డీఎన్ఏ స్కాన్ ద్వారా గాయాలు ఏర్పడేందుకు ఎంతవరకు ఆస్కారం ఉందనేది ముందుగానే తెలుసుకునేందుకు అవకాశం ఉంటుంది. డీఎన్ఏ స్కాన్ ద్వారా ఏసిఎల్ లిగమెంట్ రప్చర్, టెండినోపతి వంటి ఇతర లిగమెంట్ సంబంధిత గాయాలు ఏర్పడేందుకు ఎంత వరకు ఆస్కారం ఉందో ముందుగానే ఊహించవచ్చు. ఈ పరీక్ష ద్వారా ప్రాణాలకు ప్రమాదం ఏర్పరిచే కార్డియో మయోపతి వంటి గుండె సమస్యలను కూడా ముందుగానే పసిగట్టేందుకు ఆస్కారం ఉంటుంది.

జెనెటిక్ కోడ్ ద్వారా ఎలాంటి ఆహారానికి మన శరీరం ఎలా ప్రతిస్పందిస్తుందో కూడా తెలుసుకోవడం వీలవుతుంది. కార్బోహైడ్రేట్లు తీసుకునే ప్రతి ఒక్కరు బరువు పెరగరు. ఎక్కువ బరువు ఉన్న ప్రతి ఒక్కరు ఎక్కువ కార్బోహైడ్రేట్లు తీసుకోరు. దీన్ని బట్టి ఆహారం నుంచి వచ్చే శక్తిని కొంత మంది శరీరాలు మ రింత సమర్థవంతంగా ఉపయోగించు కోగలుగుతున్నాయని అర్థం అవుతోంది. డీఎన్ఏ స్కాన్ ద్వారా లాక్టోజ్, గ్లుటేన్ ఇన్‌టాలరెన్స్‌ను కూడా గుర్తించడం వీలవుతుంది.

జీన్ ఎథెరపీ ద్వారా ప్రతి వ్యక్తికి వారి శరీరం తీరును అనుసరించి ఆరోగ్య సంరక్షణా విధానాలను రూపొందించేందుకు వీలు ఏర్పడుతుంది. భవిష్యత్తులో ఇలాంటి చికిత్సా విధానాలు రూపొందించబడతాయని చెప్పడంలో ఆశ్చర్యం లేదు. డీఎన్ఏ స్కాన్ వల్ల కేవలం క్రీడాకారులకు మాత్రమే కాదు ఆరోగ్యం కోసం తపన పడే ప్రతి ఒక్కరికి ఉపయోగపడే ప్రక్రియ. ఇది సరైన క్రీడను ఎంచుకోవడానికి, శిక్షణ తీసుకోవడానికి ఎంతో ఉపయోగపడే అద్భుతమైన ప్రక్రియ.



# సర్వోత్తమం ఉగాది పర్వదినం

ఎంతో సువాసనని వెదజల్లుతూ, ఎన్నెన్నో ఆకర్షణీయ పుష్పాలతో నిండిన పూల పొదని ఎటువైపునుండి చూసినా ఎంతో గొప్పగా అనిపించేటట్లు, ఎన్నెన్నో రహస్యాల ముద్ద అయిన ఉగాది పర్వదినాన్ని ఏ కోణంలోనుండి చూసినా ఎంతో గొప్పదనంతో కనిపిస్తూనే ఉంటుంది.

## 'మొదటి' గొప్పదనం

సంవత్సరాల్లో ఉండే అయనాల్లో మొదటిది 'ఉత్తరాయణం'. దాంట్లోవచ్చే ఋతువుల్లో మొదటిది వసంతం. ఆ ఋతువులో వచ్చే మాసాల్లో మొదటిది చైత్రం. ఆ చైత్రంలో వచ్చే పక్షాల్లో మొదటిది శుద్ధ పక్షం. ఈ పక్షంలో వచ్చే తిథుల్లో మొదటిది పాడ్యమి. ఆ పాడ్యమిలో వచ్చే రెండు కాలాల్లో మొదటిది పగలు. ఆ పగటిలో వచ్చే ముహూర్తాల్లో మొదటిది బ్రాహ్మీముహూర్తం.

ఇలా చూస్తే ఉగాది అనే ఈ పర్వదినం- అయనాల్లో మొదటిదైన ఉత్తరాయణంలో, ఋతువుల్లో మొదటిదైన వసంతంలో, మాసాల్లో మొదటిదైన చైత్రంలో, పక్షాల్లో మొదటిదైన శుద్ధంలో, తిథుల్లో మొదటిదైన పాడ్యమిలో, పాడ్యమిలో మొదటిదైన పగటిలో, ముహూర్తాల్లో మొదటిదైన బ్రాహ్మీముహూర్తంలో, సృష్టి స్థితిలయాల్లో మొదటిదైన సృష్టి అనే కార్యాన్ని, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల్లో మొదటివాడైన బ్రహ్మ ప్రారంభించగా వచ్చింది. అంతటిదీ అన్ని మొదటితనాలని సొంతం చేసుకున్నదీ 'ఉగాది'.

## జనవరి 1 ఎన్నటికీ కా(లే)దు

జనవరి 1 సంవత్సరాది ఎందుకు కాదో-కాలేదో- ఎందుకు అనర్హమైనదో కూడా తెలుసుకోవడం అవసరం. ఉగాదికి చెట్లన్నీ చిగిర్చి పూతపట్టీ లేదా పిందెలతో, ఫలాలతో కన్పిస్తాయి.

జనవరి 1కి శిశిర ఋతువైన కారణంగా చెట్లన్నీ ఆకులురాలుస్తూ దుఃఖకరంగాకన్పిస్తూ చెట్లన్నీ బోడి అయిపోతూ ఉంటాయి. ఉగాదికి గాదెలన్నీ నిండుగా కన్పిస్తూ పిల్లలకి పెళ్ళిళ్ళూ, కొత్త ఆస్తుల కొనుగోళ్ళూ, వినోద విహార యాత్రలూ... వంటి ఆలోచనలతో ఆనందమవుతుంది ప్రతి వ్యక్తికీ. జనవరి 1 నాటికి గాదెలన్నీ ఖాళీగా కన్పిస్తూ, పెట్టుబడి పెట్టిన సొమ్ము కొంతైనా లాభంతో తిరిగొస్తుందా? రాదా? అనే అలజడి రైతుల్లో ప్రారంభమవుతుంది.

ఉగాదికి పారే నీటితో లేదా చల్లని నూతినీటితో స్నానాన్నిచేసే అరుదైన అవకాశముంటుంది. జనవరి 1కి జలాశయాలన్నీ ఎండిపోతూ, మిగిలిన ఆ కాసిని నీళ్ళుకూడా స్నానానికి వెళ్ళబోతే బురదతో కూడుకుని ఉంటాయి.

**ఉగాది : 18.3.2018**

ఉగాదికి చక్కనిగాలి చలివేడిమిలతో వీస్తూఉంటూ ఏ చెట్టునీడన జారబడినా చక్కని నిద్రనిచ్చేదవుతూంటే, జనవరి 1కి చలీ దానితోపాటు మంచూఉండే కారణంగా గొంతునొప్పీ, జలుబూ, దగ్గూ, జ్వరమూ వంటివి వచ్చి శారీరక బాధని కలుగజేస్తాయి.

ఉగాది రోజునే అందరు అమ్మలకీ, అమ్మ అయిన ఆ జగదాంబకి సంబంధించిన వసంత నవరాత్రోత్సవాలు ప్రారంభమై మన ఇంట్లో చేసుకోబోయే శుభ కార్యాలకి ఏయే ఏర్పాట్లుచేసుకోబోతున్నామో, వాటికి సంబంధించిన ముహూర్తాలని పెట్టించుకుంటూంటే, జనవరి 1 దాదాపు పుష్య మాసంలో వస్తుంది కాబట్టి శుభకార్యమనే మాటే ఉండదు.

## రెండవ గొప్పదనం

ఉగాదికి పిచ్చుకలకిచకిచలూ, కోకిలల కూకూలు, చిలుకల కిలకిలారావాలూ... ఇలా ఎన్నెన్నో విన్పిస్తూంటే, జనవరి 1కి విపరీతమైనమంచూ, చలీ కారణంగా పక్షులన్నీరెక్కలుముడుచుకుని కన్పిస్తాయి.

మొదటి పంటగా వచ్చిన చెరకుముక్కని తీపి కోసం, మొదటి పంటగా వచ్చిన చింతపండుని పులుపుదనంకోసం, మొదటి పంటగా వచ్చిన మిరి

వ్యవస్థాపక ధర్మకర్తలు :
శ్రీ పి.వి.కృష్ణారెడ్డి గారు & శ్రీమతి సుధ గారు

శ్రీ భూసమేత వేంకటేశ్వరస్వామి వారి
ఆవిర్భావ దినోత్సవం తేది 30-05-2015



# శ్రీ భూసమేత శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానం
## డోకిపఱ్ఱు మహాక్షేత్రం, కృష్ణాజిల్లా




## రోజువారి నిత్యకార్యక్రమ కైంకర్యములు

### నిత్యోత్సవాలు

**ఉదయం**
6.00 - 6.15 సుప్రభాతం
6.15 - 7.00 విశ్వరూప దర్శనం
7.00 నుండి 8.30 వరకు - ప్రాతః కాలార్చన, తోమాలసేవ, అష్టోత్తర శతనామార్చన, నివేదన, నిత్యహోమం, బలిహరణ, హారతి
8.30 - 10.00 సర్వదర్శనం
10.00 నుండి 10.30 వరకు - మధ్యాహ్నారాధన, నివేదన, హారతి
10.30 - 12.00 సర్వదర్శనం
12.00 - మహానివేదనం

**సాయంత్రం**
5.30 - 6.30 సర్వదర్శనం
6.30 నుండి 7.30 వరకు - సాయంకాలార్చన, (సహస్రనామార్చన-అష్టోత్తరం), నివేదన, నిత్యహోమం, బలిహరణ, హారతి
7.30 - 8.30 సర్వదర్శనం
8.30 నుండి 9.00 వరకు - తిర్వ, ఏకాంతసేవ, హారతి.

### ఆర్జిత సేవలు

సోమవారం : ఆలయంలో వెలసిన సిద్ధి వినాయకస్వామివారికి అభిషేకం ఉ॥ (9.00 నుండి 9.30)
మంగళవారం : స్వర్ణపుష్పార్చన (బంగారు పూలతో ఆరాధన) ఉ॥ (7.30 నుండి 8.00)
గురువారం : పూలంగిసేవ (అర్చితం), నేత్రదర్శనం (ఉ॥ 7.30 నుండి 8.30), తిరుప్పావడ సేవ (అర్చితం ఉ॥ 9.00 నుండి 9.30)
శుక్రవారం : మూలమూర్తులకు (వేంకటేశ్వర స్వామి, పద్మావతి, గోదా అమ్మవారు) (ఉ॥ 8.00 నుండి 8.30) అభిషేకము. సా॥ 6.00 - 7.00 ఊంజల్ సేవ, కుంకుమార్చన, పద్మావతి అమ్మవారి ఆలయ ప్రదక్షిణోత్సవం.
శనివారం : వజ్రాలంకరణ సేవ(శ్రీ వేంకటేశ్వరస్వామి వారికి)(ఉ॥ 6.30 నుండి 7.30) ఉ॥ 7.30 నుండి 12.00 వరకు విశేష దర్శనం.
సాయంకాలం శ్రీ భూసమేత వేంకటేశ్వర స్వామికి ఊంజల్ సేవ, ఆలయ ప్రదక్షిణోత్సవం
ఆదివారం : (ఉ॥ 9.30 నుండి 11.00) ప్రతినెలలో చివరి ఆదివారం శ్రీవారి కళ్యాణ మహోత్సవం.

### ఆస్థానోత్సవాలు

ఈ క్రింది ఆస్థానములు ఆయా నక్షత్రములలో సాయంత్రం 7.00 నుండి 7.30 వరకు జరుగును.
శ్రవణా నక్షత్రం - శ్రీ భూ సమేత వేంకటేశ్వరస్వామి వారికి ఆస్థానము, లక్ష్మీ నారాయణ స్వామి, లక్ష్మీ వరాహస్వామి, విఖనసాచార్యస్వామి వారికి ఆస్థానము.
రోహిణి నక్షత్రం - రుక్మిణీ సమేత నవనీత కృష్ణునికి ఆస్థానము.
ఉత్తర నక్షత్రం - పద్మావతి అమ్మవారికి ఆస్థానము.
పుబ్బ నక్షత్రం - గోదాదేవికి ఆస్థానము.
పునర్వసు నక్షత్రం - సీతా లక్ష్మణ సమేత కోదండరామస్వామివారికి ఆస్థానము.
పూర్వాభాద్ర - ఆంజనేయస్వామి వారికి ఆస్థానము.
పూర్వాషాఢ - విష్వక్సేన స్వామికి ఆస్థానం.
హస్త నక్షత్రం - మహాగణపతికి ఆస్థానం.

### అభిషేకాలు

మొదటి సోమవారం - రామానుజవారు
రెండవ సోమవారం - మహాగణపతి
మూడవ సోమవారం - వకుళమాత, నాగరాజు, గణేష
నాల్గవ సోమవారం - ఉత్సవమూర్తులు (అభిషేకం)

మొదటి మంగళవారం - ఆంజనేయస్వామి
రెండవ మంగళవారం - కోయిల్ ఆళ్వార్ తిరుమంజనం
మూడవ మంగళవారం - దశావతారాలు
నాల్గవ మంగళవారం - కోయిల్ ఆళ్వార్ తిరుమంజనం

మొదటి బుధవారం - విష్వక్సేనుల వారు
రెండవ బుధవారం - లక్ష్మీనారాయణస్వామి
మూడవ బుధవారం - జయ-విజయులు

మొదటి గురువారం - విఖనసాచార్యులవారు
రెండవ మంగళవారం - వరాహస్వామి
మూడవ మంగళవారం - గరుడాళ్వార్

ప్రతి శుక్రవారం - వేంకటేశ్వరస్వామి, పద్మావతి, గోదా సన్నిధులు.

శ్రీ భూసమేత శ్రీవేంకటేశ్వరస్వామి దేవాలయము, డోకిపఱ్ఱు మహాక్షేత్రం కలియుగ వైకుంఠమై నిత్యం గోవింద నామస్మరణతో మారుమోగుతూ ఉంటుంది. డోకిపఱ్ఱు మహాక్షేత్రం మహిమాన్వితం. వేం అంటే పాపాలు, కట అంటే ఇట్టి దివ్యక్షేత్రమును ఆలయ వ్యవస్థాపక ధర్మకర్తలు శ్రీమాన్ శ్రీ పురిటిపాటి వెంకట కృష్ణారెడ్డిగారు, తమ సతీమణి శ్రీమతి సుధాగారులు దివ్యశ్రీ వైఖానసాగమోక్తవిధిగా మే 2015వ సంవత్సరము 30వ తారీఖున అతి ఘనముగా ఆలయ ప్రతిష్ఠ మహోత్సవములు నిర్వహించారు. ఆలయ ప్రతిష్ఠకు లక్షమంది భక్తులు విచ్చేసి స్వామి వారిని దర్శించుకొన్నారు అంటేనే ఆ స్వామివారి గొప్పతనము ఇంత అంత అని చెప్పజాలం.

ఆ రోజునుండి ఈ దివ్యక్షేత్రములో నిత్య సేవలు, ఉత్సవములు తిరుమల పద్ధతిగా నిత్య కైంకర్యములు జరుప బడుచున్నారు. శ్రీభూసమేత శ్రీవేంకటేశ్వరస్వామివారి దివ్యక్షేత్రములో స్వామివారు శ్రీభూసమేతముగా తన పరివార దేవతలతో కూడి వెలసియున్నారు. "శ్రీభూసమేత శ్రీవేంకటేశ్వరస్వామివారి దేవస్థానము, డోకిపఱ్ఱు మహాక్షేత్రం" అని కీర్తిగాంచిన ఈ దేవాలయంలో కలియుగ ప్రత్యక్షదైవం శ్రీవెంకటేశ్వరస్వామివారు, శ్రీపద్మావతి అమ్మవారు, శ్రీగోదాఅమ్మవారు, శ్రీసీతాలక్ష్మణసమేత శ్రీకోదండరామస్వామి, శ్రీవిఖనసచార్యులవారు, శ్రీవిష్వక్సేనులవారు, శ్రీప్రసన్నఆంజనేయస్వామి, శ్రీగరుడాళ్వార్, శ్రీమహాగణపతిస్వామి, శ్రీలక్ష్మీనారాయణస్వామి, జీవద్వాజ, శ్రీలక్ష్మీ నారాయణస్వామి, దశావతారాలు, శ్రీలక్ష్మీవరాహస్వామి, శ్రీవకుళమాత, రాజగోపురం, నాగరాజు, ద్వారపాలక, శ్రీవారి పుష్కరిణి. ఈ దేవతలందరూ భక్తజన సంరక్షణార్థమై ఒకే ప్రాకారంలో వెలసియున్నారు.

**శ్రీ భూసమేత శ్రీవేంకటేశ్వరస్వామి సన్నిధికి రండి!! దర్శించండి!! తరించండి!! సర్వేజనాః సుఖినోభవన్తు**

యపు గింజని కారంకోసం, మొదటి పంటగా వచ్చిన మామిడిముక్కని ఒగరుదనంకోసం, మొదటి పంటగా వచ్చిన ఉప్పుని ఉప్పదనంకోసం, అలాగే మొదటి పూతగా వచ్చిన వేపపువ్వుని చేదుతనంకోసం తెచ్చుకుని ఉగాది పచ్చడిని చేస్తాం.

తీపిదనంకోసం చెరకునే ఎందుకు వాడాలి? బెల్లాన్నో, పంచదారనో ఎందుకు వేయకూడదు? చెరకు ముడిపదార్థం. బెల్లం, పంచదార అనేవి వండగా వచ్చిన పదార్థాలు కాబట్టి వాడకూడదు. అలాగే 'కటు' తింటే కారం అనేది అర్థం.

అయితే మిరియం అనేది ఓషధీగుణం కలిగిన కారపు ద్రవ్యం. ఒకప్పటి రోజుల్లో జలుబూ, కంఠం నొప్పి వంటి వాటికి మిరియమే మందుగా వాడేవారు. కణతల నొప్పికి మిరియాలని అరగదీసిన గంధాన్ని కణతలకి రాస్తూండేవారుకూడా.

అలాగే ఒగరుదనం వాక్కాయకున్నా అది ఈ కాలంలో రాదు. ఒగరుదనం క్రమంగా పుల్లగా ఆ మీదట తీయగా మారబోతున్న మామిడిని, ఒగరుదనం ఉండేవేళ ఉండే ఓషధీగుణాన్నీ మాత్రమే ఈ పచ్చడిలో చేర్చాలనేది ఇక్కడి రహస్యమన్నమాట.

సముద్రపు ఉప్పుని మాత్రమే పచ్చడిలో చేర్చాలి. ఇక కాకరకాయలో చేదుతనమున్నా పూతమీదున్న వేపలోని చేదుతనానికే ఇక్కడి పచ్చడిలో చేర్చగల ఓషధీశక్తి ఉంటుందనే ఉద్దేశ్యంతో దీన్నిమాత్రమే చేర్చాలన్నారు పచ్చడిలో.

ఒక్క ఓషధీ గుణంగల వస్తువునితీసుకుంటే అది ఔషధమవుతుంది. అదే ఓషధీగుణమున్న అనేక వస్తువులని కలిపితే మహౌషధమవుతుంది.

అయితే ఈ మహౌషధాన్ని సంవత్సరం పొడుగునా కాదు-ఈ చైత్రమాసం నిండుగా వాడాలని పెద్దలు ఈ సంప్రదాయాన్ని ఏర్పాటుచేశారంటే ఈ కాలంలో రాబోయే ఉష్ణవ్యాధులకీ, వాతావరణ సంధిలో వచ్చే అనారోగ్యాలకీ ఇది నిజమైన ఔషధమన్నమాట. కాబట్టి పండుగ పేరిట వైద్యాన్ని చేస్తున్న శ్రీహరి నిజమైన వైద్యుడు కదా!

## మూడవ గొప్పదనం

**పం**చభూతాలతో ఉంది కాబట్టే దీన్ని ప్ర-పంచ మన్నారు. ఆ ఐదింటిలోనూ కొత్తదనం వస్తుంది ఉగాదికి.విపరీతమైన ఎండలున్న ఈ కాలంలో నేల, చెట్లుద్వారా చిగుర్లనీ, పిందెలనీ, కాయలనీ, ఫలాలనీ అందించడం వింతకాదూ! సహజంగా వర్షాకాలంలో కదా చిగురుస్తాయి.

ఇక పంచభూతాల్లో రెండవదైన జలాలు ఎండిపోతాయి సాధారణంగా. అయితే ఈ ఉగాదినాటికి నీళ్ళలో రసగుణం (కొత్త రుచి) చేరుతుంది.ఆ రసగుణంద్వారానే చెట్లు చిగుర్చడం, భూమిలోనినీరు దాహాన్ని తీర్చగలగడం, స్నానం చేయగానే ఆహ్లాదంగా అనిపించడం... వంటివి ఏర్పడతాయి.

ఇక మూడవదైన తేజస్సు (ఎండ) వాతావరణం నిండుగా ఉన్నా ఏ చెట్టుకిందైనా సరే కూర్చుంటేచాలు నిద్రవచ్చే తీరుగా ఉంటుంది. సాయంకాలం అవుతోందంటే చాలు- ఇది వేసవి- అనే ఆలోచనని పూర్తిగా మర్చిపోయేలాచేస్తుంది.

ఇక నాల్గవదైన వాయువు ఎవరికైనాగాయాలు తగిలినట్లైతే చక్కని ఓషధిలా పనిచేస్తూ వీస్తూ ఉంటుంది. ఐదవదైన ఆకాశం నుండి గాలి పుష్కలంగా వస్తూ (ఆకాశాద్వాయుః...) వేడిమితో ఉన్న నేలని చల్లబరిచేస్తూ ఉంటుంది, రాత్రి ప్రారంభమయ్యే సమయానికి. అందుకే ఇప్పటికీ గ్రామాల్లో ఆరుబయట పక్కలేసుకుని కన్పిస్తారు రాత్రివేళకి.

ఇలా తమధర్మాలకి విరుద్ధంగా ఉంటాయి పంచభూతాలూ.



## నాల్గవ గొప్పదనం

**రా**ముడు పుట్టినదీ, రామచంద్రునికి పట్టాభిషేక ముహూర్తం పెట్టబడిందీ, రావణుని వధకోసం ఆయన ముహూర్తాన్ని దేవతలు తప్పించి దండకకి పంపినదీ, రావణునితో విరోధాన్ని శూర్పణఖ (ముక్కూ, చెవుల్నీ, లక్ష్మణుడు కోసి వేయడంద్వారా) ఏర్పాటుచేసినదీ, రావణవధ ముగిశాక రాముడు సీతాలక్ష్మణసమేతుడై తిరిగిఅయోధ్యకి వచ్చినదీ, ఈ నడుమ సుగ్రీవుని శరణుకోరినదీ-

ఆంజనేయుడు ప్రవేశించి రామునితో పరిచయాన్ని ఏర్పాటుచేసుకుని రాముణ్ణి దర్శించినదీ... అన్నీ కూడా ఈ వసంత కాలంలోనే.

## ఐదవ గొప్పదనం

**కొం**తకాలమయ్యాక ఎలా మనకి ఎన్నికలూ, మంత్రుల పదవీ స్వీకారాలూ అనేవి ఉంటాయో ఆ విధానానికి నాంది శ్రీహరి పలికినదే. ప్రతి సంవత్సరం శ్రీహరి,ఆయా యుగాల్లోనిజనులకి ఏలక్షణాలుండి, ఎంతకాలంపాటు ఆ యుగం ఉండాలో నిర్ణయించేది, వసంతంలోనే.అందుకే ప్రతిసంవత్సరం రాజూమంత్రి-సేనాధిపతి-మేఘాధిపతి-సస్యాధిపతి... అంటూ ఇలా నవ (9) నాయకులని ఏర్పాటుచేస్తాడు.

ఈ విషయాన్ని రహస్యంగా దాచకుండా పంచాంగమనే దానిద్వారా జనులందరికీ అర్థమయ్యేలా వివరించి చెప్పవలసిందనీ-ఆ యా పరిహారాలని పాటిస్తూ ఆ యా కష్టాలని దాటవలసిందని జ్యోతిష పండితులని ఏర్పాటుచేస్తాడాయన.

అందుకే ఈ ఉగాది రోజున పంచాంగాన్ని పండితుడు చెప్తాడు-జనం వింటారు- రాబోయే దుఃఖాలకి తగిన పరిష్కార మార్గాలని తెలుసుక్కుని ఆచరిస్తారు. తోవలో నడుస్తున్న వ్యక్తికి ఎక్కడ గొయ్యి రాబోతోందో, ఎక్కడ సరస్సుందో, ఎక్కడ జంతు సంచారముంటుందో ఎవరైనా ముందుగానే తెలియజేస్తే ఎంత ఆనందమో, ఆ మాటలు మార్గదర్శకాలో, అలాచేస్తాడు కాబట్టే శ్రీహరిని స్థితి (రక్షణ) కారకుడంటాం.,

## శుభాకాంక్షలు

ఏదో మనందరం చెప్పుకునే తీరుగా (విష్ యూ హ్యాపీ న్యూ ఇయర్) కాకుండా ఋషులు శుభాకాంక్షలని ఇలా తెల్పారు.

కాలే వర్షతు పర్జన్యః (సకాలంలో మేఘాలు అన్ని చోట్లా కురియుగాక!)

పృథివీ సస్యశాలినీ (భూమి మొత్తం పంటలతో నిండుగాక!)

అపుత్రాః పుత్రికా స్సంతు (సంతానం లేని వారికి సంతానం కల్గుగాక)

పుత్రిణ స్సంతు పౌత్రిణః (సంతానానికి మళ్ళీ సంతానం కలిగి తాతలూ, అమ్మమ్మలూ అగుదురుగాక!)

దేశో ౨యంక్షోభరహితః (దేశమంతా కల్లోలాలు లేకుండుగాక!)

రాజాన స్సంతు నిర్భయాః (నేరం చేసినవారికి తగిన శిక్షని భయం లేకుండా రాజులు వేస్తూ లోకాన్ని రక్షింతురుగాక!)

ఎంతగొప్ప శుభాకాంక్షలు! దేశం, ప్రజలు, ఇంట్లో వ్యక్తులూ... ఇలా ఇందరికీ అవకాశాన్నిస్తూ కన్పించే శుభాకాంక్షలు నిజం కావాలని దైవాన్ని ప్రార్థిద్దాం! నూతనవత్సరం! నీకు స్వాగతం!!

డా॥ మైలవరపు శ్రీనివాసరావు


టచ్ మి టచ్ మి
టచ్ మి
₹10,000 బహుమతి కథ
పినిశెట్టి శ్రీనివాసరావు
సెల్ : 89785 39038

"డోంట్ టచ్‌మీ... ఐ హేట్ యు" అని పక్కకు తిరిగి పడుకుంది శాన్వి.

"హేయ్ హనీ! ఏమైంది నీకు?" అంటూ బలవంతంగా శాన్విని తనవైపుకు తిప్పుకుని లిప్‌కిస్ చేశాడు శ్యామ్. "ఛీ.. చెప్తుంటే అర్థంకాదా నీకు?" అంటూ శ్యామ్‌ని వెనక్కు నెట్టి, కుడిచేత్తో తడంటిన తన పెదాలను తుడుచుకుంది శాన్వి.

"స్వీటీ, కమాన్ యార్" అంటూ శాన్విని రెండు చేతుల్తో చుట్టేసి మీదకు లాక్కున్నాడు శ్యామ్.

"ఛీ కొడ్తున్నా సిగ్గులేదా నీకు?" అంది శాన్వి. నిజానికి శ్యామ్ బిగికౌగిట బందీగా ఉండాలనే ఉన్నా, పైకి బెట్టుపోయింది.

"యూసీ మిస్టర్... నువ్వు నా మాట విననంతకాలం మన మధ్య ఇకమీదట ఎలాంటి శారీరక సంబంధం, సరససల్లాపాలు ఉండవు. ఇదే ఫైనల్ వార్నింగ్.

నీ బోడి బాడీ చూసి నేను 'ఫిదా' అయిపోతానను కుంటున్నావు కదూ! నెవ్వర్... నాకూ ఉంది బ్యూటిఫుల్ బాడీ (బ్యూబా). అది నీకూ తెలుసు.

దాని అవసరం నాకంటే నీకే ఎక్కువుంది. సో... నా 'బ్యూబా' కావాలంటే, నువ్వు నీ 'మెహబూబా' మాట వినాల్సిందే. కాదంటే నీకు ఇక మీదట అన్నీ 'డ్రై' రాత్రుళ్ళే" అంటూ దూరంగా జరిగి పడుకుంది శాన్వి. కానీ తన మనసంతా నువ్వే అన్నట్లు శ్యామ్ గురించే ఆలోచనలు చుట్టుముట్టాయి.

బాహుబలి బాడీకి తోడు బ్రూస్‌లీ వేగం శ్యామ్‌కు ఉన్న బలం. 'శ్యామ్ కంటిచూపులో సూదంటురాయి ఉంది. నడకతీరులో హుందాతనం యూనిక్ స్టైల్ ఉంది. హావభావాల్లో ప్రతి కదలికలో కట్టిపడేసే ప్రత్యేకత ఉంది.

మాటల్లో పొందిక, చేతల్లో నైపుణ్యం, నవ్వులో కొంటెతనం, సరసంలో చిలిపితనం... మైగాడ్! ఆ రొమాంటిక్ ఫెలో ఎదురుగా ఉంటే, 'జగతిని ఉన్నది మనమిద్దరమే అని హత్తుకుపోతుంటే' అన్నట్లుంటుంది. అదే... అదే శ్యామ్ ముందు తను ప్రతిసారి ఓడిపోవడానికి కారణం.

కానీ ఆ ఓటమిలోనే తనకు ఆనందం ఉంది. అమరత్వం ఉంది. కావాలనే తనను కవ్వించి కాలు దువ్వుతాడు. తనను టచ్ చేయొద్దని యమ సీరియస్‌గా చెప్పినా సరే, కబడ్డీ ప్లేయర్‌లా అక్కడ,ఇక్కడ, ఎక్కడో ఒకచోట టచ్ చేసి తనని ఔట్ చేస్తాడు.

ఇంత జరిగాక తనుమాత్రం కూత పెట్టకుండా ఎలా ఉంటుంది?

కన్నింగ్ ఫెలో! అస్సలు కనికరం లేదు. కసురుకున్నా స్పోర్టివ్‌గా తీసుకుంటాడు. పోరా అంటే పోడు, పోనీడు, పోకిరీ వాడు. ఇంతలా తను, శ్యామ్ అంటే పడిచస్తుంటే... ఉన్నట్లుండి ఏమవుతుందో ఏమో గాని, తన ఇష్టానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తాడు.

ఎందుకో చెప్పడు, అలా ఎన్నాళ్ళో చెప్పడు...అదే తనకు చిరాకు తెప్పించే విషయం.

అసలు విషయానికొస్తే శ్యామ్ నిత్యం షేవ్‌చేసుకుని స్మూత్‌గా, స్మార్ట్‌గా, ట్రిమ్‌గా, డ్రీమ్ బాయ్‌లా ఉంటాడు. అలా ఉంటే తనకెంతో ఇష్టం. ఎన్టిటైమ్ నిలువుదోపిడీకి సిద్ధం.

కానీ ఉన్నట్లుండి నెలల తరబడి మీసం, గడ్డం, జుట్టు పెంచేసి బూచోడిలా తయారవుతాడు. అప్పుడే



తనకు వెగటు, వికారం, వికర్షణ కలుగుతాయి. అసలు అలా ఎందుకురా... అంటే చెప్పడు. అదేదో స్టైలు అనుకుంటాడు. నీ ఫేసుకు ఆ గెటప్ నచ్చదురా అంటే పట్టించుకోడు.

గుబురు మీసాలు అతని ముదురు తేనెరంగు పెదాలను కబ్జా చేస్తుంటే ఆ పొదలమాటున దాగిన అతని అధరజంటను వెతికి పట్టుకోవాలంటే తనకెంతో ఇరిటేటింగ్‌గా ఉంటుంది.

అతని ఎదపాన్పుపై పవళించి పరవశిద్దామన్నా ముద్దులముద్దరేసి ముద్దార మురిసిపోదామన్నా బారెడు గడ్డం 'చైనావాల్'లా అడ్డొస్తుంది.

శ్యామ్ తన సొంతం, తన ఆస్తి, పెళ్ళితో తన పేరుమీద రిజిస్టరైంది.శ్యామ్‌బాడీ తన ఇండోర్ క్రీడా ప్రాంగణం. దాని మెయింటెనెన్స్ తన ఇష్టానికి అనుగుణంగా ఉండాలి కాని, కలుపుమొక్కల్లా గడ్డాలు, మీసాలు విచ్చలవిడిగా పెరిగితే తను సహించదు. సర్వాంగానాం వదనం ప్రధానం.

వదనంలో అధరం ప్రధానం. అనంగ క్రీడకుఆది, ఆరంభం అధరచుంబనం. మరి ఆటల్లో అధరాలే కనుమరుగైతే ఆ ఆట కట్టే-ఫట్టే.

శ్యామ్‌తో గొడవపడి పుట్టింటికి వచ్చేసింది శాన్వి. సడన్‌గా శాన్వి ఒక్కటే వచ్చేటప్పటికి ఏం జరిగుంటుందా? అన్న ఆలోచనతో సతమతమవుతున్న తల్లి "అదేంటమ్మాయ్ చెప్పాపెట్టకుండా వచ్చావు, అల్లుడుగారేరి?" అంది.

"మా ఆయనతో గొడవపడ్డాలే" అంది శాన్వి ముక్తసరిగా.

"అల్లుడుగారు చాలా మంచోడు కదా, ఆయనతో గొడవేంటి?"

"ఆ... ఆయన మంచితనం భరించలేక..." అంది శాన్వి వెటకారంగా.

ఇంతలో శాన్వి తండ్రి వచ్చాడు. 'అల్లుడురాకుండా అమ్మాయి ఒక్కటే వచ్చిందంటే ఏదో మొగుడు పెళ్ళాల మధ్య చిన్నపాటి గొడవలు జరగటం సహజమేలే... నాలుగు రోజులు ఎడంగా ఉంటే అవే సర్దుకుంటాయి' అనుకుని ఊరుకున్నాడు.

శాన్వి వచ్చిందని తెలిసి ఆరోజు సాయంత్రం చిన్ననాటి స్నేహితురాలు జాను వచ్చింది.

"వాటేసర్‌ప్రైజ్!" అంటూ శాన్విని కౌగిలించుకుని, "అదేంటి మీ మిస్టర్ హ్యాండ్‌సమ్‌ని వదిలి ఎలా వచ్చావ్?" అంది జాను.

శాన్వి చెప్పింది విన్నాక పగలబడి నవ్వి "బాగుందే, గడ్డాలు, మీసాలు పెరిగాయని మొగుడ్ని వదిలేసి

## సినిమాలే ప్రపంచం

తెలుగులో 'సవ్యసాచి'లో నటిస్తున్న నిధి అగర్వాల్ చిన్నతనంనుంచే సినిమాలపట్ల మోజు పెంచుకుంటూ వచ్చిందట. సినిమాలు తప్ప మరేదైనా చేయాలన్న ఊహ సైతం లేదంటున్నది.

"మా కుటుంబానికి సినిమా పరిశ్రమతో ఏ కనెక్షన్లూ లేవు. కాని నేనెప్పుడూ సినిమాల్లో పనిచేయాలన్న కోరికతోనే వుండేదాన్ని. కాబట్టి ముందుగా మోడల్‌గా నిరూపించుకోవాలనుకున్నాను.

తర్వాత సినిమాలు ప్రయత్నించా. అదృష్టవశాత్తూ డ్యాన్స్‌లో నాకున్న శిక్షణ, మంచి ఆడిషన్ ఫలితంగా మున్నామైఖేల్ అవకాశం లభించింది.

ఇప్పుడు తెలుగులో నటిస్తున్నా. బెంగళూరులో పెరగడంవల్ల తెలుగు నాకు పూర్తిగా కొత్త. ముందు రోజే నా లైన్స్ ప్రాక్టీస్ చేసుకుంటాను.

తదుపరి హిందీ సినిమాకూ సిద్ధం అవుతున్నా" అంటూ చెప్పుకొచ్చింది.



వస్తారటే ఎవరైనా?" అంటూ హాస్యమాడింది జాను.

"చిట్టడివిలా చిందరవందరగా పెరిగితే చిరాకేస్తోందే... అదే నువ్వయితే భరించగలవా చెప్పు?" అంది శాన్వి.

"సర్లే...మా ఆయనకు మూతిమీద మీసాలే సరిగ్గా లేవు. ఇక నెత్తిమీద జుట్టంటావా, అదో ద్వీపకల్పం, కల్పం పోయి ద్వీపంగా మారే రోజులు దగ్గర్లోనే ఉన్నాయి. నీ ప్రాబ్లమ్ అతివృష్టి అయితే, నాది అనావృష్టి" అంది జాను.

"ఏమోనే, నాకైతే నీ పొజిషనే బెటరనిపిస్తుంది. పొద్దున్నలేవగానే శ్యామ్ పెదాలను ముద్దాడి, రొమాంటిక్‌గా గుడ్‌మార్నింగ్ చెప్దామంటే శత్రుమూకల్లా మీసాలు అడ్డొస్తాయి.

ఇక ఆ పీచుగడ్డం... ఛీ...ఛీ... అలా పెరిగితే పేలు చేరవూ? ఏదైనా తినేటప్పుడుగాని, తాగేటప్పుడు గాని అవి అడ్డొస్తుంటే 'యాక్!' నాకు వాంతి వచ్చేస్తుంది. కొత్తగా ఆయన్ని చూసిన వాళ్ళు ఏ సాములోరో అనుకుంటున్నారు"

"మా పనమ్మాయైతే అమ్మగోరూ, అయ్యగోరు అలా ఉంటే తమకి మా సెడ్డ సిరాగ్గా ఉంటుంది కదండీ అంటూ వంకర నవ్వు నవ్వుతోంది. దానికి కూడా అలుసైపోయాను నేను.

అందుకే నేనొక నిర్ణయానికొచ్చాను. ఆయన అవి తొలగిస్తేకాని, ఆయనతో కాపురం చేయటం కుదరదు. గత సంవత్సరం కూడా ఇలాగే పెంచి,నేను అది భరించలేక క్రాప్ హాలిడేలా దాంపత్యానికి హాలిడే ప్రకటించాక తొలగించారు.

మళ్ళీ ఈ సంవత్సరం అదే వరస. ఇలా సంవత్సరంలో ఆర్నెల్లంటే నేను ఎంత లాస్ అవుతున్నానో తెలుసా? అసలు ఆయన ముఖంలోకి చూడాలంటేనే ఎలర్జీగా ఉంటోంది" అంది శాన్వి.

"ఓస్ అంతేకదా!నీ సమస్యకి నాదగ్గర కొన్ని పరిష్కారమార్గాలున్నాయి.

మొదటిది గాంధారిలా నువ్వు కళ్ళకు గంతలు కట్టుకుని ప్రొసీడైపో" అంది జాను.

"అలాగైతే ఏదెక్కడుందో ఎలా తెలుస్తుంది" అని వెంటనే నాలుక్కరుకుని, సిగ్గుపడుతూ, కళ్ళున్న కబోదిలా అంత ఖర్మేంపట్టలేదు నాకు" అంది శాన్వి.

"రెండోది... మీ ఆయన ముఖం మీద ఓ 'నేప్‌కిన్' కప్పేయ్.అంతే ఆ తర్వాత టట్టడాం" అంది జాను.

"నిన్నూ" అంటూ జాను చేతిని మెలి తిప్పింది శాన్వి.

"అబ్బా నొప్పి"




అని ఒకే మూడోది, ఆఖరిది... ఎక్స్ఛేంజ్ ఆఫర్. ఓకేనా?" అంది జాను.

"దొంగరాస్కెల్... మనం కలిసి చదువుకున్నప్పుడు పెన్నులు, జడపిన్నులు, బొట్టుబిళ్ళలు, రబ్బరు గాజులు మార్చుకున్నామని మొగుళ్ళను మార్చుకుందామంటావా? నువ్వు బాగా ముదిరిపోయావే...

మీ ఆయన్ని బాగా ఆటపట్టిస్తున్నట్లున్నావు" అంది శాన్వి. అప్పుడే శాన్వి మొబైల్ రింగైతే... 'రాంగ్ నంబర్' అంటూ కట్‌చేసింది. "మా గురుడే... గుర్తొచ్చినట్లున్నాను" అంది శాన్వి, జానుతో.

"అలా చేయటం పాపంకదే, ఎంత ఫీలయ్యాడో శ్యామ్. అదే నేనైతేనా ఎగిరి గంతేసేదాన్ని. నాకు ఏడుపొస్తోంది తెలుసా?" అంది జాను.

"అంతొద్దు... నువ్వు ఓవర్ యాక్షన్ చెయ్యకు" అంది శాన్వి.

"నా బాధంతా నీ గురించేనమ్మా" అంది జాను.

"నిజం చెప్పు" అంది శాన్వి, జాను పీకపట్టుకుని.

"అంటే.. అదే నీ మన్మథుడు పాపం మదనతాపంతో రగిలిపోతుంటే నాకు జాలేస్తోందే.

అసలు అలాంటి హీరోని డోంట్‌కేర్ అంటున్నావంటే, నువ్వు పెద్ద విలన్‌లా కనపడుతున్నావు నా కంటికి" అంది జాను.

"ఇంక మూస్తావా? మా ఆయన్ని వెనకేసుకొస్తున్నావేంటే మిత్రద్రోహి" అంది శాన్వి.

"ఈ బెట్టు ఇంకెన్నిరోజుల్లే.... 'ఎంత ఎంత ఎడమైతే అంత తీపి కలయిక' అన్నట్లు నీ గంధర్వుడు కనపడగానే బెట్టు తీసి మంచం క్రిందపెట్టి మంచం మీద జిమ్నాస్టిక్స్ మొదలుపెట్టవూ?" అంటూ పరిహాసమాడింది జాను.



దేశంలో అస్థిరతకు దారితీసేలా కేంద్రం వ్యవహరిస్తోంది.

-పవన్‌కళ్యాణ్, జనసేన అధినేత

శాన్వి పుట్టింటికి వచ్చి వారం దాటింది. శ్యామ్ ఎన్నిసార్లు ఫోన్ చేసినా శాన్వి కట్ చేస్తూనే ఉంది. ఈ పరిస్థితిని గమనించిన శాన్వి తండ్రి ఇక ఉపేక్షిస్తే మంచిదికాదని అల్లుడు శ్యామ్‌కి ఫోన్ చేశాడు.

ఫోన్లో ముందుగా అత్తమామల యోగక్షేమాలు విచారించాడు శ్యామ్.

అలాగే శాన్వి ఎలా ఉందని కూడా అడిగాక, ఇక ఆ కన్నతండ్రి హృదయంలో గూడుకట్టుకున్న ఆవేదన ఉవ్వెత్తున ఎగిసిపడింది.

"బాబూ శ్యామ్ అమ్మాయి ఏదైనా తప్పు చేసినా, ఆ కారణంగా నువ్వు మనస్తాపానికి గురైనా అమ్మాయి తరఫున నేను క్షమాపణ చెప్తున్నాను.

శాన్విది కాస్త దూకుడు మనస్తత్వమే కాని, నీలాగే మనసు మంచిది బాబూ"అంటుంటే ఆ తండ్రిగొంతు మూగబోయి కన్నీటి జల ఉబికివచ్చింది. అంతే ఇక మాట్లాడలేక ఫోన్ పెట్టేశాడు.

ఇదంతా గమనిస్తున్న శాన్వి తల్లి "ఏంటండీ ఇది? భార్యాభర్తల మధ్య ఏవో అభిప్రాయ భేదాలు వస్తుంటాయి, సమసిపోతుంటాయి. మరి ఈ మాత్రానికే మీరు చిన్నపిల్లాడిలా అలా కంట తడిపెడితే ఎలా? మన అల్లుడు మంచివాడండి.

త్వరలోనే వచ్చి అమ్మాయిని తీసుకువెళ్తాడు చూడండి. మీరలా బాధపడుతుంటే నాకు కూడా ధైర్యం సడలిపోతుంది" అంటూ భర్త చేతులు పట్టుకుని అనునయిస్తుంటే,

దుఃఖం ఆపుకోలేక ఇద్దరూ ఒకర్నొకరు కావలించుకుని వెక్కి వెక్కి ఏడ్చేశారు.

తన తండ్రి శ్యామ్‌తో ఫోన్లో మాట్లాడిన విషయం తన తల్లిద్వారా తెలుసుకున్న శాన్వి దీర్ఘాలోచనలో పడింది. తను పుట్టింటికి వచ్చి పెద్దవయస్కులైన తన తల్లిదండ్రులను మనస్తాపానికి గురిచేసినట్లుంది.

## విప్లవం రావాలి

చేసిన పాత్రలగురించి కదిలిస్తే నిత్యామీనన్ కబుర్ల పోగు అయింది. 'అ'లోని కృష్ణవేణి పాత్ర భలే నచ్చిందని చెప్పింది. "నాకు సినిమా స్క్రిప్ట్ నచ్చితే నా నుంచి ఎంత సపోర్ట్ అవసరమో అంతా అందిస్తాను. 'ప్రాణ' సినిమా చేశాను.

నాలుగు భాషల్లో చేశాం. నాకు నాలుగు భాషలూ వచ్చు. కనుక, రైటింగ్ సైడ్ కూడా సహకరించా. భవిష్యత్‌లో డైరెక్షన్ చేయాలన్నది నా కోరిక.

తెలుగు ప్రేక్షకులు అన్నిరకాల సినిమాలనూ ఆదరిస్తున్నారు.అటువంటివారికోసం కొత్త తరహా సినిమాలు చెయ్యాలి. తెలుగు చిత్రాల్లో విప్లవం రావాలన్నది నా కోరిక" అంటున్నది.



తను తప్పుచేసింది. తను తనింటికి వెంటనే వెళ్ళిపోవాలి. నిజానికి శ్యామ్‌ని వదిలి తనూ ఉండలేకపోతోంది. రాత్రుళ్ళు నిద్రపట్టడంలేదు.

శ్యామ్ ప్రతి క్షణం గుర్తొస్తూనే ఉన్నాడు.శ్యామ్‌కి కూడా తనంటే ప్రాణం. తన కారణంగా శ్యామ్ కూడా బాధపడ్తున్నాడు. శ్యామ్ మంచివాడు కనుక తనెలా ప్రవర్తించినా పల్లెత్తుమాట అనకుండా సహిస్తున్నాడు. తనే బ్యాడ్ ఫెలో, మ్యాడ్ ఫెలో.తన శ్యామసుందరుడు మేలిమి బంగారం.

శ్యామ్ దగ్గరకు వెళ్ళిపోవాలి. ఇప్పుడే, ఈ క్షణమే... అనుకున్నదే తడవుగా శాన్వి సూట్‌కేసు తీసుకుని, 'నేను శ్యామ్ దగ్గరకెళ్ళిపోతున్నానంటూ ఇల్లు విడిచి వెళ్ళిపోతుంటే, తల్లిదండ్రులిద్దరూ నోటమాట రాక చూస్తూ నిలబడిపోయారు.

ఆ రాత్రి శ్యామ్, శాన్విలు పడకగదిలో ఒకరి పక్కన ఒకరు పడుకుని ఉన్నారు. ఇద్దరి మధ్య మౌనం రాజ్యమేలుతుంది. పదిరోజులు గ్యాప్ తర్వాత, ఇద్దరి మధ్య ఎడబాటు ఇక ఏమాత్రం సహించరానిదిగా ఉన్నా, ముందుగా దానికి తెరదించేదెవరన్న సందిగ్ధంలో ఇరు తనువులు, మనసులు తహతహలాడుతున్నాయి.

ఇప్పటికే జరిగిన నష్టం చాలనుకున్నదేమో శాన్వి, శ్యామ్ పక్కకు తిరిగి అతని వక్షస్థలంపై తలవాల్చి పడుకుంది. శ్యామ్, శాన్విని మరింత దగ్గరగా లాక్కున్నాడు. లబ్‌డబ్‌ల స్థానే 'హగ్‌మి హగ్‌మి హగ్‌మి' అంటున్న ఒకరి హృదయస్పందనలు మరొకరికి స్పష్టంగా తెలుస్తున్నాయి.

అప్పుడే రెండు కన్నీటిబొట్లు శ్యామ్ ఛాతీపై పడటంతో, శాన్వి ముఖంలోకి చూస్తూ... 'పిచ్చిపిల్లా ఏంటిది?' అంటూ ముందుకు వంగి కలువరేకుల్లాంటి శాన్వి కనురెప్పలను ముద్దుపెట్టుకున్నాడు.ఆ చర్యకు శాన్వి పురివిప్పిన మయూరమే అయ్యింది.

విరబూసిన విరజాజి అయ్యింది.ఆమె అంతరంగం పాలసంద్రమై పరవశించింది. పదిరోజుల విరహాన్ని శాశ్వతంగా తరిమికొట్టాలన్న సంకల్పంతో తనువులు రెండూ పోటీపడి పెనవేసుకుపోతున్నాయి.

వారిరువురి హృదయసంద్రాల్లో ఏర్పడిన అల్పపీడనం వాయుగుండంగా మారి, తీవ్రమైన తుఫానుగా చెలరేగి, ఉధృతంగా ఎగసిపడుతున్న వాంఛల అలల తాకిడికి మదన సాగరమథనం జరిగి,ఆనందామృతం ఉద్భవించినవేళ అలకలు తీరి ఆలింగనావస్థలోనే ఆదమర్చి నిదురపోయారు శ్యామ్, శాన్విలు.

మర్నాడు ఉదయం శాన్వి నిద్ర లేచేసరికి బారెడు పొద్దెక్కింది. గంటముందే నిద్రలేచిన శ్యామ్, స్నానం చేసి టవల్ చుట్టుకుని రావటం చూసి దగ్గరగా వెళ్ళి గాఢంగా హత్తుకుని "మళ్ళీ పడుకుందాం రా" అంటూ మారాం చేసింది శాన్వి.

ఇద్దరూ రెండు నిమిషాలు అలానే ఉండిపోయారు. శాన్వి బ్రష్‌చేసుకుని వచ్చేప్పటికి శ్యామ్ కాఫీ కప్పు అందించాడు.

"థ్యాంక్యూ"అని శ్యామ్ కళ్ళల్లోకి ఆరాధనగా చూస్తూ కాఫీ సిప్‌చేస్తూ, "ఈరోజు ఆఫీసుకు వెళ్ళొద్దు... నాతోనే ఉండాలి" అంది శాన్వి.

శ్యామ్ అందుకు అంగీకరించటంతో "ఐ లవ్ యూ" అంటూ శ్యామ్‌ని చుట్టేసింది శాన్వి.

లేచి వెళ్ళి స్నానం చేసి ఫ్రెష్‌గా తయారై వచ్చాక ఇద్దరూ కలిసి బ్రేక్‌ఫాస్ట్ చేస్తున్న సమయంలో, శ్యామ్ అన్యమనస్కంగా ఉండటం చూసి, "నామీద కోపం తగ్గలేదు కదూ?" అంది.

"అదేం లేదు,నేను నీకొక విషయం చెప్పాలి.నేను చిన్నప్పుడే అమ్మానాన్నలను పోగొట్టుకున్న విషయం నీకు తెలుసు. అందుకనే అత్తయ్య, మావయ్యలలోనే నేను నా తల్లిదండ్రులను చూసుకుంటున్నాను.

వాళ్ళంటే నాకు భక్తి, గౌరవం. గత ఏడాది అత్తయ్యకు సుస్తీ చేసినప్పుడు అలాగే ఈ ఏడు మావయ్య అనారోగ్యం పాలయినప్పుడు వాళ్ళు సురక్షితంగా కోలుకుంటే... ఆ ఏడుకొండలవాడికి తలనీలాలు సమర్పిస్తానని మొక్కుకున్నాను.

షేవింగ్‌కూడా అందుకే మానేశాను.ఆ శ్రీనివాసుడు నా మొరాలకించాడు. అప్పుడు అత్తయ్య కోలుకుని ఆరోగ్యంగా ఉన్నారు. అన్నమాటప్రకారం నా మొక్కు తీర్చుకున్నాను. ఇప్పుడు మావయ్య కోలుకుని ఆరోగ్యంగా ఉన్నారు. నా మొక్కు తీర్చుకోవటానికి ఈ వీకెండ్ మనం తిరుపతి వెళ్తున్నాం.

నా మొక్కుల విషయం నీకు ముందుగా చెప్పకపోవటం నా తప్పే. ఒక మంచి ఉద్దేశ్యంతో చేస్తున్న పని కనుక,ఎవ్వరికీ చెప్పకుండా చేయాలని నా ఆలోచన. ఆ కారణంగా నీకు ఇబ్బంది కలిగినమాట వాస్తవం. అందుకు నన్ను క్షమించు.మంచి మనసుతో నన్ను అర్థం చేసుకుంటావనుకుంటాను" అన్నాడు శ్యామ్, శాన్వి చేతులు పట్టుకుని.

శ్యామ్ చెప్తుంటే శ్రద్ధగా వింటున్న శాన్వి అశ్రు నయనాలతో శ్యామ్‌లోని మనిషిని దర్శించింది.

శ్యామ్ తన జీవిత భాగస్వామి కావటం తన పూర్వ జన్మసుకృతంగా తలపోసింది. అప్పుడే శాన్వి ఫోన్ రింగైంది. "హాయ్! హలో.... నేను జానూని. ఏంటే సడన్‌గా చెక్కేశావ్?మన ఎక్స్ఛేంజ్ ఆఫర్ ఏంచేశావ్?" అంది. "సారీ... అది ఎక్స్‌పైర్ అయిపోయింది. దొంగ రాస్కెల్, ఫోన్ పెట్టేయ్" అంది శాన్వి.

సదరన్ స్పైస్ నుంచి ఆర్డరిచ్చి తెప్పించుకున్న కాంబో లంచ్ తిన్నాక శ్యామ్, శాన్విలను మైకం కమ్మేసింది. కాలింగ్ బెల్ స్విచ్చాఫ్ అయ్యింది.

బెడ్రూమ్‌లో ఏ.సి. ఆన్ అయ్యింది. గది తలుపులు మూసుకున్నాయి. ఎద తలుపులు తెరచుకున్నాయి. లోపలికి చేరిన స్పైసీఫుడ్ బెడ్ మీదున్న ఇద్దర్నీ కిందామీదా పెడుతోంది.

'అక్కడ... ఇక్కడ.. ఊ...పైన... క్రింద... ముందు, వెనుక... ఆపక్క.... ఈపక్క.... టచ్‌మి టచ్‌మి టచ్‌మి అంటూ శాన్వి అల్లరిచేస్తుంటే స్పైడర్‌మ్యాన్‌లా శ్యామ్, శాన్విని అల్లుకుపోతున్నాడు.

శ్రీకృష్ణదేవరాయలు వంటి గొప్పవారిని ఏ ఒక్క ప్రాంతీయుడనో, ఒక కులానికి చెందినవాడని అనటం అంత మంచిది కాదు.

-జస్టిస్ జాస్తి చలమేశ్వర్,
సుప్రీమ్ కోర్ట్ న్యాయమూర్తి



# ఆరోగ్యానికి నిజమైన మార్గం ఆయుర్వేదం




ప్ర. ఆయుర్వేదంలో కళ్ళు మరియు ఇఎన్‌టికి సంబంధించి ప్రత్యేక బ్రాంచి లేదా స్పెషలైజేషన్ ఉందా? ఈ ఆయుర్వేదం వాడటం వలన సైడ్‌ఎఫెక్ట్స్ ఏమైనా ఉంటాయా?

జ. ఉన్నది, ఆయుర్వేదంలో ఎనిమిదిఅంగాలు లేదా బ్రాంచిలున్నాయి. ప్రతిదానిలో స్పెషలైజేషన్ ఉంది. కళ్ళు, చెవులు, ముక్కు, గొంతు, తల నిర్వహణతోకూడిన శాలక్యతంత్ర వీటిలో ఒక ముఖ్యమైన బ్రాంచి.

ఆయుర్వేదంలో ట్రీట్‌మెంట్ తీసుకోవడం ద్వారా చాలామంది సైడ్‌ఎఫెక్ట్స్ ఉంటాయని భయపడతారు, కాని ఏమాత్రం దీనిలో సైడ్‌ఎఫెక్ట్స్ ఉండవు.

ప్ర. ఆయుర్వేదంలో నయంచేయగల కళ్ళ జబ్బులు ఏమిటి?

జ. అత్యధికంగా సంభవించే డ్రై ఐ, కంప్యూటర్ విజన్ సింద్రోమ్, ఎలర్జిక్ కంజక్టివైటిస్, కంటిలో ఫారిన్‌బాడీ సెన్సేషన్‌వంటివి ఎక్కువగా వచ్చే కొన్ని కంటి వ్యాధులకు ఆయుర్వేదంలో సంతృప్తి కరమైన ఉపశమనం ఉంది. వయస్సురీత్యా వచ్చే మరియు ప్రోగ్రెసివ్ కంటి వ్యాధులను అరికడుతుంది.

ప్ర. కంటి వ్యాధులకు సంబంధించి ఆయుర్వేద వైద్య విధానం ఏ విధంగా ఉంటుంది?

జ. ఆయుర్వేదంలో చికిత్సను శమన మరియు శోధనగా విభజిస్తారు. మందులు, పథ్య ఆచరణతో శమన చికిత్స లక్షణాలనుంచి ఉప శమనం ఇస్తుంది. శోధన చికిత్స శరీరంనుంచి వ్యాధిని పూర్తిగా తొలగిస్తుంది. కాబట్టి దీర్ఘకాలిక, బాగా ముదిరిన వ్యాధులకు శోధన థెరపి సిఫార్సు చేయతగినది.




డాక్టర్ నీతూ కేశవన్
అప్తమాలజీ & ఇఎన్‌టి స్పెషలిస్ట్

నేత్ర రోగాలలో అన్ని నయంచేయగల వ్యాధులను సిస్టమిక్ పంచకర్మ (శోధన)మరియు ఆశ్చోతన, అంజన, తర్పణ, పుడపాక మొదలైనటువంటి ప్రత్యేక నేత్ర క్రియాకల్పం ద్వారా చికిత్సచేస్తారు. మూర్ధనితైల ప్రయోగాలద్వారా కూడా చేస్తారు. పరిస్థితిని బట్టి సరైన చికిత్స/పద్ధతులను వైద్యయుక్తిద్వారా ఎంచుకోవాలి.

ప్ర. కంటి వ్యాధులను అరికట్టడంలో ఆయుర్వేద పాత్ర?

జ. ఆయుర్వేదం స్వస్థ(ఆరోగ్యం)లేదా రోగు(జబ్బుపడిన)లకు సమాన జాగ్రత్త ఇచ్చే ఏకైక శాస్త్రీయవైద్యం. ఆరోగ్యవంతమైన వ్యక్తికి కంటి జబ్బులు అరికట్టేందుకు ఆయుర్వేదం కొన్నిదినచర్యలను, ఆరోగ్య వంతమైన ఆహారాన్ని సిఫార్సు చేస్తుంది. కాటరాక్ట్, ఎఆర్‌ఎమ్‌డి, డయాబెటిక్ రెటినోపతి మొదలైన వయస్సు సంబంధిత జబ్బులను ఈ చర్యలు అరికడతాయి.



ప్ర. కంటిపరిరక్షణలో డయాబెటిక్ రోగులు ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి?

జ. ఈ రోజుల్లో మనదేశం డయాబెటిస్‌కు కల్చరల్ క్యాపిటల్ అవుతున్నది. అంధత్వానికి డయాబెటిక్ రెటినోపతి ఓ ప్రధాన కారణం. డయాబెటిస్ తీవ్రత పెరిగేకొద్దీ కళ్ళ సమస్యల రిస్కుకూడా పెరుగుతుంది. కాబట్టి తరచూ కంటి పరీక్షలు చేయించుకోవడం అవసరం. ఎర్లీకాటరాక్ట్, డయాబెటిక్ రెటినోపతి, డయాబెటిక్ మాక్యులోపతివంటి కంటిలోని డయాబెటిస్ సమస్యలను సింపుల్ మందుల వాడకం, థెరపీలద్వారా నివారించవచ్చు.

**చికిత్సకోసం కెఎస్ఏసి ఆస్పత్రికి ఎలా రావాలి?**

అడ్రస్: కెసాక్ హాస్పిటల్, 63-252/1/3, తాజ్ డెక్కన్ పక్కన, బంజారా హిల్స్, హైదరాబాద్, తెలంగాణ-500 034కు రాయవచ్చు లేదా 98661 30743/98661 32743 నెంబర్లకు కాల్ చేయవచ్చు.
మెయిల్ చేయండి info@ayurvedaksac.com

# ఉగాది

సృష్ట్యాది బ్రహ్మదేవుడు తన సృష్టిని ప్రారంభించిన 'సృష్ట్యాది' నుంచీ లేదా ఈ కలి యుగం ప్రారంభంనుంచి పంచాంగాలలో కాలాన్ని లెక్కించటం వాడుకగా వస్తున్న ఆచారం. ప్రళయం తరువాత తిరిగి బ్రహ్మ'సృష్టి'ని ఆరంభించే అధ్యాయాన్ని 'బ్రహ్మకల్పం' అని అంటూ, ప్రారంభకాలాన్ని 'కల్పాది' అని వ్యవహరిస్తారు.

ప్రతీ కల్పంలోనూ మొదట వచ్చే 'ఆది' సమయమే 'ఉగాది' పండుగ. దీనిని గురించి 'సూర్యసిద్ధాంతం' అనే జ్యోతిష గ్రంథంలో స్పష్టంగా చెప్పబడినది. నాటినుండి నేటివరకు ఈ పద్ధతినే అనుసరిస్తూ ప్రతీ తెలుగు సంవత్సరారంభ దినంనాడు మనం ఉగాది పర్వదినం జరుపుకునే ఆచారం ఏర్పడినది.


Courtesy : Misimi

'యుగాది'అన్న సంస్కృతపదము యొక్క ఉచ్చారణాభేదంవల్ల 'ఉగాది' అనే తెలుగుమాట ఏర్పడింది.

చైత్రేమాసి జగద్బ్రహ్మ ససర్జ ప్రథమే అహని
వత్సరాదౌ వసంతాదౌ రసరద్యే తథైవచ !!

సృష్టి ప్రభవం అయిన ఈ మొదటి సంవత్సరం నుండి చరితార్థంగా 'ప్రభవ' అని నామకరణంచేసి అక్కడినుంచి 'క్షయ'నామసంవత్సరం వరకు క్రమంలో 60నామాలతో సంవత్సర గమనం సాగుతుంది. క్షయనామ సంవత్సరంతో సమాప్తమవుతుంది. కనుకనే మనం జన్మించిన మొదలు ఈ సంవత్సరం చక్రం ముందుకు కదులుతూ అరవై సంవత్సరముల వయస్సు నిండేసరికి తిరిగి మనం పుట్టిన సంవత్సరానికి వస్తుంది.

అప్పుడు షష్టిపూర్తి జరుపుకుంటాం.

వేదాలను హరించిన సోమకుడు అనే రాక్షసుని వధించి శ్రీ మహావిష్ణువు తిరిగి పునరుద్ధరించిన రోజుగాకూడా ఉగాది ప్రాముఖ్యాన్ని సంతరించుకున్నది. తెలుగు సంవత్సరం చైత్రం నుండి శిశిరం వరకు ఆరు ఋతువులుగా విభజించబడినది.

సంవత్సరం పొడవునా అనేక ఒడుదుడుకులు అనుభవించిన ప్రకృతిలోని చెట్లు శిశిర ఋతువులో ఆకులు రాల్చి జడత్వాన్ని పొందుతాయి.

చైత్రమాసంలో కొత్త చిగుర్లు తొడిగి చైతన్యవంతంగా కనిపిస్తాయి. ఈ విధంగా ప్రకృతిలో సంభవించే నూతన కొత్త మార్పుకు నాంది చైత్ర మాసం. అందుకే ఈ మాసారంభానికి 'ఉగాది' అని పేరు వచ్చినదని కూడా చెప్పుకోవచ్చును.

ఇది మనలో కూడా నూతన ఉత్తేజాన్ని కలిగించి నవనవోన్మేషంగా ముందుకు తీసుకుపోవటానికి దోహదం చేస్తుంది. ఉగాది పర్వదినాన అభ్యంగనము, పుణ్యకాల సంకల్పం, ఉగాది పచ్చడి సేవనం, ధర్మకుంభం, సృష్టి క్రమ వర్ణన, కల్పాది వైవస్వత మన్వంతర వివరములతో కూడిన పంచాంగ శ్రవణం అనే ముఖ్యమైన విధులను ఆచరించాలి.

## అభ్యంగనము

సూర్యోదయానికి పూర్వమే నువ్వులనూనె తలకి పట్టించి ఉసరిక, పెసరపిండి, మ్రాని పసుపు, భావంచాలు, కచ్చూరాలు మొదలైన వాటిని ఉపయోగించి తలస్నానం కుంకుళ్ళతో చేయాలి. ఈ దినం వేడినీటి స్నానం శ్రేష్ఠం. అనంతరం తిలకము దిద్దుకుని, నూతన వస్త్రములు ధరించి సంకల్పం చెప్పుకొనవలెనని 'ధర్మసింధువు' తెలియచేస్తోంది.

## పుణ్యకాల సంకల్పం

సూర్యోదయానికి ఒక ముహూర్త కాలం (24 నిమిషాలు) మాత్రమే, పాడ్యమి ఉన్నాసరే ఆ రోజునే పండుగ సందర్భ నూతన సంకల్పం చెప్పుకుని ప్రారంభించాలి.

సూర్యునికి అర్ఘ్యము, దీపం, ధూపం, పుష్పాంజలి సమర్పించాలి. ఈ సంకల్పములో ముఖ్యమైన దేశము, కాలములనుస్మరించి, బ్రహ్మ యొక్క సృష్టిసంకల్ప సిద్ధిని ధ్యానించి మనము తలపెట్టిన కార్యములు శుభ ఫలితాలు ఇవ్వాలని కోరుకోవాలి.

హైందవ సంకల్ప మంత్రాలకు అత్యంత ప్రాముఖ్యత ఉంది. ఈ సాంప్రదాయ కృత్యములో ముందుగా స్మరించే 'శ్వేత వరాహ కల్పం' 'బ్రహ్మ కల్పము' యొక్క సంకల్పము. ఇది పంచాంగ గణితమంతటికీ ఆధారభూతమైనది.

"శ్రీ మహావిష్ణోరాజ్ఞాయ ప్రవర్తమానస్యాద్య బ్రహ్మణః ద్వితీయ పరార్ధే శ్వేత వరాహ కల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమ పాదే..." అని వైదిక కాలమానము తెలుపుచూసంకల్పం చెప్పుకోవాలి. ప్రస్తుతము నడిచే వైవస్వత మన్వంతరము ఏడవది. సూర్యుని పుత్రుడైన వైవస్వత మనువు పరిపాలన ప్రారంభమైన ఈ మన్వంతరములో రెండు మహాయుగములు గడచినవి.

## ఉగాది పచ్చడి సేవనం

ప్రస్తుత కలియుగము 18-12-3102 బి.సి.నాడు మొదలైంది. 7 మనువుల ప్రారంభ తిథులుకూడా వేదమునకు ఉపాంగమైన జ్యోతిషశాస్త్రమువల్ల నిరూపించబడినవి. ఈ విధముగా ఒక మహాయుగములో 43,20,000సంవత్సరములు ఉండునని శాస్త్రీయముగా ఖగోళ గణితముచేత నిరూపితమైనది.

తరువాతజరిపే అత్యంత ముఖ్యమైన కార్యక్రమం

ఉగాది పచ్చడి స్వీకరణ. దీనిని పర గడుపునే స్వీకరించాలి. షడ్రుచుల సమ్మేళనమైన ఉగాదిపచ్చడికి ఎంతో ప్రాముఖ్యం ఉంది.

తీపి, వగరు, చేదు, కారం, పులుపు, ఉప్పు రుచులు కలిసిన ఉగాది పచ్చడి మన సొంతం. ఈ పచ్చడి ప్రాముఖ్యాన్నివర్ణించటం బహుకష్టం. ఎంతో మంది కవులు, పండితులు, శాస్త్రకారులు ఉగాది పచ్చడి ప్రాసస్త్యాన్ని అమోఘంగా వివరించారు.

ప్రతీ మనిషి తన జీవితంలో ఎదుర్కొనే వివిధ అనుభవాలకు ప్రతీకగా దీనిని భావిస్తారు. ఈ పచ్చడితయారు చేయుటానికి చెరకు, మామిడి కాయలు, వేపపువ్వు, అరటిపళ్ళు, లవణం, చింతపండు, బెల్లం, పచ్చిమిరప మొదలైనవి వాడతారు. చూత కుసుమము, అశోక చిగురులు కలిపి సేవించే సాంప్రదాయము మనకు ఇప్పటికీ కనిపిస్తూ ఉంటుంది.

శతాయుర్వజ్రదేహాయః సర్వ
సంపత్కారాయచ
సర్వారిష్ట వినాశాయ, నింబ
కుసుమ భక్షణం!
త్వామష్టశోక నరాభీష్ట! మధుమాస సముద్భవ!
విభావి శోక సంతప్తాం మామశోకం సదాకురు!!

వేప పూత భక్షణం సర్వారిష్టాలను నివారించి సర్వ సంపదలను కలిగించే అదృష్టాన్ని వృద్ధిచేసి, దీర్ఘాయుష్షు, వజ్రము వంటి దేహము ప్రసాదిస్తుందని తెలియజేస్తుంది. వసంతంలో చిగురించే ఓ అశోక కలికమా! జీవితంలో శోకాలతో బాధపడుతున్న నాకు శోకములు లేకుండా చేయగలవుగాక!

## ధర్మకుంభము

రానున్న రోజులలో పూర్ణ మనోరథ సిద్ధి మరియు సకల సౌభాగ్యాలు కలగాలనే సంకల్ప బలంతో పంచలోహాల పాత్రగాని-

మట్టి కుండగాని కలశముగా తీసుకుని సుగంధ జలము, చందనము మరియు పుష్పాక్షతలు వేసి ఆవాహన చేసి పుణ్యాహ మంత్రములతో బియ్యము పోసిన ఒక పళ్ళెములో కలశము ఉంచి నూతన వస్త్రము చుట్టి, ఉపరిభాగమున నారికేళము ఉంచి, కుంకుమ, పసుపు చందనములు సమర్పించి పురోహితునకు గాని-

గురువునకుగాని లేక గుడిలోని ఇష్ట దైవమునకు గాని దానమిచ్చి వారి ఆశీర్వాదములు పొందాలి. దీనినే 'ధర్మఘట దానం' లేక 'ప్రపాదానం' అంటారు. ఈ విధి నేటికీ పల్లెలలో ఆచరిస్తున్నారు.

మహాపర్వదినములైన కల్పాది తిథులు, మన్వంతర తిథులు, దశావతార పుణ్యతిథులు మొదలగునవి పంచాంగంలో తిథి, వార, నక్షత్ర, యోగ, కరణమనే 5 అంగముల కలయికగా చూపబడతాయి.

## పంచాంగ శ్రవణము

పంచాంగ శ్రవణమువలన భవిష్యత్తులో జరగబోయే విశేషాలు, పండుగలు, గ్రహణాలు, వర్ష వివరాలు, కాల నిర్ణయాలు మొదలైనవి తెలుసుకోవటం జరుగుతుంది.

ఇది ఉగాది రోజున విశేష విధిగా భావించాలి. కనుక హైందవ సాంప్రదాయంలో పంచాంగ శ్రవణం ఉగాదితిథిరోజున ప్రాముఖ్యతసంతరించుకున్నది.

తిథేశ్చ, శ్రియమాప్నోతి వారాదాయుష్య
వర్ధనమ్
నక్షత్రాత్తరతే పాపం, యోగాద్రోగ నివారణమ్
కరణాత్కార్య సిద్ధిస్తు, పంచాంగ ఫలముత్త
మమ్
కాల విత్కర్మ కృద్ధీమాన్ దేవతానుగ్రహం
భవేత్!!

తిథి వలన సంపద, వారం వలన ఆయుష్షు, నక్షత్రమువలన పాపపరిహారము, యోగంవలన వ్యాధి నివృత్తి, కరణమువలన కార్యానుకూలత సిద్ధించును. కాలం తెలిసి కర్మం చేయు ఆస్తికులు భగవత్ అనుగ్రహం పొంది సుఖమనుభవింతురు.

తిథిర్వారం చ నక్షత్రం యోగః కరణమేవచ
పంచాంగస్య ఫలం శృణ్వన్ గంగాస్నాన ఫలం
లభేత్!!

రామాయణాది పవిత్ర గ్రంథ పఠనమువలన వచ్చే విశేషఫలము ఈ పంచాంగ శ్రవణమువలన కూడా పొందవచ్చును.

కన్యావనా కాంచన దిగ్గజానాం
సహస్రమ యుతం సతతం
ద్విజేభ్యః దత్వా ఫలం యల్లభతే
మనుష్యః
తత్తత్ఫలాన్యబ్ధఫలంచ శ్రుణ్వాన్
ఆయుర్వృర్థం పుత్ర పౌత్రాభి
వృద్ధింనిత్యారోగ్యం సంపదంచానపాయం
అచ్చినానామక్ష్వదానా మహాసిం
యచ్ఛంత్యేతీ వత్సతేరాధీశముఖ్యా!!

భూమి, స్వర్ణము, ఏనుగులు, గోవులు, సర్వ లక్షణయుక్తమైన కన్యను ఉత్తముడైన పాత్రునకు దానంచేస్తే కలిగినంత ఫలితంతో సమానం.

శాస్త్రవిధిగా పంచాంగ శ్రవణము చేయుటవలన సూర్యునిచే శౌర్య తేజస్సులు, చంద్రునిచే భాగ్య వైభవములు, కుజునిచే సర్వ మంగళములు, బుధునిచే బుద్ధివికాసము, గురునిచే గురుత్వం మరియు జ్ఞానములు, శుక్రునిచేసుఖము, శని దేవునిచే దుఃఖ రాహిత్యములు, రాహువుచే ప్రాబల్యము, కేతువుచే తన వర్గములో ప్రాముఖ్యత కలుగునని శాస్త్ర వచనము. తెలుగువారు ఉగాది పర్వదినాన్ని అత్యంత ఉత్సాహంతో, భక్తి శ్రద్ధలతో జరుపుకుంటారు. ఈ రోజు తమతమ ఇంటిని పరిశుభ్రం చేసుకుని, మామిడి తోరణాలతో, రంగురంగుల రంగవల్లులతో శోభాయమానంగా అలంకరించుకుంటారు.

ప్రాంతాలవారీగా తమ తమ పంచాంగాలను, ఆచార వ్యవహారాలననుసరించి జరుపుకుంటున్నప్పటికీ, కొత్త సంవత్సరారంభ సంకేతంగా మాత్రము ఉగాది జరుపుకుంటున్నారని గుర్తించవచ్చు. ఋతువులు కాలధర్మానికి సంబంధించినవి. రామాయణ కాలంలో వైశాఖ, జ్యేష్టాలు వసంత ఋతువుగాను, మహాభారతకాలంలో చైత్ర, వైశాఖాలు వసంత ఋతువుగాను పరిగణింపబడినాయి. తెలుగువారు చాంద్రమానాన్ని ప్రమాణంగా స్వీకరిస్తారు.

జ్యోతిష శాస్త్రాన్ని అనుసరించి పూర్ణిమ తిథిలో సంభవించే నక్షత్ర ఆధారంగా మాస నిర్ణయం జరుగుతుంది. ఆ విధంగా చిత్త నక్షత్రంతో కలిసిన పౌర్ణమిని మనం చైత్రమాసంగా భావించటం జరుగుతుంది. కొన్ని ప్రాంతాలలో సౌరమానంకూడా ప్రామాణికంగా తీసుకోవటం జరుగుతోంది. ఏదిఏమైనా తెలుగువారు జరుపుకునే ఉగాది పర్వదినం చైత్రమాస తొలిరోజుతో ప్రారంభం అవుతుంది.

విశేషమైన సత్ఫలితాలను అందించే ఉగాది అందరి మనోభీష్టములను నెరవేర్చి సుఖ శాంతులు అందించాలని కోరుకుందాం.

సర్వేజనాః సుఖినోభవంతు!! శుభం భూయాత్!!

డా॥ దేవులపల్లి పద్మజ

# శ్రీ విలంబి నామ సంవత్సరంలో

# మీ యోగక్షేమాలు



## మీ రాశిఫలాన్నిబట్టి ఏ దేవుని ఆరాధిస్తే మీకు లాభిస్తుందో తెలుసుకోండి



## మేషం

అశ్విని 4 పాదాలు, భరణి 4 పాదాలు
కృత్తిక 1వ పాదం

ఆదాయం 2, వ్యయం 14
రాజపూజ్యం 5, అవమానం 7

మీకు గోచారమందు గ్రహగతులను పరిశీలించగా ప్రయోజనములు మిశ్రమంగా ఏర్పడగలవు. ఏ పని తలపెట్టినా ఒకటికి 2 సార్లు ఆలోచించి నిర్ణయములు తీసుకొనుట మేలవ్వగలదు.

ధనకుటుంబ వ్యవహారములు కొంత అనుకూలంగా సాగుతాయి. కొన్ని సందర్భాలలో ధనవిషయకంగా లోటుతనములచే ఋణములు వంటివి చేయువలసివచ్చి సమర్థించుకోగలుగుతారు.

ఆరోగ్యమున మేలుతనములు సంవత్సరమంతా గోచరించగలవు. పూర్వార్ధంలో అక్టోబరులోపు గృహమున శుభకార్యాలు నిర్వహించగలరు.

వృత్తి, వ్యాపారాలందు ప్రోత్సాహములు ఏర్పడినా సంతృప్తిని పొందలేకపోతారు. ఉద్యోగులు అక్టోబరు నుండి పై ఆదాయములకు ఆశించక కర్తవ్యములను పాటించుకోవాలి.

వ్యవసాయదారులకు మధ్యమఫలితాలుండినా 2వ పంటలో సంతృప్తికరంగా వుండగలదు.

విద్యార్థులు ర్యాంకులకోసం, ఉన్నతవిద్యల కోసం మరింత పట్టుదలలతో సాగుట మేలవ్వగలదు. ఇంటికి సంబంధించిన విషయములందు చంచలమైన స్వభావము చూపి ఇబ్బందులను ఏర్పరచుకొను సూచనలున్నాయి. సంతానపు తీరు మింగుడుపడనిదిగా సాగు సూచనలున్నాయి.

ఈ విషయమై రోజా గృహలక్ష్మిని(అమ్మవారిని) పూజించుకొనుట, పవిత్రభావములు ప్రదర్శించుట చేత మేలు పొందగలరు.

చేతివృత్తులపై జీవనము సాగించువారు వృత్తి మార్పులు కోరుకొనక మౌనంతో సాగాలి. ఈ రాశి స్త్రీలకు ఉత్సాహకరముగావుండి స్థానచలనములు వంటి ఇబ్బందులను ఎదుర్కోవలసిరావచ్చు.

అక్టోబరు నుండి గురుసంచారం, సంవత్సరమంతా రాహుసంచారాలు ఎక్కువ దోషకరం అగుటచే మీరు తరచుగా గణపతి ఆరాధన ప్రాధాన్యతనిచ్చుకొని గృహమునందు గణపతి హోమం ఒకపర్యాయమైన నిర్వహించుకొనుటచే ఈ సంవత్సరంలో మంచి ఫలితాలను పొందగలరు.

మీరు ప్రతిరోజా ఉషఃకాలమందు 10 నిమిషాలు ఐం క్లీం సౌః అని జపించుకొనుట, ముఖ్యం అనుకొన్న పనులను 9, 18, 27లలో ప్రారంభించుకొనుట చేత మేలు జరగగలదు. ◆

## వృషభం

కృత్తిక 2, 3, 4 పాదాలు, రోహిణి 4 పాదాలు
మృగశిర 1, 2 పాదాలు

ఆదాయం 11, వ్యయం 5
రాజపూజ్యం 1, అవమానం 3

గ్రహసంచారములను పరిశీలించగా శని సంచారము సంవత్సరమంతా దోషయుక్తంగా సాగుతున్నది. ఏ పని అయినా పూర్తిగా అయ్యింది అనుకొన్న తర్వాతనే పూర్తి అయినట్లు భావించాలి.

తరచుగా మనోచింతనలను, అనారోగ్యభావనలకు గురికాగల సూచనలున్నాయి. ఆదాయమార్గములందు నిజాయితీలకు ప్రాధాన్యతనిచ్చి తేలికభావములకు దూరముగా ఉంటూ వ్యవహరించుకోవాలి.

నూతన ప్రయోజనములను వృత్తి,ఉద్యోగ, వ్యాపారములందు ఆశించుటకంటే ఉన్నది కాపాడుకొనేందుకు ప్రయత్నించుట మేలు.

విలువైన వస్తువులందు జాగ్రత్తలు అవసరం.



విద్యార్థులకు ఈ సంవత్సరం మేలైనదే అయినా అన్యవిషయాసక్తతలు, బుద్ధిమాంద్యములు ఏర్పడకుండా చూసుకోవాలి.

మధ్యమధ్య నమకపారాయణలు చేయించుకొనుట మారేడు వేరు తావీదుగా ధరించుటచే మరింత ఉన్నత ఫలితాలు ఏర్పడగలవు. అధికారులకు, గవర్నమెంటు ఉద్యోగులకు ఈ సంవత్సరం ఒత్తిడిలందు కత్తిమీద సాము అన్నట్లుగా ఉండగలదు. పట్టుదలకు పోక మౌనం వహించండి.

అక్టోబరు 11 నుండి గురు సంచారమున అనుకూలతలు పెరుగుచుండుటచే గృహమునందు శుభకార్యములు నిర్వహించుట, అనవసరపు వ్యయములను అరికట్టుట, సంతానపు విద్య, ఉద్యోగ, వ్యాపార వ్యవహారములను అనుకూలింపచేయుటలో కీలక పాత్ర పోషించగలుగుతారు.

ఇతరులతో వ్యవహారములందు తెలివిగా వ్యవహరించుకోవాలి. ఏదోవిధంగా ధనం చేతిలో మసలు

శ్రీ పిడపర్తి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి కుమారులు, పాడగట్లపల్లి (పోస్టు), ర్యాలి (వయా), తూర్పుగోదావరి జిల్లా - 533 236.

తుంది. మీరు అష్టమశనికై ఒక పర్యాయం జపదానాదులు నిర్వహించుకొనుట మధ్య మధ్య ఆంజనేయ స్వామికి మన్యుసూక్త అభిషేకములు నిర్వహించుకొనుట మేలు. మీరు ప్రతిరోజా ఉషఃకాలమందు ఐం క్లీం శ్రీం అను మంత్రమును 10 నిమిషాలు జపించుకొనుట శ్రేష్ఠం.

ముఖ్యమైన పనులను 6, 15, 24లలో చేపట్టుకోండి. పెరుగు, నెయ్యి వంటివి దంపతులకు దానం చేసుకోవడంచే మేలు జరుగుతుంది. ◆



## మిథునం

**మృగశిర 3, 4 పాదాలు, ఆర్ద్ర 4 పాదాలు, పునర్వసు 1, 2, 3 పాదాలు**

ఆదాయం 14, వ్యయం 2
రాజపూజ్యం 4, అవమానం 3

గ్రహసంచారములను పరిశీలించగా శుభాశుభ మిశ్రమంగా వుంటుంది. అక్టోబరు 11 వరకు గురుబలం కొంత అనుకూలంగా ఉండుటచే చేయు వ్యాపార, వ్యవహారములందు ఆసక్తితో పట్టుదలలు వహించి సాగుతారు.

ఋణభారములను పెరగనీయకుండా ఎప్పటికప్పుడు జాగ్రత్తలు పాటించుకోవాలి. బంధుమిత్రులతో ఇష్టాగోష్టిలు, భాగస్వామిక వ్యాపారాలందు కలిసివచ్చుట, శత్రుభావములున్నవారిని నిలువరించుట వంటివి జరుగుతాయి.

విద్యార్థులకు సుమారు ఉత్తీర్ణతలకు లోటు లేని స్థితి ఉన్నతమైన ఫలితాలకు ఎక్కువ పట్టుదలలు వహించుకోవాలి. ఉద్యోగులు జాగ్రత్తలైనండి కర్తవ్యములకు ప్రాధాన్యతనిచ్చుకొని సాగాలి. కొందరికి పనిష్మెంటు బదిలీలు వంటివి ఉండగలవు.

అక్టోబరు నుండి గురుబలం కూడా తగ్గుచుండుటచే బంధు ఘోష, జనఘోష వంటివి ఎక్కువ అగు సూచనలున్నాయి. వృత్తి వ్యాపారములమీద ఆసక్తి తగ్గి నీచమార్గములచే ధనసంపాదనపై మక్కువ చూపే సూచనలున్నాయి.

మీరు చేయు ఖర్చులందు ఎక్కువ శాతం డాంబికములకు, ఆడంబరములకు కేటాయించు సూచనలున్నాయి. వ్యవసాయదారులకు మొదటి పంటయందు మిగులుతనం ఉండి 2వ పంట చికాకునేర్పరచగలదు. జీవనోపాధిమార్గములకై యత్నించుకొనువారు విదేశీయానాలకు యత్నించుకొనువారు ధనమును ఇతరులను నమ్మిఇచ్చుటచే ధనాన్ని పోగొట్టుకొనుటయేకాక,శత్రుత్వాలు ఏర్పడగలవు.

వాగ్దానభంగాలు వంటివి ఏర్పడకుండా లౌక్యంగా సాగుట మేలు. కుటుంబమున ఒంటరిపోరు ఎదుర్కొంటారు. మీరు ప్రతికూలములు తగ్గించుకొనుటకు శని రాహువులకు ఒక పర్యాయము జపదాన తర్పణహోమాలు నిర్వహించుకొని నిత్యం సుబ్రహ్మణ్యారాధనలు చేసుకొనుట మేలు.

మీరు ఉషఃకాలమున క్లీం ఐం సౌః అను మంత్రమును 10 నిమిషాలు జపించుకొనుటచేతను 5, 14, 23 లలో ముఖ్యమైన పనులను చేపట్టుకొనుటచే మేలును పొందగలరు. ◆



## కర్కాటకం

**పునర్వసు 4వ పాదం, పుష్యమి 4 పాదాలు ఆశ్లేష 4 పాదాలు**

ఆదాయం 8, వ్యయం 2
రాజపూజ్యం 7, అవమానం 3

ఈ సంవత్సరమంతా శని బలవంతుడగుట, రాహుకేతువులు పాపులు అగుట,గురుడు పూర్వార్ధమందు అక్టోబరు 11 వరకు పాపి అగుట ప్రధాన ఫలితాలను నిర్దేశించగలవు.

శ్రమతో కూడిన విజయములుంటాయి. ఉన్నత స్థితులకై యత్నించుటకంటే ఉన్నదానితో మేలును పొందుటకు ప్రయత్నించుకోవాలి. తొందరపాటు చర్యలుండకుండా, చంచలమైన స్వభావాలు చూపకుండా జాగ్రత్తలు పాటించుకోవాలి.

విద్య, ఆరోగ్య విషయములందు ముందుచూపుతో వ్యవహరించుకోవాలి.శుభకార్యాలోచనలందు ఊగిసలాటలకు గురికాగలరు.

అక్టోబరునుండి గురుడు కూడా కొంత బలవంతుడగుచుండుటచే వృత్తి, ఉద్యోగములందు స్థిరత్వములు ఏర్పడుట, నూతన వ్యాపార వ్యవహారాలను ప్రారంభించుట వృత్తి, ఉద్యోగములందు మానసిక సంతృప్తి సిద్ధించుట కాంట్రాక్టు ఉద్యోగులకు పర్మినెంట్ అవకాశాలు ఏర్పడుట ఉంటాయి.

జన్మరాహువుకై మీరు నైరుత్యాభిముఖ రాహు ప్రార్థన చేసుకొనుటచే మానసిక భయాందోళనలు, అకాలనిద్రాహారములను,వ్యవహారాలందు డోలాయమానములను దూరం చేసుకోగలుగుతారు.

విదేశీయాత్రలు, తీర్థయాత్రలు చేద్దామనుకొనే వారికి మేలైన పరిస్థితులుంటాయి.

మొత్తంగా చూసుకొంటే గ్రహబలాలు అంతంత మాత్రంగా ఉన్నాయి.

మీరు నిత్యం నవగ్రహారాధనలు చేసుకొంటూ మధ్యమధ్య నవగ్రహ పాశుపతం నిర్వహించుకొనుట మేలవ్వగలదు. మీరు ప్రతిరోజా ఉషఃకాలమున 10 నిమిషాలు ఐం క్లీం శ్రీం అనుమంత్రాన్ని జపించుకొనుట 2, 11, 20, 29 లలో ముఖ్యమైన పనులను చేపట్టుకొనుట, పచ్చిపాలను మధ్యమధ్య దేవాలయములందు అభిషేకార్చనలకు ఇచ్చుట చేత మేలు పొందుతారు. ◆



## సింహం

**మఖ 4 పాదాలు, పూర్వఫల్గుని 4 పాదాలు ఉత్తరఫల్గుని 1వ పాదం**

ఆదాయం 11, వ్యయం 11
రాజపూజ్యం 3, అవమానం 6

ఈ సంవత్సరంలో ప్రధానగ్రహములన్నీ దోషయుతంగా సంచరిస్తున్నాయి.

శ్రమ ఎక్కువ ఉండి ఫలితాలు అంతంతమాత్రంగా ఉంటాయి. బంధుమిత్రాదులచే విరోధాలు, ఆర్థికమైన ఇబ్బందులను అధిగమించలేకపోవుట, శారీరకమైన అనారోగ్యములకు గురికావడం, వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలందు నిస్తేజమైన పరిస్థితులు నెలకొనుట దూరంగా ఉందామనుకొన్న దుష్టబుద్ధికలవారి ప్రభావమునకు గురిఅయ్యే సూచనలున్నాయి.

విద్యార్థులు కర్తవ్యములకు ప్రాధాన్యతనిచ్చుకొంటూ పునశ్చరణలు పాటించుకోవాలి. టార్గెట్ విధానములతో వ్యవహరించుకోవాలి.

ఉద్యోగ అన్వేషకులు నిరాశలకు గురికాకుండా ప్రయత్నించుకొంటూ సాగాలి. వ్యాపార, వ్యవహారములను నిర్వహించుకొనువారు బాధ్యతాయుతంగా సాగుతూ నూతన వ్యాపారములను తలపెట్టవలసినపుడు భాగస్వామ్యయుతంగా కాని, ఊరకుండుట గాని మేలవ్వగలదు.

చిన్నపనికైనా పలుమార్లు ప్రయత్నించుకోవలసిన అవసరం వుంది. మనఃస్థాపమునకు గురిచేయు కుటుంబ వ్యక్తులు బంధుమిత్రులు వారి వారి ప్రక్రియలందు హుషారుగా సాగు సూచనలున్నాయి. రాజకీయపు వ్యవహారములకు దూరంగావుండుట లేదా మౌనంగా సాగుట తప్పనిసరి చేయండి.

నిర్మాణాది వ్యవహారములు, నూతన పెట్టుబడులు వంటివి తలపెట్టవలసివచ్చినపుడు స్థిరమైన చిత్తంతో సాగాలి. చెప్పుడుమాటలకు దూరంగా ఉంటూ సోదర సోదరీమణులతో మైత్రీభావాలందు సాగుట మేలుకరం. శత్రువులపట్ల అప్రమత్తతతో వ్యవహరించుకోవడం చాలా అవసరం.

మీరు గ్రహానుకూలతలు పొందుటకు గురు, శనివారపు నియమాలు పాటిస్తూ, సంకష్టచతుర్థులు పాటించుకొనుచు గురు,శని,రాహువులకుదానాదులు నిర్వహించుకొనుట తప్పనిసరి. గణేశ పంచరత్నములు నిత్యం పారాయణ చేసుకోవాలి.

మీరు ప్రతిరోజూ ఉషఃకాలమున పది నిమిషాలు హ్రీం శ్రీం సౌః అను మంత్రమును జపించుకొంటూ 1, 10, 19, 28లలో ముఖ్యపనులను చేపట్టుకొనుట చేత రాగి, గోధుమలు వంటివి బ్రాహ్మణులకు మధ్యమధ్య దానం ఇచ్చుకొనుటవలన మరింత మేలు పొందుతారు. ◆



## కన్య

ఉత్తరఫల్గుని 2, 3, 4 పాదాలు,
హస్త 4 పాదాలు, చిత్త 1, 2 పాదాలు

ఆదాయం 14, వ్యయం 2
రాజపూజ్యం 6, అవమానం 6

మీకు సంవత్సరంలో గురుబలం సంవత్సరమంతా కొనసాగుచుండుటచే అర్ధాష్టమ శని ప్రభావం అంతంతమాత్రంగా వుండే సూచనగలదు.

గతం కన్నా అభివృద్ధిక్రమంగా సిద్ధించగలదు.

అనుకొన్న పనులను శ్రమ, పట్టుదలలు చూపి పూర్తిచేసుకోగల్గుతారు. ఈ సంవత్సరంలో కుజ సంచారప్రతికూలముచే ఋణ శత్రుబాధలు వంటివి ఎక్కువగా వుండగలవు. శుభప్రయత్న అనుకూలతలు అంతంతమాత్రంగా ఉంటాయి. బంధుమిత్రుల సహకారంతో ఉపకారాలు జరుగుతాయి.

స్థిరాస్తి వ్యవహారాలను కదపకుండుట మంచిది. గృహనిర్మాణ యత్నాలు నత్తనడకన సాగుతాయి.

మాతాపితరుల ఆరోగ్యవిషయంగా ఆలోచనలు చేయవలసిరావచ్చు. కొందరికి వృత్తి, ఉద్యోగముల నిమిత్తం కుటుంబమునకు దూరంగా ఉండవలసిన స్థితులేర్పడగలవు. విద్యార్థులకు ఉత్తీర్ణతాశాతములు సంతృప్తికరముగా ఉండి, కోరుకున్న కోర్సులందు ప్రవేశములు సిద్ధించగలవు.

మీరు మరిన్ని మంచిఫలితములకు శనికి మాస శివరాత్రి వ్రతములు నిర్వహించుకొంటూ శనివారపు నియమాలు పాటించుకోవాలి.

మీరు ప్రతిరోజూ ఉషఃకాలమున పది నిమిషాల పాటు శ్రీం ఐం సౌః అను మంత్రమును జపించుకొంటూ 5, 14, 23లలో ముఖ్యపనులను చేపట్టుకొంటూ పెసలు, గుమ్మడికాయ మధ్యమధ్య దానం చేసుకోవడం మేలు. ◆



## తుల

చిత్త 3,4 పాదాలు,
స్వాతి 4 పాదాలు, విశాఖ 1, 2, 3 పాదాలు

ఆదాయం 11, వ్యయం 5
రాజపూజ్యం 2, అవమానం 2

మీకు గురుడు 11 అక్టోబరు వరకు జన్మమున అక్కడినుండి ద్వితీయమున, శని సంవత్సరమంతా తృతీయమున రాహువు దశమ కేంద్రమందు కేతువు చతుర్థమున సంచరిస్తారు.

ఈ సంవత్సరమంతా మీ పనులు నెమ్మదిగా సాగుతాయి.ఓరిమి,పట్టుదలలు వహిస్తేగాని ముఖ్యం అనుకున్న పనులు పూర్తికావు.

తరచు ఆర్థిక లోటులు ఏర్పడుతుండటంతో సర్దుబాటు చేసుకోవలసివుంటుంది.

కీర్తిప్రతిష్ఠలకోసం పాకులాడక అన్నిటా యోచనలతో వ్యవహరించుకోవలసివుంటుంది. ఇతరుల వ్యక్తిగతములకు దూరంగా ఉండుటచే మానసికంగా ధైర్యంగా వ్యవహరించగలుగుతారు.

గత ఇబ్బందులను దూరం చేసుకోగలుగుతారు. నూతనమైనది పొందుటకు-ప్రయత్నించుటకు అనుకూలతలు అంతంతమాత్రంగా ఉంటాయి. విద్యార్థులు వ్యాసంగాలపట్ల అధికమైన శ్రద్ధాసక్తతలు చూపుకోవాలి. సామాన్యాధిక ఉత్తీర్ణతలను పొందగలరు. ఋణ, రోగ, శత్రుబాధల వంటివి పెరగవు. కాని సామాన్యంగా అదుపుచేసుకోగల్గుతారు.

కార్మికులకు, వ్యవసాయదారులకు ప్రయోజనాలు అంతంతమాత్రంగాఉన్నా క్రియాకలాపాలు ఎక్కువగా ఉండగలవు. శుభకార్య నిశ్చయాలు అక్టోబరు నుండి సిద్ధించబడతాయి. విదేశీ ప్రయాణాలు, విదేశాలందు ఉన్నత చదువులకు చేయు ప్రయత్నాలు ఉపకరించగలవు. స్నేహవర్గం పెరిగి వారిచే ప్రయోజనాలు వంటివి ద్వితీయార్థమున పొందగలరు.

మీరు మరిన్ని అనుకూలతలు పెంచుకొనుటకు పూర్వార్థంలో గురువుకు, ఉత్తరార్థంలో కేతువుకు రెమిడీలు పాటించుకొంటూ, 2 పర్యాయాలు లక్ష్మి గణపతి హోమం నిర్వహింపచేసుకొనుటచే ఉన్నత ఫలితాలు పొందుతారు.

మీరు ప్రతిరోజూ ఉషఃకాలమందు హ్రీం క్లీం శ్రీంః అను మంత్రమును 10 నిమిషాలు జపించుకుంటూ 6, 15, 24 తేదీలలో ముఖ్య పనులను చేపట్టుకొనుట పెరుగు, నెయ్యివంటివి అమ్మవారి గుడిలో మధ్య మధ్య ఇచ్చుటచేత శుభాలు పొందుతారు. ◆



## వృశ్చికం

విశాఖ 4వ పాదము, అనూరాధ 4 పాదాలు,
జ్యేష్ఠ 4 పాదాలు

ఆదాయం 2, వ్యయం 14
రాజపూజ్యం 5, అవమానం 2

గ్రహసంచారాలు పరిశీలించగా గురుడు మిశ్రమ ఫలప్రదాత, శని అర్ధపాపత్వం, రాహు-కేతువు పూర్ణదోషఫలం ఇచ్చేవారు అగుటచే అక్టోబరు వరకు

అనారోగ్యం, ఆర్థిక చిక్కులు, సంతాన మూలక ఇబ్బందులు, వృత్తి, ఉద్యోగాలందు అసౌకర్యాలతో సాగుట వంటివి ఉంటాయి.

డాంబికాలు, గొప్పలు ప్రదర్శించుటకు ఖర్చులు ఎక్కువచేయు సూచనలుగలవు. వృత్తి, వ్యాపకాలందు నిలకడ స్వభావాలను ప్రదర్శించలేకపోతారు.

బంధువులతో విరోధాలు పెరగకుండాను, అతి చనువు చూపకుండాను వ్యవహరించుకోవాలి. శత్రు వర్గపు ప్రభావాలు కుటుంబ వ్యక్తులపైపడకుండా తగుజాగ్రత్తలు పాటించుకోవాలి.

గురుడు ద్వితీయమందు సంచారం, అక్టోబరు నుండి వృత్తి, ఉద్యోగాలందు అనుకూలతలు పెరుగుట, దీర్ఘకాలిక సమస్యలు కొంత తగ్గుట, ఉన్నత విద్యలకు అవకాశాలు ఏర్పడుట, అనుకున్న విధంగా ఋణాలు లభించుట వంటివి జరుగుతాయి.

పిత్రార్జిత సంపాదనలను వాయిదావేయుటచే మేలు పొందగలరు. ఈ రాశివారు ఏలినాటి శనికై నిత్యం శివాలయ దర్శనమును చేసుకోవాలి.

గురు, శని, రాహువులకు దానాదులు మధ్యమధ్య చేసుకొంటే మేలు జరుగుతుంది.

మీరు ప్రతీరోజూ ఉషఃకాలమున 10 నిమిషాలు ఐం క్లీం సౌః అని జపించుకుంటూ ముఖ్యం అనుకున్న పనులను 9, 18, 27లలో ప్రారంభించుకుంటూ, మధ్యమధ్య అంగవికులరకు మిఠాయిలు పంచుట ద్వారా మేలైన ఫలితాలు పొందగలరు. ◆



# ధనుస్సు

**మూల 4 పాదాలు, పూర్వాషాఢ 4 పాదాలు ఉత్తరాషాఢ 1వ పాదం**

ఆదాయం 5, వ్యయం 5
రాజపూజ్యం 1, అవమానం 5

మీకు ఈ సంవత్సరంలో శని మిత్రముడు, గురుడు మధ్యమోన్నత ఫలప్రదాత, రాహు-కేతువులు, కుజుడు ప్రతికూలురు. ఈ సంవత్సరంలో ఔషధ సేవలకు, ఆరోగ్య పరిరక్షణా చర్యలకు పెద్ద పీటవేయవలసి ఉంటుంది. స్థిరమైన చిత్తంతో వ్యవహరించుకుంటూ, అత్యాశలకు పోక కర్తవ్యాలు పాటించువారికి మేలుతనాలుంటాయి.

పూర్వార్ధమందు, ఉద్యోగాలందు రొటేషన్ ప్రమోషన్లు, బంధుమిత్రుల సహకారాలతో వివాహాది శుభాలు నిర్వహించుటవంటివి ఉంటాయి.

ఆర్థికంగా మధ్యమధ్యలో కొన్ని ఒత్తిడిలు ఏర్పడుతున్నా అవసరాలను అధిగమించగల్గుతారు. మనోవిచారాల వంటివి ఏర్పడకుండా తరచుగా దుర్గారాధనలు చేసుకొనుట మేలవ్వగలదు.

వ్యవసాయదారులు నల్లని పంటలు వేసుకోవడం ద్వారా ఆదాయాలు పొందగల్గుతారు. నరాలకు సంబంధించిన లేదా బి.పి. వంటి అనారోగ్యాలున్నా మరింత శ్రద్ధగా వ్యవహరించుకోవాలి.

సంతానపరంగా ఉత్సాహాలు ఏర్పడుట, విందు-విలాసాలందు పాల్గొనుట, నూతన బాంధవ్యాలు ఏర్పడుటవంటివి ఉంటాయి.

మీరు మరిన్ని అనుకూలతలు పెంచుకొనుటకు శని, రాహు, కేతువులకు దానాదులు నిర్వహించుకుంటూ మధ్యమధ్య చండీ హోమాలు నిర్వహించుకొనుటచే మేలు పొందగలరు.

మీరు ప్రతిరోజూ ఉషః కాలమున 10 నిమిషాలు హ్రీం క్లీం సౌః అను మంత్రాన్ని జపించుకొనుట-

3, 12, 21, 30లలో ముఖ్యమైన పనులను చేపట్టుకుంటూ పసుపు, శనగలు, కుంకుమపువ్వు వంటివి బ్రాహ్మణులకు దానం ఇచ్చుటచేత మేలయిన ఫలితాలు పొందగలరు. ◆

# మకరం

ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు,
శ్రవణం 4 పాదాలు, ధనిష్ఠ 1, 2 పాదాలు

ఆదాయం 8, వ్యయం 14
రాజపూజ్యం 4, అవమానం 5

ఈ సంవత్సరంలో గురుడు సంపూర్ణ ఫల ప్రదాత. శని, రాహు, కేతువులు దోషప్రద సంచారంచే ఈ సంవత్సరమున అన్నిటా మిశ్రమ ఫలాలుంటాయి. వివాహ, ఉద్యోగ యత్నాలు శ్రమపై సిద్ధించగలవు. కుజ సంచారం 23 డిశంబరు వరకు ప్రతికూలంగా ఉంది.

సాహసమైన పనులకు దూరంగా ఉంటూ ప్రతి ప్రయత్నంలోనూ గోప్యంగా సాగవలసివుంటుంది. వివాహ, ఉద్యోగయత్నాలు శ్రమ చేకూర్చి విజయాలు పొందాలి. స్థిరాస్తుల చేరికలు కోరుకునేవారు, విదేశీ ప్రయాణాలకు యత్నించుకునేవారు మెలకువలతో సాగవలసి ఉంటుంది.

వ్యవసాయ, వ్యాపారాలు నిర్వహించుకునేవారికి రోజులు మందంగా సాగగలవు. గృహంనందు వాస్తు మార్పులు వంటివి చేపట్టుకోగలరు.జీవిత భాగస్వామి వలన కొన్ని సమస్యలను ఎదుర్కోవలసిరావచ్చు.కుజ సంచారదోషాలచే వాహన ప్రమాదాలు ఏర్పడకుండా తగు మెలకువలతో సాగాలి.

ఊహించని విధంగా ప్రయాణాలు ఎక్కువ చేయ వలసి వచ్చుటచే శరీరం కృశించుట,గతమున కష్టించి దాచుకున్న ధనాన్ని ఖర్చుచేయవలసివచ్చుట,

ఉద్యోగ, వ్యాపారాలందున్నవారు అవినీతి ఆరోప ణలు ఎదు ర్కొనవలసిరావుటవంటివి ద్వితీయార్థంలో ఉండగలవు. ఈ రాశివారు నిద్రలేమితనం ఉండ కుండాను, ఆహార-విరామాలందు క్రమవిధానాలను పాటించుట వలన ఆరోగ్యమందు మేలుతనములు పొందగలరు. ఈ రాశి స్త్రీలను రాజకీయములందు పదవీయోగము, సంఘమందు గుర్తింపులు వంటివి పొందగలుగుతారు.

మీరు మంచి ఫలితములకై శని, రాహు, కేతువు లకు రెమెడీలు చేసుకొంటూ శివాలయదర్శనములు కాలభైరవాష్టక పారాయణలు నిత్యం చేసుకొనుట మేలు.మీరు ప్రతిరోజు ఉషఃకాలమున ఐం క్లీం హ్రీం శ్రీం సౌః అను మంత్రమును చేపట్టుకొనుట, వృద్ధు లకు సాయపడడంవలన మేలు జరగగలదు. ◆

# కుంభం

ధనిష్ఠ 3, 4 పాదాలు, శతభిషం 4 పాదాలు,
పూర్వాభాద్ర 1, 2, 3 పాదాలు

ఆదాయం 8, వ్యయం 4
రాజపూజ్యం 7, అవమానం 5

ప్రధాన గ్రహ సంచారాలన్నీ మీకు అనుకూలంగా ఉన్నాయి. గతంలోకంటే మంచి ఫలితాలు పొందగలుగుతారు.నూతన క్రియాకలాపాలతో ఉత్సా హంగా వ్యవహరించుకోగలరు. దీర్ఘకాలికంగా ఉన్న సమస్యలకు పరిష్కారాలు పొందుతారు. ఋణ,రోగ, శత్రుభావాల వంటివి దూరమవ్వగలవు.

విద్యార్థులు కొద్ది శ్రద్ధ వహించగలిగితే పరీక్షలందు మంచి ఉత్తీర్ణతలు పొందుటయేకాక ఉన్నత విద్య లకు చేయు ప్రయత్నాలను అనుకూలింపచేసుకో గలరు. పోటీ పరీక్షలందు అనుకూలతలు పొంద గలరు. ప్రభుత్వ తరహా ఉద్యోగాలు నిర్వహించుకునే వారికి ప్రమోషన్లు, కావలసినచోటికి బదిలీలు వంటివి పొందగలుగుతారు.

కుటుంబంలో మరొకరికి సంపాదన ఏర్పడగలదు. నూతనమైన ప్రదేశాలను దర్శించగలుగుతారు.

దీర్ఘకాలిక అనారోగ్యభావమున్నవారికి ఉపశమ నములు సిద్ధించగలవు. ఈ రాశిస్త్రీలకు కూడా ధనం కూడబెట్టుటకు అవకాశాలు సిద్ధించగలవు.

కుటుంబ వ్యవహారాలందు అనుకూలతలు ఏర్ప రచుకొనుటయేకాక మానసికంగా సంతృప్తిని పొంద గలరు. వ్యవసాయదారులకు 2 పంటలందు సంతృప్తి కరమైన రాబడులుండగలవు. పరిశ్రమలు నడుపు వారు, చేతివృత్తులు నిర్వహించుకునేవారు గత ఇబ్బందులను అధిగమించుటయేకాక నూతన విష యాసక్తతలు చూపగలరు.

మీరు మరిన్ని అనుకూలతలు పొందుటకు నిత్యం ఆదిత్య ఆరాధనచేసుకొనుట మేలుకరం.మీరు ప్రతీ ఉషఃకాలమున 10 నిమిషాలు హ్రీం ఐం క్లీం శ్రీం అను మంత్రమును జపించుకుంటూ 8, 17, 26 తేదీలలో ముఖ్య పనులను చేపట్టుకుంటూ వృద్ధులకు దానం ఇచ్చుకొనుట మేలవ్వగలదు. ◆

# మీనం

పూర్వాభాద్ర 4వ పాదం,
ఉత్తరాభాద్ర 4 పాదాలు, రేవతి 4 పాదాలు

ఆదాయం 5, వ్యయం 5
రాజపూజ్యం 3, అవమానం 1

మీకు ఈ సంవత్సరమంతా గ్రహగతులు సామాన్య ప్రయోజనాలివ్వగలవు. నవం బరు 6 వరకు కుజుడు అనుకూల ఫలితాలివ్వగలడు. ఆర్థిక, కుటుంబ పరిస్థితులు మెరుగుపడుటకు కొంత సమయం వెచ్చించాలి.

సోదరవర్గంనుండి సహకారాలు పెరుగుతాయి. ఆర్థిక సంబంధ వ్యవహారాలందు ఊగిసలాటలకు గురికాగలరు. ఋణభారాలు పెరగనీయకుండా కడు మెలకువలతో సాగాలి.

వివాహాది శుభయత్నాలు ద్వితీయార్థంలో ప్రయో జనాలను ఇవ్వగలవు. బంధుమిత్రుల సలహాలు, సహకారాలను తీసుకోగలరు.గృహ సంబంధ వ్యవహా రాలు వంటివి నాన్పుడు స్థితిలో సాగుతాయి.

ఉన్నత విద్యలకు ఋణాలు ఏర్పడగలవు. వ్యవ సాయదారులకు కొంత చికాకులున్నా 2 పంటలందు సుమారు లాభాలుంటాయి.

రాజకీయవ్యక్తులు, అధికారిక ఉద్యోగులు హోదాలు కాపాడుకునేందుకు యత్నించుకోవాలి. పారిశ్రామికవేత్తలకు, చేతివృత్తులువారికి తరచుగా ఏదో ఒక ఇబ్బందికర స్థితి ఉండగలదు.

ఆరోగ్య విషయాలందు కొంత ప్రతికూల స్థితు లున్నా మీ పనులకు అంతరాయాలుండవు.

హామీలువంటివి ఇచ్చుటకంటే లౌక్యంగా వ్యవహ రించుకొనుట మేలవ్వగలదు.

మీరు గ్రహానుకూలతలు పెరుగుటకు ప్రదోష సమయంలో సత్యనారాయణస్వామి వ్రతం నిర్వహిం చుట, లలితా పారాయణలు చేయుట మేలుకరం.

మీరు ఉషఃకాలమున 10 నిమిషాలు హ్రీం క్లీం సౌః అను మంత్రమును జపించుకొనుట-

3, 12, 21, 30 లలో ముఖ్య పనులను చేపట్టు కొనుట, పసుపు, శనగలు, కుంకుమపువ్వు వంటివి బ్రాహ్మణులకు దానాలు ఇచ్చుటచేతను మేలైన ఫలితాలు పొందగలరు.

# మోకీలు, తుంటి నొప్పుల నుండి విముక్తి

వయస్సు పైబడే కొద్ది వచ్చే కీళ్ళ అరుగుదల వలన లేదా చిన్న వయస్సులోనే కీళ్ళవాతం, ప్రమాదాలు, హీమోఫీలియా, కాల్షియం లోపాలు వలన... కారణాలు ఏవైనా కీళ్ళ అరుగుదల వలన నడక నరకప్రాయమై, చిన్న చిన్న పనులకు కూడా ఇతరులపై ఆధారపడుతుంటారు. ఇటువంటివారికి కీళ్ళ మార్పిడి శస్త్రచికిత్స పునర్జన్మ అని చెప్పవచ్చు.

**మోకీలు మార్పిడి శస్త్రచికిత్స ఎవరికి అవసరం?**

1. కొన్ని నెలలుగా లేదా సంవత్సరాలుగా మోకీలు నొప్పి తగ్గక బాధపడుతుండటం.
2. 10 నిముషాలుకంటే ఎక్కువ సమయం నిలబడలేకపోవడం.
3. 500 గజాల కంటే ఎక్కువ నడవలేకపోవడం.
4. కొన్ని మెట్లు కూడా ఎక్కలేకపోవడం.
5. మోకాలు నొప్పులు ఎటువంటి మందులకు తగ్గకపోవడం.
6. ఎక్స్‌రేలో మోకీలు అరుగుదల చాలా ఎక్కువగా ఉండటం.

పైన చెప్పిన ఆరు సమస్యలు అన్నీ ఉన్నవారికి మాత్రమే మోకీలు మార్పిడి శస్త్రచికిత్స అవసరం పడవచ్చు. ఈ మోకీలు మార్పిడి శస్త్రచికిత్సా విధానంలో ఎన్నో అధునాతన పద్ధతులు వెలుగులోనికి వచ్చాయి.

**కీలు మార్పిడిలో ఏం చేస్తారు?**

కీలు మార్పిడిలో, అరిగిపోయిన మృదులాస్థిని తొలగించి తొడవైపు ఎముక భాగానికి మరియు క్రిందివైపు ఎముక భాగానికి మెటల్ ఇంప్లాంట్ మధ్యలో ప్లాస్టిక్‌ను అమర్చెదరు.

**ఫాస్ట్‌ట్రాక్ అనస్థీషియా:**

ఇదివరకు ఇచ్చే అనస్థీషియా పద్ధతిలో ఆపరేషన్ తరువాత నొప్పులు ఎక్కువగా ఉండటం వలన పేషెంట్స్ రెండు రోజులు తరువాత గాని నడక మొదలు పెట్టేవాళ్ళు కాదు. కాని ఈ నూతన పద్ధతిలో అనస్థీషియా ఇచ్చి సర్జరి చేసిన వారిలో నొప్పి చాలా తక్కువగా ఉండటం, చాలామంది సర్జరి చేసిన రోజు సాయంత్రం నుండే నడక ఆరంభించడం మరియు రెండు రోజులలోనే డిస్చార్జ్ అయ్యి ఇంటికి వెళ్ళటం జరుగుతుంది. ఇలా మొదటి రోజు నుండే నడవడం వలన వారి ఆత్మవిశ్వాసం పెరిగి చాలా తొందరగా కోలుకోవడం గమనించదగ్గ విషయం.

డా॥ కీర్తి పొలడుగు
ప్రముఖ మోకీలు, తుంటి శస్త్రచికిత్స
& ఆర్థరోస్కోపి నిపుణులు, శ్రీకర హాస్పిటల్స్
**EHS సదుపాయం కలదు**

**కీలు మార్పిడి తరువాత జీవన విధానం:**

కొంతమందిలో కీలు మార్పిడి తరువాత అస్సలు నడవకుండా ఉండే పరిస్థితి ఉంటుంది అనే అపోహ ఉంటుంది. కాని ఇప్పుడున్న అత్యాధునిక సాంకేతిక విధానాలతో శస్త్రచికిత్స చేయడం వలన ఇన్ఫెక్షన్లు, ఇబ్బందులు వచ్చే అవకాశం చాలా అరుదు. కీలు మార్పిడి కోసమే ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ఆపరేషన్ థియేటర్లు కలిగిన ఆధునికమైన ఆసుపత్రులలో కీలుమార్పిడి శస్త్రచికిత్స చేయించుకోవడం వల్ల ఇన్ఫెక్షన్లు దరిచేరవు. దీని వల్ల శస్త్రచికిత్స నుండి మీరు తొందరగా కోలుకొని, మీ మునుపటి జీవన విధానం సంతోషంగా గడపటం జరుగుతుంది. ముందులాగే, నడవడం, పరిగెత్తడం, జాగింగ్ వంటివి ఎంతో ఉత్సాహంగా చేసుకోవచ్చు. అంతే కాకుండా మీ మోకాలును మడుచుకొని సౌకర్యవంతంగా కూర్చోవచ్చు. అంతేకాక కొద్దికాలంలోనే నిత్యావసర పనులు చేసుకోవడమేకాక, మెట్లు ఎక్కడం, వాహనాలు నడపటం కూడా జరుగుతుంది.



మానవ శరీరంలో తుంటి కీలు అనేది అతిపెద్ద మరియు అత్యంత స్థిరమైనది. ఇది అతిపెద్ద బాల్ మరియు కప్ లాంటి ఆకారం కలిగిన ఎముకల సముదాయం. బాల్ అనేది తుంటి ఎముకకు పైచివరన ఉంటుంది. మనం రోజూ ఏ పని చేస్తున్నా మిగతా అన్ని శరీర భాగాలతో ఒక సమన్వయ స్థితిలో ఉండేలా ఈ తుంటి కీలు ఒక స్థిరత్వాన్ని అందిస్తుంది.

**సాధారణంగా తుంటి నొప్పి క్రింది కారణాల వలన వస్తుంది**

**ఆస్టియో ఆర్థటిస్:** వయసు పైబడిన వారిలో ఎముకల రాపిడి వల్ల వచ్చే నొప్పి.

**రెమటాయిడ్ ఆర్థటిస్:** మృదులాస్థిని నాశనం చేసే రోగనిరోధక రుగ్మత. దీనిని కీళ్ళవాతం అని కూడా అంటారు. **ఏ. వి. ఎన్.:** తుంటి యొక్క ముఖ్య భాగంలో రక్త ప్రసరణ లేకపోవడం వల్ల వచ్చే రుగ్మత.

**శస్త్రచికిత్స ఎప్పుడు సిఫారసు చేయబడుతుంది?**

1. తుంటి నొప్పి ప్రతీరోజూ తీవ్రంగా వేధిస్తున్నపుడు.

2. నడుస్తున్నపుడు, వంగినపుడు, మెట్లు ఎక్కినపుడు నొప్పి తీవ్రంగా ఉన్నపుడు. 3. విశ్రాంత సమయంలో కూడా నొప్పి వేధిస్తున్నపుడు. 4. తుంటి భాగం ధృడంగా లేనపుడు. 5. మందులు, ఫిజియోథెరపి, నడక వంటి చికిత్సల వల్ల కూడా నొప్పి తగ్గనపుడు. 6. తుంటి కీలు విరిగినపుడు

తుంటి మార్పిడిలో ఉపయోగించే కృత్రిమ కీలు అమరిక వల్ల పేషెంట్లు నొప్పి నుండి ఉపశమనం పొంది తమ రోజువారీ కార్యకలాపాలు నిర్వహించే సామర్థ్యం ఎన్నో రెట్లు పెరుగుతుంది. దీని వలన మెట్లు ఎక్కడం, వాహనం నడపగలగడం వంటి సాధారణ పనులు అన్నీ సులభతరమవుతాయి.

**తుంటి మార్పిడి శస్త్రచికిత్స అంటే ఏమిటి?**

విరిగిపోయిన / అరిగిపోయిన తుంటికి ఒక వైపు మెటల్ లేదా సిరామిక్ బాల్ కలిగిన ఇంప్లాంట్‌ను, మరొక వైపు సిరామిక్ లేదా పాలీ కలిగిన కప్పును అమర్చడమే తుంటి మార్పిడి శస్త్రచికిత్స.

**శస్త్రచికిత్స నిబంధనలు:**

శస్త్రచికిత్స చేయడానికి ముందు పేషెంటుకు కొన్ని నిర్ధారణ పరీక్షలు తప్పనిసరి. సర్జికల్ ప్రొఫైల్, గుండె మరియు ఇతర వైద్య పరీక్షలు, అనస్థీషియా పరీక్షల ద్వారా పేషెంట్ ఆరోగ్యం శస్త్రచికిత్సకు సన్నద్ధంగా ఉందో లేదో తెలుసుకోబడుతుంది. ఇంప్లాంట్ అనేది పేషెంటు యొక్క అవసరం ప్రకారం నాణ్యత, మరియు ఎముక యొక్క సామర్థ్యం ఆధారంగా చేసుకుని ఎన్నుకోబడుతుంది.

శస్త్రచికిత్సానంతరం ఒక క్రమమైన పద్ధతిలో వివిధ దశలుగా నడక మరియు కూర్చోవడం, నిలబడడం, 3-4 వారాలలో మెట్లు ఎక్కడం, తమ పనులు చేసుకోగలగడం, 4-6 వారాలలో వాహనాలు నడపగలగడం జరుగుతాయి.




**అధిక బరువు కలవారు శస్త్రచికిత్స చేయించుకోవచ్చా?**

తుంటి మార్పిడికి పేషెంటు యొక్క వయసు, బరువులతో ఏమాత్రం సంబంధం లేదు. పేషెంటు యొక్క నొప్పిని, తుంటి స్థితిని పరిగణలోకి తీసుకుని శస్త్రచికిత్స అనేది సూచించడం జరుగుతుంది.

**శస్త్రచికిత్స తరువాత ఉత్పన్నమయ్యే సమస్యలు:**

ప్రపంచవ్యాప్తంగా తుంటి మార్పిడి శస్త్రచికిత్స తరువాత సమస్యలు ఉత్పన్నమయ్యే అవకాశం 2 శాతం కంటే తక్కువ ఉంటుంది. వీటిలో ఇన్ఫెక్షన్లు, రక్తం గడ్డ కట్టడం, రెండు కాళ్ళ మధ్య అసమానతలు, స్థానభ్రంశం లాంటివి ఉంటాయి. కానీ ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం వలన, ఇంప్లాంట్ లో డ్యూయల్ మొబిలిటి మూలంగా ఇంప్లాంట్ స్థానభ్రంశం చెందే అవకాశం చాలా అరుదు.

# జరీన్‌ఖాన్



బాలీవుడ్ తార జరీన్‌ఖాన్ తన విశేషాలు,వ్యక్తిగత అభిప్రాయాలను ఏకరువు పెట్టింది. అందంపట్ల తన భావాలను వ్యక్తం చేసింది.

▸ **నా దృష్టిలో అమ్మాయిల్ని ఇంప్రెస్ చేసే మంత్ర:** షో-ఆఫ్‌లు చెయ్యకుండా ఎలా వుండాలో అలాగే వుండాలి

▸ **నా వెంట ఎల్లవేళలా వుండే మూడు వస్తువులు:** మా ఇంటి తాళాలు, ఫోన్, సన్‌గ్లాసెస్

▸ **మగవాడిలో నచ్చేది:** అతని సెన్సాఫ్‌హ్యూమర్

▸ **మగవాడిలో అస్సలు నచ్చనిది :** శరీరంనుండి వెలువడే దుర్వాసన

▸ **నచ్చే శారీరక రకం :** ప్రస్తుతం నా శరీరంతో నేను చాలా కంఫర్ట్‌గా వున్నాను.

అలాగే వుండాలన్నది నా కోరిక- అది వలప్టస్ అయినా, బికినీ బాడీ అయినా సరే

▸ **ఆక్వర్డ్‌గా ఫీలయిన సందర్భాలు :** చాలా వున్నాయి

▸ **ఒకవేళ రిలేషన్‌షిప్‌లో వుంటే:** చాలా చిల్డ్‌అవుట్ గాళ్‌ఫ్రెండ్‌ని అవుతా. ఎందుకంటే రిలేషన్‌షిప్స్‌గురించిన అవగాహన లేదు.పైగా నాకు ప్రశాంతమైన రిలేషన్‌షిప్ కావాలి.కాబట్టి డ్రామా అంతా పక్కన పెట్టేసి పూర్తిగా ఉత్సాహంగా వుంటాను

▸ **నేను మోసపోయిన సందర్భాలు :** రెండు ఉన్నాయి. తర్వాత అదృష్టవశాత్తూ అవేవీ లేవు

▸ **నా లవర్:** వైల్డ్‌గా, ఫన్నీగా, అబ్బురంగా వుండాలి కాని సాఫ్ట్‌గా కాదు

▸ **మగవాడిలో ముందుగా ఆకర్షించేవి :** అతని కళ్ళు. ఏ వ్యక్తికి అయినా అతని కళ్ళు అబద్ధాలు చెప్పవు కదా

▸ **నా సెలబ్రిటి స్టేటస్‌ను :** ఎప్పుడూ ఎడ్వాంటేజ్‌గా తీసుకోను

▸ **నా ప్రాధాన్యం :** పవర్ ప్యాక్డ్ పర్‌ఫార్మర్‌గా వుండేందుకు

▸ **పరిశ్రమలో నా దృష్టిలో సెక్సీయెస్ట్ నటీనటులు:** రణవీర్‌సింగ్, కరీనాకపూర్

▸ **హాటెస్ట్ తారలు :** దీపికా పడుకొనె, కత్రినాకైఫ్‌లు. వీళ్ళకు గొప్ప శరీరాకృతి వుంది

▸ **నేను మెచ్చే పురుషుడికి :** మాస్క్యులర్ బాడీ వుండాలి

▸ **నా దృష్టిలో పర్‌ఫెక్ట్ డేట్ :** బీచ్ ఒడ్డున డిన్నర్ సెట్టింగ్

# కథ కథ కథ కథల పోటీ

Courtesy : VANITHA

## ఒక్కొక్క కథకు ₹ 9,999 ల బహుమతి

## సాధారణ ప్రచురణ కథకు ₹ 2,000

కథ అంటే కలలా కరిగిపోకూడదు. అది మనకు కనబడుతూవుండాలి. అందులో మనమూ వుండాలి. మన చుట్టుపక్కలవారూ, మనవాళ్ళూ వుండాలి. చాలాకాలం గుర్తుకొస్తూవుండాలి. అందరికీ చెప్పేలా వుండాలి. మన సమస్యలకు సమాధానాలు ఆ కథలో దొరికితే అది మరీ ఉత్తమమైన కథ. అటువంటి కథలను ఈ 'కథ కథ కథ కథల పోటీ'కి రాయండి.

ఈ దిగువ ఇస్తున్న సబ్జెక్టులను ఇతివృత్తాలుగా చేసుకుని రచయిత(త్రు)లను కథలు రాయవలసిందిగా కోరుతున్నాం.

ఒక్కరు ఒక్క సబ్జెక్టుపైనే రాయాలన్న నియమం లేదు. ఒకటికి మించి రాయొచ్చు. రాయగలిగితే అన్ని సబ్జెక్టులపైనా రాయొచ్చు. అది మీ ఇష్టం. పాఠకదేవుళ్ళకు అక్షరనైవేద్యంగా మీ కథలను అందించండి.

### రచయిత(త్రు)లు కథలుగా మలచవలసిన సబ్జెక్టులు ఇవే:

1. ఉద్యోగి
2. వ్యాపారి
3. డాక్టర్
4. ఇంజనీర్
5. ఆర్కిటెక్ట్
6. రైటర్
7. ఎన్ఆర్ఐ
8. ఇండియన్

**9. పై 8 గాక మీకు ఇష్టమైన సబ్జెక్ట్ ఏదైనా సరే 9వ కథ అవుతుంది**

ఇవీ సబ్జెక్టులు. రాయండి, రాసి విజేతలుకండి.

9 కథలకు 9 బహుమతులు. ప్రతి కథకు ₹ 9,999 లను బహుమతిగా అందజేస్తాం.

ఈ పోటీలో పాల్గొనే రచయిత(త్రు)లు ఈ క్రింది విషయాలను గమనించవలసిందిగా మనవి.

: నిబంధనలు :

1. అనువాదాలు, అనుకరణలు, ఇతర పత్రికలకి పంపబడి పరిశీలనలో ఉన్న రచనలు పంపవద్దు.
2. కథల ఎంపికలో స్వాతిసంపాదకునిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఉత్తరప్రత్యుత్తరాలకు తావులేదు. ఈ కథల పోటీ గడువు తేదీని పొడిగించేందుకుగానీ, పోటీని రద్దు చేసేందుకుగానీ స్వాతి పబ్లికేషన్స్ యాజమాన్యానికి సర్వహక్కులున్నాయి.
3. కథ తమ స్వీయరచన అని, అముద్రితమని, తమ స్వదస్తూరితో రాసిన హామీపత్రాన్నివిధిగా జతపరచాలి.
4. మీరు రాసే కథపైన తప్పనిసరిగా తీసుకున్న సబ్జెక్టు రాయండి. కథ ప్రింటింగ్‌లో 3 పేజీలకు మించరాదు. కథలను తిప్పిపంపగోరువారు తగినన్ని స్టాంపులు అంటించిన స్వంత చిరునామాగల కవరు జతపరచాలి. కవరుమీద 'కథ కథ కథ కథల పోటీకి' అని రాయాలి.

కథలను పంపవలసిన చిరునామా : ఎడిటర్ స్వాతి సపరివార పత్రిక అనిల్ బిల్డింగ్స్ సూర్యారావుపేట పోస్ట్ బాక్స్ 339 విజయవాడ 520 002

**రచనలు మాకు చేరవలసిన ఆఖరు తేది : 20.4.2018**

ఆది దేశవ్యాప్తంగా ప్రచురితమయ్యే ఒక ప్రముఖ ఇంగ్లీషు దినపత్రిక. దాని ఆదివారం ఎడిషన్లో కేవలం క్లాసిఫైడ్స్ అనబడే చిన్ని ప్రకటనలు అయిదారు పేజీలు ఉంటాయి. ఎప్పటిలానే ఆ ఆదివారం కూడా తెల్లవారక ముందే ఆ దినపత్రిక ఇంటింటికీ చేరుకుంది.

దానిలో ఆ రోజు ప్రచురితమయిన వందలాది ప్రకటనల్లో, ఒక మూల ఉన్న ఓ చిన్ని ప్రకటన ఆ పత్రికను చదివే లక్షలాది పాఠకుల్లో కేవలం ఆరుగురిని మాత్రమే ఆ ప్రకటన ఆకర్షించగలిగింది.



## కొత్త సీరియల్ ప్రారంభం

# వేట

పుట్టగంటి గోపీకృష్ణ
9491091620
E-mail: puttaganti65@yahoo.co.in

'సెకండ్ హ్యాండ్ వాహనాలు అమ్మకమునకు కలవు' అని మొదలయిన ఆ ప్రకటనలో, తమ దగ్గర ఆరు పాత అంబాసిడర్ కార్లు ఉన్నాయని పేర్కొంటూ వాటి రిజిస్టర్ నెంబర్లు కూడా ఇచ్చారు.

ఆసక్తి కలవారు సంప్రదించటానికి ఫోన్ నెంబర్ ఇస్తూ ప్రకటన ముగిసింది.

సహజంగా క్లాసిఫైడ్స్ లోకల్ ఎడిషన్లకు మాత్రమే పరిమితమవుతాయి. అయితే ఈ ప్రకటన మాత్రం దేశవ్యాప్తంగా అన్ని ఎడిషన్లలో ఒకేరోజు వచ్చింది.

కాబట్టే... భారతదేశంలోని ఆరు రాష్ట్రాల్లో ఉన్న ఆరుగురు వ్యక్తులు ఒకేసారి ఆ వార్తని ఆసక్తిగా చదివారు. ఆ ఆరుగురిలో ఒకడు నారాయణ కుట్టి.

కేరళ రాష్ట్రంలోని కొచ్చిన్ నగరంలో అత్యాధునిక ప్రాన్ ప్రాసెసింగ్ సెంటర్ నడుపుతున్నాడతను. అతనికి తను చేసే వ్యాపారం అంటే బోలెడంత ఇష్టం. అమెరికాలోని వాల్‌మార్ట్‌లో అమ్మే రొయ్యల ప్యాకెట్లు ర్యాపర్లతో సహా అన్నీ ఇక్కడతనే తయారుచేసి పంపుతానని తెలిసినవారందరికీ గర్వంగా చెప్పుకుంటూ ఉంటాడతను.

నారాయణ కుట్టి అలవాటు ప్రకారం ఆదివారం అయినా ఉదయాన్నే వచ్చి తన ఆఫీసులో కూర్చున్నాడు. ఆ రోజు సెలవు కాబట్టి యూనిట్ పనిచేయదు. వర్కర్లెవరూ లేకపోవటంతో ఎప్పుడూ హడావుడిగా ఉండే ఆవరణ నిర్మానుష్యంగా ఉంది.

పీక్ సీజన్ అయితే ఓవర్ టైమ్ ఇచ్చి అయినా పని చేయించేవాడు. ఇప్పుడు స్లాక్ సీజన్ కావటంతో ఆ అవసరం రాలేదు. తీరిగ్గా కూర్చుని పేపర్ చదవటానికి ఉపక్రమించిన అతనికి, దినపత్రికలో పడిన ప్రకటన దృష్టిలోకి వచ్చింది.

అందులో ప్రచురితమయిన ఆరు వాహనాల రిజిస్టర్ నెంబర్లను పరిశీలనగా చూశాడు అతను. అందులో ఒకటి కేరళ రాష్ట్ర రిజిస్టర్ నెంబర్. ఆ నెంబర్ చదివిన అతను ఉలిక్కిపడ్డాడు. మామూలుగా అతనికి ఇంగ్లీషు పేపరు చదివే అలవాటు లేదు.

అయినా, అతను ఎన్నోనెలలుగా ఆ పేపర్ తెప్పిస్తున్నాడంటే కారణం ఏదో ఒకనాడు ఈ ప్రకటన పడుతుందని అతనికి తెలుసు. ఆ ప్రకటన చూడగానే తను ఏమిచేయాలో కూడా అతనికి బాగా తెలుసు.

హడావుడిగా చేతిలో పేపర్ పట్టుకుని లోపల గదిలోకి నడిచిన అతను, అక్కడ ఉన్న ఒక సేఫ్ తెరచి ఒక కవర్ తీశాడు. ఓపెన్ చేసి దానిలో కాగితం బయటకు తీసి చూశాడు. దాని మీద బోల్డ్ అక్షరాలతో ఒక నెంబర్ రాసి ఉంది. ఆ నెంబర్‌ను పేపర్‌లోని ప్రకటనలో కనిపించిన నెంబర్‌తో పోల్చిచూశాడు. రెండూ సరిగ్గా మ్యాచ్ అయ్యాయి.

గాఢంగా ఊపిరి పీల్చి వదిలాడు నారాయణ కుట్టి. వస్తుందో, రాదో అని ఎదురు చూసిన క్షణం రానేవచ్చినందుకు బాధపడాలో, కనీసం ఇక ముందు ఎదురు చూపుల బాధ తప్పినందుకు ఆనందించాలో అతనికి అర్థం కాలేదు.

సేఫ్‌లో నుండి తీసిన కవర్‌ను, దానిలోని కాగితాన్నీ చింపేశాడు. ఇక ఆ కాగితంతో అతనికి పని లేదు. తను ఏంచెయ్యాలో అతనికి బాగా తెలుసు.

తిరిగి సేఫ్ మూసి ఆఫీసు గదిలోకి వచ్చి ఆలోచిస్తూ నిలబడ్డాడు. నిజానికి అతనికి ఆలోచించుకోవటానికి కూడా సమయం లేదు. వెంటనే బయలుదేరాలి. అలానే అతను బయలుదేరాడు.

అదే విధంగా దేశంలోని వివిధ ప్రదేశాల్లో ఆ ప్రకటన చూడటం ద్వారా మరెవరికీ అర్థంకాని ఒక సందేశం మరో అయిదుగురు వ్యక్తులకు చేరింది. సందేశం అందుకున్న ఆ అయిదుగురు వ్యక్తులు కుట్టిలానే అర్జంటుగా బయలుదేరారు.

తెల్లటి మంచు మధ్య నల్లటి తారురోడ్డు మెలికలు తిరుగుతూ సాగిపోతోంది. మనాలి నుండి రోహ్‌తాంగ్ పాస్ వెళ్ళే రోడ్డు అది. టూరిస్టు వాహనాలతో ఆ రోడ్డు ఎప్పుడూ రద్దీగా ఉంటుంది.

ఆ రోడ్డు మీద ప్రయాణిస్తోంది ఒక వాహనం. ఇంకా రోహ్‌తాంగ్ పాస్ ఏడు కిలోమీటర్లు ఉందనగా ఒక హెయిర్ పిన్ బెండ్ వచ్చింది.

అక్కడ నుండి చూస్తే అగాధాల్లాంటి లోయలు... తెల్లటి మంచుతో కప్పబడి, అబ్బురపరుస్తూ కనిపిస్తాయి. మధ్యమధ్యలో మంచునుండి పొడుచుకు వచ్చినట్లు ఆకాశంలోకి తిన్నగా ఎదిగిన పచ్చని పైన్ వృక్షాలు తప్ప అంతా తెలుపే. టూరిస్ట్ వాహనాలు ఆ బెండ్ దగ్గర కాసేపు ఆగుతాయి. అద్భుతమయిన ఆ ప్రకృతిని కాసేపు ఆస్వాదించి, ఫోటోలు తీసుకుని తిరిగి బయలుదేరుతారు టూరిస్టులు.

లోయ ఉన్నవైపు కాకుండా, రోడ్డుకు మరోవైపు

## ఎంత మోజో!

గ్లామర్ డాల్ శృతీహాసన్‌కు చెప్పులంటే మహా మోజు. వాటిని చూసిందంటే స్వంతం చేసుకోకుండా ఉండడం కష్టమట. "నాకు చెప్పులంటే భలే ఇష్టం. శాండల్స్, ఫ్లాట్ హీల్స్- ఒకటేమిటి ఏదైనా సరే అమిత ఇష్టం. ఎన్ని రకాలు సేకరించానో చెప్పలేను. ఓ సందర్భంలో వంద జతలకు చేరడంతో ఇక వద్దనుకున్నా. కాని, ఆ తర్వాత మళ్ళీ మామూలే.

ఎక్కడికి షాపింగ్‌కు వెళ్ళినా టెంప్ట్ అయిపోయి కొనేస్తుంటా. ఇప్పుడు ఎన్ని జతలున్నాయో చెప్పలేను. ప్రతిడ్రెస్‌కూ మ్యాచ్ అయ్యేలా ఓ నాలుగైదు రకాలైనా వుంటాయనుకోండి" అంటూ తన మోజు గురించి మురిపెంగా చెప్పుకున్నది.



## కొత్త సీరియల్ ప్రారంభం

తెల్లటి మంచుతో కప్పబడిన చదునయిన ప్రదేశం ఉంది. అక్కడ చెక్కలతో కట్టిన రిఫ్రెష్‌మెంట్ స్టాల్స్ కొన్ని ఉన్నాయి. వేడి వేడి టీ, బిస్కెట్లు, సమోసాలు, సిగరెట్లు, గుట్కా అక్కడ అమ్ముతున్నారు. వచ్చిన వాళ్ళు కాసేపుకూర్చోవడానికి వీలుగా అక్కడకొన్ని చెక్కబెంచీలు ఉన్నాయి. అలాంటి ఒకస్టాల్ ఎదురుగా ఆగింది లిమ్బెన్ ప్రయాణిస్తున్న కారు.

ఎన్నో గంటలుగా ప్రయాణం చేస్తున్నట్లున్నాడతను. కారు దిగి ఒళ్ళు విరుచుకుని చుట్టూ ఒకసారిచూసి ఎదురుగా కనిపిస్తున్న స్టాల్ వైపు అడుగులు వేశాడు. నాగాలాండ్ రాష్ట్రంలోని టుయాన్ సాంగ్ జిల్లాలో ఉంటాడతను. ఆ జిల్లాలో అడవుల మధ్య ఉండే కిఫిరే అతని ఊరు.

కానీ అతను జిల్లా కేంద్రంలో ఉంటాడు. మిగిలిన రోజులు ఎలా ఉన్నా ముఖ్యంగా ఆదివారం ఎట్టి పరిస్థితుల్లోనూ పేపర్ చూడకుండా ఉండడు.

ఆ ఆదివారం కూడా అలానే పేపర్ చూసిన అతనికి ఆ ప్రకటన కనిపించింది. అందులో ప్రచురితమయిన వెహికల్ నెంబర్ తన దగ్గర ఉన్న నెంబర్‌తో సరిపోయిందని నిర్ధారించుకుని వెంటనే బయలుదేరాడతను. దినపత్రికలో ఆ ప్రకటన రాగానే అతను ఏం చెయ్యాలో తెలుసుకోవటానికి అందులో ఇచ్చిన ఫోన్ నెంబరును సంప్రదించాడు.

నాగాలాండ్‌లో బయలుదేరిన అతను అనేక కష్టనష్టాలకు ఓర్చుకుని ఎట్టకేలకు ఇక్కడకు చేరాడు.



**సి.పి.ఎమ్. నేత మాణిక్ సర్కార్ ఇక పశ్చిమబెంగాల్ లేదా కేరళ లేదా బంగ్లాదేశ్‌కో వెళ్ళవచ్చు. -హిమంత్ బిశ్వాస్ శర్మ, బి.జె.పి. నేత**

అతను అందుకున్న సూచనల ప్రకారం ఈ రోడ్డు మీద ఈ మలుపువద్ద ఆగాలి. ఆ తరువాత పక్కన ఉన్న టీ స్టాల్ దగ్గరకు వెళ్ళాలి.

స్టాల్‌లో టీ తాగి అయిదు వందల నోటు ఇవ్వాలి. స్టాల్‌వాడు చిల్లరలేదన్నా, అయిదు వందలకు సరిపడా చిల్లర ఇచ్చినా ఏదోతేడా ఉన్నట్లు.

అలాకాకుండా నాలుగు వందల తొంభై ఇవ్వాల్సిన చోట ఉత్తి తొంభై ఇస్తే అంతా సక్రమంగా ఉన్నట్లు. ఎదురుగా కనిపిస్తున్న టీస్టాల్‌లోకి నడిచాడు లిమ్బెన్. అదే సమయంలో స్టాల్‌ముందు ఆగుతున్న ప్రతి వాహనాన్ని తీక్షణంగా చూస్తున్నాడు స్టాల్ నడుపుతున్న వ్యక్తి. అతని చూపులు చూసిన ఎవరైనా అది కస్టమర్లను ఆహ్వానించటంలో వ్యాపారస్తుడికి ఉండే సహజమయిన ఆసక్తి అనుకుంటారు.

కానీ నిజానికి అతను చూస్తోంది ఎదురుగా ఆగుతున్న వాహనం రిజిస్టర్ నెంబర్. లిమ్బెన్ వచ్చిన కారు నెంబర్ చూడగానే అతని మెదడు ఒక్కసారిగా అలర్ట్ అయింది. అతను ఆ రోజు ఎప్పటి నుండో ఆ వాహనం కోసం ఎదురు చూస్తున్నాడు.

చాలా మామూలుగా స్టాల్‌లోకి వస్తున్న లిమ్బెన్ వైపు చూశాడు అతను. చైనా, ఇండియా, మయన్మార్ దేశస్థుల ముఖకవళికలను మిళితంచేసినట్లు ఉన్న లిమ్బెన్‌ను చూడగానే ఎవరయినా ఈశాన్య రాష్ట్రాలకు చెందిన వ్యక్తి అని చెప్తారు. అయిదున్నర అడుగుల ఎత్తు, బలహీనంగా ఉన్న శరీరం... మరోసారి చూడాలనిపించే ఆహార్యం కాదు అతనిది.

వచ్చి స్టాల్‌లో ఉన్న చెక్క బెంచీ మీద కూర్చుని ఒక టీ ఆర్డర్ చేశాడు లిమ్బెన్. రెండు నిమిషాల్లో పొగలు వెలువరిస్తున్న టీ అతని చేతుల్లో ఉంది.

చల్లటి ఆ వాతావరణంలో వెచ్చటి టీని నెమ్మదిగా ఆస్వాదిస్తూ తాగాడు. తాగటం పూర్తయ్యాక గ్లాసు పక్కనపెట్టి అయిదు వందల నోటు ఇచ్చాడు.

స్టాల్‌అతను90రూపాయలువెనక్కిఇస్తూ వాటితో పాటు ఒక కవర్ కూడా అతనికి ఇచ్చాడు.

మాట్లాడకుండా... కవరు, చిల్లర జేబులో వేసుకుని వెనుతిరిగాడు లిమ్బెన్.

ఆ కవర్లో లిమ్బెన్ చేయవలసిన ఫ్యూచర్ ప్లాన్ ఉంది. స్టాల్ నడుపుతున్న వ్యక్తి ఒక్క మాట కూడా మాట్లాడకుండా తను ఏ వ్యక్తికి సమాచారం అందచేయాలో ఎలా గుర్తించాడంటే, ఆ వాహనం నెంబర్ స్టాల్ అతనికిముందే తెలియచేయబడింది.

అందుకే తన దగ్గర ఉన్న నెంబరుతో మ్యాచ్ అయిన నెంబర్ కలిగిన వాహనం నుండి దిగినవ్యక్తికి తను అందచేయవలసిన కవర్ ఇచ్చాడతను.

అంతా అనుకున్నది అనుకున్నట్లు జరగటంతో స్టాల్ వ్యక్తి ఇచ్చిన కవర్ జేబులో పెట్టుకుని తిరిగి వెళ్ళి తన వాహనంలో కూర్చున్నాడు లిమ్బెన్. అదే రోజు మిగిలిన అయిదుగురికీ అలాంటి కవర్లు వేరు వేరు ప్రదేశాల్లో అందాయి.

పూరన్‌సింగ్ జైసల్మీర్ రావటం అదే మొదటి సారి. గత ఆదివారం ఇంగ్లీషు పేపర్లో ప్రకటనకి అలర్ట్ అయిన ఆరుగురిలో అతనుకూడా ఒకడు. ప్రకటన చూడగానే తన పనులన్నీ వదిలేసి ఢిల్లీ బయలుదేరాడతను.

ఢిల్లీలోని అండర్‌గ్రౌండ్ మార్కెట్ పాలికా బజార్‌లో షాప్ నెంబర్ 451లోకి నడిచి 1000 నోటు ఇచ్చి తన మొబైల్ నెంబరుకు రీఛార్జ్ చేయమన్నాడు.

"మీ సిమ్ నెంబర్?" అడిగాడు షాపువాడు.

చెప్పాడు పూరన్ సింగ్. నోట్‌బుక్‌లో నెంబర్ రాస్తున్న వ్యక్తిపెన్ను మధ్యలో ఆగిపోయింది. తలెత్తి పూరన్‌సింగ్‌వైపు చూడాలన్న కోరికను బలవంతంగా అణచుకుని తన బుర్రలో రిజిస్టర్ అయి ఉన్న మరో నెంబర్‌తో ఈ నెంబర్ సరిపోల్చుకున్నాడు.

రెండూ మ్యాచ్ అయ్యాయి. టేబుల్ సొరుగుతెరచి ఒక కవరు బయటకు తీసి పూరన్‌సింగ్‌కు అందిస్తూ, "మీ రీఛార్జ్ పూర్తయింది. మరో రెండు నిమిషాల్లో మెసేజ్ వస్తుంది" అని చెప్పాడతను.

"థాంక్స్..." అంటూ బయటకు నడిచాడు పూరన్ సింగ్. తరువాత ఏకాంతంలో కవర్ ఓపెన్ చేసి చూశాడు. ఎనిమిది అంకెల రెండు సంఖ్యలు ఒకదాని కింద ఒకటి రాసి ఉన్నాయి ఆ కవర్లో.

27074414, 70443752

ఆ అంకెలు ఒక ప్రదేశం యొక్క అక్షాంశం, రేఖాంశం అని అతనికి తెలుసు. 27074414 అంటే ఇరవై ఏడు డిగ్రీల ఏడుమినిట్ల నలభై నాలుగు పాయింట్ పధ్నాలుగు సెకండ్లు అని అర్థం.

అంటే మొదటి అంకె అక్షాంశం, రెండవ అంకె రేఖాంశం. ఆ రెండు రేఖలూ కలుసుకునే చోటుకు అతను చేరుకోవాలి.

నెట్‌లో ఆ ప్రదేశం ఎక్కడ ఉంటుందో చూసిన అతనికి అది రాజస్థాన్ రాష్ట్రంలోని థార్ ఎడారిలో ఒక ప్రదేశం అని అర్థమయింది.

అక్కడకు చేరే ప్రయత్నంలో ముందుగా అతను జైసల్మీర్ చేరాడు. అక్కడ నుండి మోకల్ అనే ఊరు వచ్చాడు. ఇంకా తను వెళ్ళవలసిన ప్రదేశం ఏడు కిలోమీటర్ల దూరంలో ఉంది.

మెత్తటి, గోధుమ రంగు ఇసుకతో నిండి ఉన్న ఆ ఎడారిలో వెళ్ళగల వాహనం ఒంటె ఒకటే.

ఒక ఒంటెను అద్దెకు తీసుకుని దానిమీద ఎక్కి కూర్చున్నాడు పూరన్ సింగ్. ఒంటె యజమాని దాని ముక్కు తాడు పట్టుకుని ముందుకు నడుస్తున్నాడు. అక్కడ మొబైల్ సిగ్నల్స్ ఉండవు. ఆ సంగతి పూరన్ సింగ్‌కి ముందే తెలుసు.

అందుకే తను వెళ్ళదలచుకున్న ప్రదేశాన్నిగూగుల్ మ్యాప్స్‌లో మార్క్‌చేసి దాన్ని చేరవలసిన మార్గాన్ని సేవ్‌చేసి పెట్టుకున్నాడు. ఒంటెమీద కూర్చున్న పూరన్ సింగ్ మొబైల్ చూస్తూ ఎటువెళ్ళాలో చెప్తుంటే ఒంటెను అటు నడుపుతున్నాడు దాని యజమాని.

"సహజంగా టూరిస్టులకు ఈ ఎడారిలో ఎక్కడ ఏమున్నాయో మేము చెప్తాం. మీరేంటి సార్ మా ఊర్లో నాకు తెలియని చోటుకు తీసుకు వెళ్తున్నారు?" అన్నాడు ఒంటె యజమాని.

> వామపక్షాలు భారతదేశానికి సరికాదు... కాంగ్రెస్ కూడా సరైన ప్రత్యామ్నాయం కాదు.
> -అమిత్‌షా, బి.జె.పి. అధ్యక్షుడు



సమాధానం చెప్పలేదు పూరన్‌సింగ్. అతని మూడ్ గ్రహించినట్లు ఆ తరువాత మరి మాట్లాడ లేదు ఒంటె యజమాని. ఎట్టకేలకు తను చేరవల సిన ప్రదేశం చేరి ఒంటె దిగాడు పూరన్‌సింగ్.

అది ఎడారేకానీ, పూర్తిగా ఇసుక దిబ్బలతో నిండి లేదు. అక్కడక్కడా ముళ్ళచెట్లు, పిచ్చి తుప్పలు ఇసుకలో నుండి బయటకు వచ్చి కనిపిస్తున్నాయి. అసలుసిసలు ఎడారి కనిపించాలంటే ఇంకా దూరం వెళ్ళాలని అర్థం చేసుకున్నాడతను.

సరిగ్గా అతను వెతుకుతున్న ప్రదేశం ఒక ముళ్ళ చెట్టు కింద ఉంది.

ముందే అతను ఒంటెతో పాటు, ఇసుకను తవ్వటానికి అవసరమయిన పలుగు, పారలాంటి పరిక రాలనుకూడా ఊర్లోసంపాదించి ఒంటెమీదకిచేర్చాడు. ఇప్పుడు వాటిని దించి కిందపెట్టి, "నువ్వు వెళ్ళి రెండు గంటల తరువాత తిరిగి రా..." అన్నాడు ఒంటె యజమానితో.

"నా డబ్బులు?" ప్రశ్నించాడతను.

"ఇప్పుడే డబ్బు నీకు ఇస్తే తిరిగి వస్తావని గ్యారంటీ ఏముంది? నన్ను తిరిగి ఊరుచేర్చిన తరువాత ఒప్పుకున్న మొత్తం ఇస్తాను. ఇంకా ఎక్కువే ఇస్తాను"

ఒంటె యజమాని మారు మాట్లాడకుండా వెనక్కి వెళ్ళిపోయాడు. అతను పూర్తిగా కనుమరుగయ్యాక తనుగుర్తించిన ప్రదేశంలో ఉన్న ముళ్ళపొదను తొల గించి అక్కడ తవ్వటం మొదలుపెట్టాడు అతను.

ఇసుక కాబట్టి ఎక్కువ కష్టపడకుండానే తవ్వగలుగుతున్నాడు. మొత్తం అరగంట పట్టింది అడుగున దాచినవస్తువునుగుర్తించటానికి. అక్కడ ఒక కాన్వాస్ బ్యాగు ఉంది. చాలా బరువుగా ఉంది అది.

బరువుగా ఉన్న ఆ బ్యాగులో ఏమున్నాయో అన్న కుతూహలంతో అక్కడికక్కడే దాన్ని తెరచి చూశాడతను. అది ఒక స్టీల్ ట్యూబ్. అదొక్కటే దాదాపు ఇరవై కిలోల బరువు ఉంది. అది కాక చిన్నచిన్న

కొత్త సీరియల్ ప్రారంభం

స్టీల్ పరికరాలు కొన్ని ఆ బ్యాగులో ఉన్నాయి. అవి ఎందుకు ఉపయోగపడతాయో, వాటి కోసం అంత జాగ్రత్త తీసుకోవలసిన అవసరం ఏమిటో అతనికి అర్థం కాలేదు.

అయినా అది తెలుసుకోవటం తన పని కాదు కాబట్టి, తిరిగి గుంతనుపూడ్చి, ఆ వస్తువులు ఉన్న కాన్వాస్‌బ్యాగును తీసుకుని ఒంటి యజమాని కోసం ఎదురు చూడసాగాడు.

ఢిల్లీలో అదొక అపార్ట్‌మెంట్ భవనం. దానిపై అంతస్తు పెంట్‌హౌస్‌లో ఉంటాడు వినోద్ నాయక్. గత రెండేళ్ళుగా అతను అక్కడేఉంటున్నాడు. ప్రతిరోజూ చేసినట్లే రాజ్‌పథ్ రోడ్‌లో జాగింగ్ ముగించుకుని వెనక్కి వస్తున్నాడతను.

"ఏమోయ్ వినోద్! చాలా రోజులయింది కనిపించి, ఏమన్నా టూరు వెళ్ళావా ఏమిటి?" అడిగాడు అదే బిల్డింగ్‌లో ఉంటున్న ఒక పెద్దాయన.

ఆయన సెంట్రల్ గవర్నమెంట్ ఉద్యోగం చేసి రెండేళ్ళక్రితం రిటైర్ అయ్యాడు. ప్రస్తుతం ఆ అపార్ట్‌మెంట్ వెల్‌ఫేర్ సొసైటీకి అతను సెక్రటరీ.

అందుకని అందరి మంచిచెడ్డలు తనబాధ్యతే అనుకుంటాడు.

"అవున్సార్! ఆఫీసు పని మీద బయటకు వెళ్ళొచ్చాను"

"భోజనం అదీ ఎలా చేస్తావ్? హోటల్ భోజనమా? స్వయం పాకమా?"

"హోటల్ భోజనమే..." "త్వరగా పెళ్ళి చేసుకోవోయ్... ఈ బాధలు ఉండవు"

"అలాగే సార్" మొహమాటంగా అన్నాడు వినోద్ నాయక్.

"ఎవరినన్నా ప్రేమించావా? పెద్దలు చెప్పిన సంబంధమే చేసుకుంటావా?"

"నేనెవరినీ ప్రేమించలేదు సార్"

"మా చుట్టాలలో ఒకమ్మాయి ఉందోయ్. నీకు సూట్ అవుతుంది. మీ పెద్దవాళ్ళతో మాట్లాడమంటావా?"

"తరువాత చెప్తాను..." ఫోన్ మోగినట్లు నటించి అది మాట్లాడటానికి అన్నట్లు దూరంగా వెళ్తూ అన్నాడు వినోద్ నాయక్.

"ఈ ఫోనొకటి. నేను మాట్లాడుతున్నపుడే వస్తుంది..." అనుకుంటూ ఇంటికి వెళ్ళిపోయాడు పెద్దాయన.

సెక్యూరిటీ ఆఫీస్ దగ్గర ఆగిన వినోద్ నాయక్, "ఈ సాయంత్రం నా స్నేహితులు అయిదుగురు వస్తున్నారు. వారిని నా పెంట్ హౌస్‌కి పంపండి.

అందరం కలిసి తెల్లవారుజామున బయలుదేరి టూర్ వెళ్తున్నాం..." అని చెప్పాడు. ఆ విషయం సెక్యూరిటీ వారు నోట్ చేసుకున్నారు.



వినోద్ నాయక్ చెప్పినట్లే సాయంత్రం అయిదుగురు మనుషులు అక్కడకు వచ్చారు. అయితే వారు అతని స్నేహితులు కాదు. కొచ్చిన్ నుండి నారాయణ కుట్టి, నాగాలాండ్ నుండి లిమ్సెన్, మధుర నుండి పూరన్‌సింగ్, హైదరాబాద్ నుండి వెంకటేష్, కలకత్తా నుండి సుమిత్ బోస్ వరుసగా ఒకరి తరువాత ఒకరు అక్కడకు చేరుకున్నారు.

మిగిలిన వారిలానే వెంకటేష్, సుమిత్ బోస్ కూడా ఆదివారం పేపర్లో సందేశం అందుకున్న ఆరుగురిలో ఉన్నారు. అందరిలా వారుకూడా తమకు అందిన ఆదేశాల ప్రకారం తమకు చెప్పిన ప్రదేశాలకు వెళ్ళి అక్కడ ఉన్న సామాను ఇక్కడకు తీసుకు వచ్చారు. నిజానికి వచ్చిన వారెవరో, వారి పేర్లు ఏమిటో కూడా వినోద్ నాయక్‌కి తెలియదు.

ఆదివారం పేపర్లో సందేశం అందుకున్న ఆఖరివాడు వినోద్ నాయక్. మిగిలిన వారికి అందినట్లే అతనికి కూడా తరువాత చేయవలసిన పనుల షెడ్యూల్ అందింది.

షెడ్యూల్ ప్రకారం ఆ సాయంత్రం అయిదుగురు అక్కడకు రావాలి. అలానే వారు వచ్చారు. వారెవరూ అప్పటివరకూ ఒకరికి ఒకరు తెలియదు. అక్కడే ఒకరినొకరు చూసుకున్నారు.

వారందరికీ ముందుగా కొన్ని సూచనలు చేశాడు వినోద్ నాయక్. "మనం ఇప్పటివరకు ఎలా ఒకరికొకరం తెలియమో, ఇక ముందు కూడా అలానే ఉంటే నయం. ఈ రోజు తరువాత మళ్ళీ మనం ఒకరినొకరం కలవకపోవచ్చు.

కాబట్టి ఎవరూ ఎవరినీ పేరుపెట్టి పిలుచుకోవద్దు. పేర్లు, వ్యక్తిగత వివరాలు ఒకరివి ఒకరు తెలుసుకోవటం వలన ఉపయోగంకంటే ప్రమాదం ఎదురయ్యే ఆస్కారం ఎక్కువ. కాబట్టి మనం మెయింటెన్ చేసే సీక్రెసీ మన భద్రతకే ఉపయోగపడుతుంది" అన్న అతని మాటల్లోని నిజాన్ని అందరూ అంగీకరించారు.

భోజనాలు అయ్యాక అందరూ పెంట్‌హౌస్ హాలులో సమావేశమయ్యారు.

"మీరు తెచ్చిన సామానంతా ఇటు ఇవ్వండి..." అన్నాడు వినోద్ నాయక్.

వరుసగా అందరూ తాముతెచ్చినసామాను అతనికి ఇచ్చారు. జాగ్రత్తగా చేసిన ప్యాకింగులు విప్పి అందులో ఉన్న సామాను విడిగా పెడుతున్నాడు వినోద్ నాయక్.

వంట చేసే మాస్టర్ అవసరమయిన సామానంతా వచ్చిందో లేదో చూసుకున్నట్లు, ఒకటొకటిగా వచ్చిన వస్తువులను సరిచూసుకుని హాలు మధ్యలో ఖాళీచేసిన డైనింగ్ టేబుల్ మీద పెడుతున్నాడు. "పావుకిలో ప్లాస్టిక్ ఎక్స్‌ప్లోజివ్..." ఒక ముద్దలాంటి పదార్థాన్ని టేబుల్ మీద పెడుతూ అన్నాడు వినోద్ నాయక్.

"ఇది లిథియమ్ డిస్క్" రెండంగుళాల లోహపు బిళ్ళను చూపిస్తూ చెప్పాడు.

అలానే మరో లోహపు డిస్క్ బయటకు తీసి, "ఇది పోలోనియమ్ డిస్క్" అని చెప్పాడు.



ఇంకా ఉంది



Let us not mistake activity for productivity



# Sri Lanka

Sri Lanka is shaped like a tear drop at the tip of India. Some people call Sri Lanka the "Pearl of the Orient"



## Sigiriya

Sigiriya palace was built 1500 years ago. Now only bits of it are left. Can you see the lion's paws? This palace was built to look like a lion!



## dagoba

A dagoba is a Sri Lankan Buddhist shrine. The oldest dagoba was built over 2000 years ago



## elephant orphanage

Would you like to try feeding the baby elephants in the elephant orphanage? The orphanage protects baby elephants who have lost their parents to hunters.



## hoppers

Hoppers are special Sri Lankan pancakes that are soft in the middle and crispy around the sides. Mmm... delicious!



## vannama dancers

Vannama dancers copy the way animals move in their dances. These dancers are pretending to be peacocks!



## Ceylon tea

Have a cup of Ceylon tea. Sri Lanka was once known as Ceylon, so tea from Sri Lanka is called Ceylon tea.



## mask carving

Mask carving is an important art in Sri Lanka. People put up scary masks outside their new houses while the houses are being built, so that evil spirits will not enter.

## jewels

Ratnapura is the city of jewels there are pretty blue, red and yellow precious stones hidden deep in the ground!



## Temple of the Tooth

Buddhists believe that the Temple of the Tooth has one of Buddha's teeth! People once thought that whoever owned the tooth could be king.

Marshall Cavendish Education

# సెక్స్ AND సైకాలజీ

Women want and need strong emotional experiences in bed



డా॥జి. సమరం



సి.ఎస్. కర్నూలు

***ఇటీవలనే మాకు పెళ్లి అయింది. నాకూ, మా ఆవిడకి సెక్స్ అంటే మహాఇంట్రస్టుగా ఉంది. రోజుకి 5-6సార్లు సెక్స్‌లో పాల్గొంటున్నాము. చాలామంది 1-2సార్లే పాల్గొంటారట. వాళ్ళతో పోలిస్తే మేం సెక్స్‌లో పాల్గొనడమనేది అతి అనిపించింది.***

***అతిగా సెక్స్‌లో పాల్గొంటే నరాలు బలహీనత వస్తుందా? త్వరలోనే సెక్స్‌కి పనికిరాకుండాపోతానా? సెక్స్‌లో 'అతి' అని దేనిని అంటారు?***

రతిలో అతి అనేది లేదు. ఎవరి ఇంట్రస్ట్‌నిబట్టి వాళ్ళు,ఎవరి స్టామినాబట్టి వాళ్ళు రోజులో ఎన్నిసార్లైనా రతిలో పాల్గొనవచ్చు. రోజులో అనేకసార్లు సెక్స్‌లో పాల్గొన్నప్పటికీ నరాలు దెబ్బతినడం, నరాల బలహీనత రావడం ఉండదు. సెక్స్ బలహీనత రానే రాదు. మీరు ఎటువంటి జంకు, భయం లేకుండా సెక్స్‌లో పాల్గొనండి. సెక్స్‌ని ఎంజాయ్ చేయండి.

హెచ్.ఎస్. శ్రీకాకుళం

***పగటిపూట రతిలో పాల్గొనడం అనారోగ్యమా?***

రతిలో పాల్గొడానికి పగలు,రాత్రి అనే తేడా లేదు. ఎవరి వీలునిబట్టి వాళ్ళు ఎప్పుడైనా పాల్గొనవచ్చు. పగటిపూట రతిలో పాల్గొంటే దంపతులకి అనారోగ్యం కలగడం అనేది కేవలం అపోహమాత్రమే. సంతానం కూడా ఆరోగ్యంగానే ఉంటుంది.

ఆర్.ఆర్. యలమంచిలి

***మా అబ్బాయికి 18 సంవత్సరాలు. ఎంత తిండి పెట్టినా వాడు బలహీనంగానే కనపడతాడు.మా అనుమానమేమిటంటే వాడికి మూత్రంలో వీర్యం పోతోందని. మూత్రంలో వీర్యం పోతూంటే తెల్సుకోవడం ఎలా? వీర్యం పోకుండా ఆపడం ఎలా?***

మూత్రంలో వీర్యం పోవడంవల్ల ఎవరూ బలహీనంగా మారరు. వీర్యం ఏమాత్రం బలవర్ధకమైనది కాదు. ఎంత వీర్యం పోయినప్పటికీ ఏమీ అవదు. అందుకని మూత్రంలో వీర్యం పోతోందా! లేదా! అనేది తెలుసుకోనవసరంలేదు. నిరంతరం శరీరంలో వీర్యం తయారవుతూనేవుంటుంది.

అలా తయారైన వీర్యం హస్తప్రయోగం ద్వారానో, స్వప్నస్ఖలనాల రూపంలోనో, మరొక సమయంలోనో బయటకు పోతుంది. దానిగురించి పట్టించుకోనవసరం లేదు. ఎంత పెట్టినా మీవాడు బలహీనంగా ఉంటున్నాడంటే అది ఆ వయస్సు లక్షణం.

టీనేజ్‌లో ఎముకల ఎదుగుదల, కండరాల వృద్ధి, శరీరంలో గ్రంథులు ఎంతగానో ఎదగడం ఉంటుంది. ఇటువంటప్పుడు ఎక్కువ ఆహారం చాలా అవసరం. సాధారణంగా టీనేజ్ పూర్తి అయిన తర్వాత శరీరం ఎదుగుదల స్పీడ్ కూడా తగ్గుతుంది.

ఇక ఆటుపైన ఒళ్ళు చేయడం కనపడుతుంది. తిన్న తిండి వంటపట్టినట్లు అవుతుంది. అందుకని మీ అబ్బాయిగురించి మూత్రంలో వీర్యం పోతోందని, లేనిపోని అనుమానాలు పెట్టుకోకండి.

ఆర్.ఎల్.ఆర్. హైదరాబాద్

***నా వయస్సు 65 సంవత్సరాలు. ఈ వయస్సులో కూడా హస్తప్రయోగం చేస్తుంటాను. ఈ అలవాటు మానలేకున్నాను. ఈ మధ్య ఒకాయన ఒకే వ్యాసంలో వృద్ధాప్యంలో హస్తప్రయోగం చేసినట్లయితే మరణం సంభవిస్తుందని రాశాడు. అది చదివినదగ్గరనుండి భయం పట్టుకుంది. వృద్ధాప్యంలో హస్తప్రయోగం నిజంగానే మరణానికి దారితీస్తుందా? ఈ అలవాటు మానలేకుండా ఉన్నాను. హస్తప్రయోగం అలవాటు మానడానికి ఏమైనా మందులు ఉన్నాయా? నాకు చాలా ఆందోళనగా ఉంది. నన్ను రక్షించండి.***

హస్తప్రయోగం అలవాటు చిన్నవయస్సులో ఉన్నా, వృద్ధాప్యంలో ఉన్నా ఎటువంటి హాని కలగదు. హస్తప్రయోగంవల్ల ఎటువంటి ప్రమాదం లేదు.

వృద్ధాప్యం వచ్చినవారు హస్తప్రయోగం చేసినట్లైతే వారికి త్వరగా మరణం సంభవిస్తుందని ఎవరయినా రాసివున్నట్లైతే వారికి వైద్యవిజ్ఞానం గురించి ఏమీ

## పోయేది ఒకటి... సందేహం మరొకటి

మగువల జీవితాల్లో వయసుతోపాటు మార్పులొస్తాయి. అది హార్మోన్ల మహిమ. ఒక వయసు రాగానే 'రజస్వల' అవుతారు. ఆ మార్పుకు అలవాటుపడ్డుండగానే 'తల్లి' అవుతారు. ఈ రెండు దశలు ఎంత సహజమో ఆ తర్వాత వచ్చే బహిష్టులు ఉడిగిపోవటం కూడా అంతే సహజం.

అయితే మెనూపాజ్ అనే ఆ దశను అంత సులభంగా అంగీకరించలేరు, అర్థంచేసుకోరు. దానితో పలురకాలుగా మానసిక సమస్యలను కొనితెచ్చుకుంటారు. మెనూపాజ్‌కి చేరగానే జీవితం అయిపోయిందనుకునేవారు అధికంగా ఉన్నారు.

ప్రకృతి తమకు అన్యాయం చేసిందనుకుంటారు. ప్రకృతిమాత 'పురుష పక్షపాతి' అని నిందిస్తారు. వారికి 70-80 ఏళ్ళవరకు అనుభవించేందుకు ఇచ్చిన సెక్స్ శక్తిని తమనుండి 45 ఏళ్ళకే లాగేసుకుందనుకుంటారు. కాని అదంతా పలురకాల ప్రయోగాల తర్వాత పరిణామ క్రమంగా వచ్చిన మార్పు అనిగాని, నిర్దేశించిన గమ్యం అనిగాని తెలుసుకోరు. పైగా మెనూపాజ్‌ని తప్పుగా అర్థంచేసుకుని ఇక తాము సెక్స్‌కి పనికి రాకుండా పోయామనుకుంటారు.

మెనూపాజ్‌ని ఎవరైతే సరిగ్గా అర్థంచేసుకుంటారో, ఎవరైతే ఆ మార్పును అంగీకరిస్తారో వారు జీవితంలో సెక్స్ ఆనందం కొనసాగించగలుగుతారు. జీవితంలో ఏదో ఒక వయసులో తప్పని మార్పు అది. ఆ సమయంలో వచ్చే హార్మోన్ల మార్పుకు సిద్ధమవ్వాలి.

సెక్స్‌పరంగా వచ్చే ఇబ్బందులను అధిగమించే యత్నం చెయ్యాలి. మెనూపాజ్‌కి చేరేసరికి ఈస్ట్రోజన్ అనే హార్మోన్ తగ్గుతుంది. సెక్స్ కోర్కెలు కలిగించే హార్మోన్‌లు 'టెస్టోస్టిరోన్', 'ఈస్ట్రోజెన్'లు.

ఈ హార్మోన్‌లు తగ్గినందున యోనిలో ద్రవాలు ఊరటం తగ్గుతుంది. యోని భాగం ఎండిపోయి నట్టవుతుంది. ఈ దశలో అంగప్రవేశం బాధాకరంగా ఉంటుంది. అంతేకాని పూర్తిగా సెక్స్‌కి పనికిరాకుండా పోవటం అనేది జరగదు. మెనూపాజ్‌తో పొయ్యేది సంతానం పొందగలిగిన శక్తిమాత్రమే.

సెక్స్ కోర్కెలు తగ్గుతాయేమోకాని ఆగిపోవు. శారీరక ఆరోగ్యం, మానసిక ఆరోగ్యం సక్రమంగా వున్న మహిళలకు మెనూపాజ్ అసలు సమస్యే కాదు. 45 ఏళ్ళ వయసులో వచ్చే కుటుంబ సమస్యలు, ఇతర అనారోగ్యాలవల్ల సెక్స్ కోర్కెలు తగ్గుతాయి కాని అది మెనూపాజ్‌వల్లమాత్రమే వచ్చే ఇబ్బందికాదు.

మెనూపాజ్ మహిళతో సెక్స్‌లో పాల్గొనే మగవారు తమ పద్ధతి మార్చుకోవాలి. గతంలో వున్న తీరునే ఆమెలో స్పందనలు వుండవని అర్థంచేసుకోవాలి.

ఆమెతో సెక్స్ ఆనందంకోసం ఎక్కువ సమయం ఫోర్‌ప్లేలో పెట్టాలి. మాటలతో ఆమెను మైమరిపించాలి. మెనూపాజ్‌తో ఆమెలో వస్తున్న మార్పులు తమ అనుబంధానికి అడ్డంకి కాబోవన్న భరోసా ఆమెకు ఇవ్వాలి. అదే సమయంలో కృత్రిమంగా ఆమె యోనిలో తేమ పెంచే పనిచేయాలి.

ల్యూబ్రికేటింగ్ జెల్‌ని, తైలాలను ఉపయోగించటం ఆమెకు నేర్పాలి. అందులో తప్పులేదని ఆమెను ఒప్పించగలగటం అవసరం. మహిళలు కూడా మెనూపాజ్ సమయాన్ని అర్థంచేసుకుని అందులోనుండి బయటపడే ఆలోచన చెయ్యాలి. అందుకోసం ఆహారంలో సోయాబీన్, పెసలు, ఆకుకూరలు పెంచాలి.

పడుకునే ముందు రెండు స్పూన్ల మెంతులను తీసుకోగలిగినా బాగుంటుంది. నానవేసి లేదా పొడిగా తీసుకోగలరు. అలంకరణమీద శ్రద్ధ పెంచుకుంటే మార్పులు వాటంతట అవే వస్తాయి. ◆


Courtesy: THE MAN



తెలియదని అనుకోవాలి. చిన్నవయస్సులోనయినా, వృద్ధాప్యంలోనైనా హస్తప్రయోగం ఏ విధంగానూ తప్పుకాదని, హానికరంకాదని ఆధునిక వైద్యవిజ్ఞానం నిగ్గుతేల్చి చెప్పిన సత్యం. అయినా ఇంకా కొంతమంది హస్తప్రయోగం తప్పు అనుకోవడం వారి అజ్ఞానానికి చిహ్నం. మీకేమీ అవదు. నిర్భయంగా ఉండండి.

ఈ అలవాటు మానుకోవడానికి ఎటువంటి మందులు వాడనవసరంలేదు.

పి.ఎస్. పామర్రు

*నా వయస్సు 24 సంవత్సరాలు. ఆరునెలలక్రితం మా ఇంట్లో ఒక పెళ్ళి ఉంటే బహిష్టులు వాయిదా వేయడంకోసమని మందుబిళ్ళలు వాడాను. కేవలం పన్నెండు బిళ్ళలే వాడాను. అప్పుడు ఏమీ అనిపించ లేదు.ఆ తర్వాత చక్కగా బహిష్టులు నాకు కావలసి నన్ని రోజులు రాకుండా ఆగాయి.*

*గత రెండు నెలలుగా నాకు బహిష్టులలో అస్తవ్య స్తత ఏర్పడింది. నేను అప్పుడు బహిష్టులు వాయిదా పడటానికి వాడిన మందుల ఫలితమేనా ఇది? నాకు ఏమైనా అవుతుందా? నాకు భయంగా ఉంది.*

ఏ స్త్రీ అయినా బహిష్టులని వాయిదా వేయడానికి ఎప్పుడో ఒకసారి మందులు వాడవచ్చు. ఏమీ అవదు. మీ విషయంలో బహిష్టుల అస్తవ్యస్తత కలగడానికి మీరు వాడిన మందుల ఫలితం కాదు.

మీలో హార్మోన్ల తేడా వచ్చివుండవచ్చు. డాక్టర్‌కి చూపించుకుని అవసరమయిన చికిత్స పొందండి. భయపడవలసిన అవసరం లేదు.

పి.సి.ఎన్. భీమవరం

*ఎమర్జెన్సీ కాంట్రాసెప్టివ్ పిల్ అంటే ఏమిటి?*

ఎమర్జెన్సీ కాంట్రాసెప్టివ్ పిల్‌నే అత్యవసర గర్భ స్రావ మాత్ర అంటారు.

ఎటువంటి రక్షణ లేకుండా సెక్స్‌లో పాల్గొన్నప్పుడు గర్భం వస్తుందనే అనుమానం ఉన్నప్పుడు గర్భం రాకుండా నివారించేందుకు వాడే మాత్రని 'ఎమర్జెన్సీ కాంట్రాసెప్టివ్ పిల్' అంటారు.

ఈ మాత్రకి సంబంధించిన మందుని 'లివోనార్జెస్ట్రెల్' అంటారు. లివోనార్జెస్ట్రెల్ మాత్రని సెక్స్‌లో పాల్గొన్న 72 గంటలులోగా ఒకటి వేసుకోవాలి. ఆ తర్వాత 12 గంటలకి మరో బిళ్ళ వేసుకోవాలి.

ఈ రకంగా ఈ బిళ్ళల మోతాదు కేవలం రెండు బిళ్ళలే.సెక్స్‌లో పాల్గొని గర్భం రాకూడదని అనుకున్న ప్పుడు ఎంత త్వరగా ఈ బిళ్ళ వేసుకోవడం జరుగు తుందో అంత ఎక్కువ ప్రయోజనం ఉంటుంది.

సెక్స్‌లో పాల్గొన్న కొద్ది గంటలలోనే ఈ బిళ్ళ వేసుకోవడం ప్రారంభించినట్లయితే దాదాపు 98-100 శాతం ఫలితం ఉంటుంది. కనీసం 24 గంటలు లోగా ఈ బిళ్ళ వేసుకోవడం జరిగితే 95 శాతం ఫలితం ఉంటుంది. 48 నుండి 72 గంటలులోగా 60 శాతం ఫలితం ఉంటుంది. అందుకని వీలైనంత త్వరగా ఈ బిళ్ళలు వేసుకోవాలి.



డా॥ జి. సమరం వాసవ్య నర్సింగ్‌హోమ్ బెంజిసర్కిల్ విజయవాడ 520 010 ఫోన్ 0866-2472370 E-mail drsamaram@hotmail.com www.gsamaram.com



సీరియల్

# మనిషిలో మనిషి

ఎందుకంటే ముఖ్యమైన విషయాలు ఆ తర్వాతే ఉన్నాయి. అవి చూస్తే ఆయన చిత్తభ్రమతో ఆ క్లాజ్‌లు తగిలించాడో, బుద్ధితో వ్రాయించాడో అర్థంకాదు. ఆ వీలునామా సారాంశం ఇది.

**పర్లాకిమిడి సంస్థానాధీశుడను, రాజా రామచంద్ర గజపతి మహదేవ్ అను నేను పరిపూర్ణ ఆరోగ్యంతోనూ, స్థిరమగు బుద్ధితోనూ ఎలాంటి ఒత్తిళ్ళకు తలొగ్గకుండా వ్రాయిస్తున్న సంస్థాన వీలునామా. ఇది నా మరణశాసనం.**

మా రాజ వంశపారంపర్యంగా వారశీకంగా నాకు సంక్రమించిన ఈ పర్లాకిమిడి సంస్థానం, కోట, ప్యాలెస్, లక్షల ఎకరాల భూములు, భవనాలు, మణిమాణిక్య కనకాభరణాలు, వేలకోట్ల సంపద అన్నిటికీ నా తదనంతర వారసులను ఇందుమూలంగా తెలియజేస్తున్నాను.

మా కుమారుడగు రాజా విష్ణుచంద్ర గజపతిదేవ్ అయోగ్యుడు, అవిధేయుడు, ధూర్తుడు, దురలవాట్లకు లోనయి వ్యసనాలకు బానిసయి ఉన్నందున ఈ సంస్థానం అతడి చేతిలో శిథిలంగాకూడదనే సదాశయంతో అతన్ని మా వారసునిగా తప్పించి పక్కన పెడుతున్నాను. అతని కుమార్తె నా మనుమరాలు రెండేళ్ళ మైనరు బాలిక అయిన రాకుమారి చిరంజీవి మేఘనా సౌందర్యానంద సహానాదేవిని, నా తదనంతర వారసురాలిగా ప్రకటిస్తున్నాను.

నా కుమారుడు విష్ణుచంద్ర గజపతి మహదేవ్ నా వారసురాలికి తండ్రిగాను, ఆమెకు గార్డియన్‌గాను నియమిస్తున్నాను. కాబట్టి అతను ఆమెకు గార్డియన్‌మాత్రమే.

అతను ఆస్తిని అనుభవింపవచ్చుగాని చర స్థిరాస్తుల్లో వేటినీ అమ్ముకునే అధికారం అతనికి లేదు. నా వారసురాలైన నా మనుమరాలు మేఘనాసౌందర్యానంద సహానాదేవికి మైనారిటీ తీరగానే సంస్థానాన్ని, ఆస్తులను యథాతథంగా ఆమెకు అప్పగించాల్సిన బాధ్యత విష్ణుచంద్ర గజపతి మహదేవ్‌ది.

E-mail: Suryadevaranovelist@gmail.com

## సూర్యదేవర రామ్మోహనరావు

### జరిగిన కథ (18)

రాజావారి తండ్రిగారు రాయించిన వీలునామా విషయం కూడా ప్రస్తావిస్తాడు.

తన జన్మరహస్యం తెలిసిన విషయం కూడా కార్తికేయ రాజావారికి చెపుతాడు.

జైలు సెల్లో కార్తికేయకు మర్మయోగి తారసపడతాడు. కార్తికేయ గురించి జరిగింది జరిగినట్లు చెప్పేసరికి అతను సంభ్రమాశ్చర్యాలకు లోనవుతాడు. సాదూభాయ్ తనమనుషులతో పర్లాకిమిడి చేరుకుంటాడు.

కార్తికేయను అంతం చేయడానికి కిట్టప్పనాయుడితో సమావేశమవుతాడు. తెల్లవారుఝామున మర్మయోగి కార్తికేయను లేపుతాడు. అప్పటికే మర్మయోగి తన శక్తితో అక్కడ ఉన్న కానిస్టేబుల్స్ అందర్నీ స్పృహపోయేలా చేస్తాడు. మర్మయోగితో ఓ జీప్‌లో పర్లాకిమిడినుంచి పారిపోతాడు కార్తికేయ.

సాధూభాయ్, కిట్టప్పనాయుడు తమ మనుషులతో కార్తికేయను ఛేజ్ చేయడం మొదలుపెడతారు. సంస్థానం లాయర్ హరినారాయణ రాజాగారిని కలుస్తాడు.

నీ తండ్రిగారు నీమీద ఉన్న ద్వేషంతో ఓ విల్లు రాశాడంటూ అందులోని విషయాన్ని తనవద్ద ఉన్న మరో నకలు కాపీ తీసి ఇస్తాడు హరినారాయణ. ఆ విల్లు చదివి నిర్ఘాంత పోతారు రాజావారు.

ఇక తర్వాత జరిగేది చదవండి.





ఇందులో పొరబాటు జరిగితే అతను శిక్షార్హుడు కాగలడు. యువరాణి మేఘనా సౌందర్యానంద సహానాదేవికి పాతికేళ్ళ వయస్సు దాటకుండా రాజ వంశానికి చెందిన తగిన వరునితో వివాహం జరిపించాలి. అప్పుడు ఆమెతోబాటు ఆమె భర్తకూ సంస్థానంమీద సమాన హక్కులు ఉంటాయి.

ఇంతవరకు వీలునామాలో చెప్పిన అంశాలు ఒక విధంగా ఉన్నాయి. ఇక మెలికతో కూడిన అసలు పాయింట్లు ఆ తర్వాత ఉన్నాయి.

ఆ విధంగా అనగా పైన చెప్పినట్టు పాతికేళ్ళలోపు మేఘనా సౌందర్యానంద సహానాదేవికి వివాహం జరిగినట్లయితే అప్పుడు మా పర్లాకిమిడి సంస్థానానికి చెందిన స్థిరాస్థులు, సంపదలో తొంభైశాతం ఆమెకు చెందుతుంది. ఇక మిగిలిన పదిశాతం శ్రీ కుమార శక్తిపీఠానికి చెందుతుంది.

సంస్థానం ఆస్తుల్ని, సంపదను తెలిపే డాక్యుమెంట్లన్నీ మా డాక్యుమెంట్లు భద్రపరిచే గదిలో భద్రంగా ఉన్నాయి.

ఒకవేళ ఏ కారణంచేతైనా పైన తెలిపిన ప్రకారం రాకుమారికి వివాహం జరగకున్నా, ముప్పై సంవత్సరాలలోపు, అవివాహితగానే ఆమె మరణించినా, అప్పుడు పర్లాకిమిడి సంస్థానం యావదాస్థిలో తొంభై శాతం శ్రీ కుమారశక్తిపీఠానికి చెందుతుంది.

మిగిలిన పదిశాతంమాత్రమే మా కుమారుడు, ఒంటరివాడయిన రాజా విష్ణుచంద్రగజపతి మహదేవ్‌కు చెందాలి. అది కూడా ఆ మూర్ఖుడు బ్రతకాలిగాబట్టి భిక్ష వేస్తున్నాను"

ఆ విధంగా వ్రాయబడిన వీలునామాలో చివరిగా, ఒరిజినల్ వీలునామా సుప్రీంకోర్టుకి, నకళ్ళలో ఒకటి హైకోర్టుకి, ఒకటి తపోవనం శ్రీ కుమారశక్తిపీఠానికి. ఒక ప్రతి లాయరు శంకరనారాయణ గుప్తావద్ద మరోటి ప్యాలెస్ డాక్యుమెంట్ల గదిలో భద్రపరుస్తున్నట్టు స్పష్టంగా చెప్పబడింది.

దిగువన రాజా రామచంద్ర గజపతి మహదేవ్ సంతకంతోబాటు పర్లాకిమిడి సంస్థానం మొహరీకూడ ముద్రించి ఉంది. సంక్షిప్తంగా మొత్తం వీలునామాలో వ్రాయించబడిన విషయం ఇదే.

ఆ వీలునామా సాంతం చదివిన రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్ షాక్‌నుంచి తేరుకోడానికి అయిదు నిమిషాలు పైనే సమయం పట్టింది. తమ రాజగురువు కృష్ణశాస్త్రి ఆదినుంచీ స్వామీ సత్యానందను ఎందుకు అనుమానిస్తూ వచ్చాడో ఇప్పుడర్థమవుతోంది.

తన తండ్రిగారు చేసిన నిర్వాకం తలచుకుంటే రాజావారి గుండెలు మండిపోతున్నాయి. ఆవేశంతో ఆయన గుప్పిళ్ళు బిగుసుకోవటం లాయరు హరి నారాయణ గమనించాడు.

"రాజ... కూల్‌డౌన్. అంతవరకూ వస్తే చక్రం తిప్పడానికి నేనున్నాగదా" అన్నాడు దరహాసంతో.

"అదికాదు హరి. ఏమిటీ దారుణం. నేనుధూర్తుడ్నా, వ్యసన పరుడ్నా, నాకు దురలవాట్లున్నాయా. నామీద ఇన్ని అభాండాలు వేసినందుకు ఆయన బ్రతికుంటే

## పాట కలిపింది

సరదాగా హోలి డాక్యుమెంటరీలో కలసి డ్యాన్సాడిన మెహరీన్, విజయ్ దేవరకొండలు ఇప్పుడు కలసి ఓ సినిమాలో నటిస్తున్నారు.

"హోలి సాంగ్ సెట్స్‌లోని విజయ్‌వి, నావి ఫోటోలను పూరికే నా అభిమానులకోసం షేర్‌చేశా. ఇద్దరూ కలసి సినిమా చేస్తున్నారా? అంటూ చాలామంది అడిగారు. తరువాత అదే జరిగింది. దర్శకుడు ఆనంద్ శంకర్‌కు మా హోలి పాట నచ్చింది.

ఇది తమిళ, తెలుగు ద్విభాషా చిత్రం. మేమింకా షూటింగ్ ఆరంభించలేదుకాబట్టి నా పాత్ర గురించి ఇప్పుడే నేనేమీ చెప్పలేను. విజయ్‌తో కలసి నటించబోవడం చాలా ఎగ్జయిటింగ్‌గా ఉంది" అంటూ మెహరీన్ మెరుపుల మోముతో చెప్పుకొచ్చింది.



కన్నతండ్రి అని కూడా చూడకుండా నేనే చంపేసేవాడ్ని" అన్నారు ఆవేశంగా రాజావారు.

"చూడు రాజా! మీ సంస్థానం మీ కుటుంబం. మీ మధ్య ఎన్నయినా ఉండొచ్చు. కాని మీ మధ్యలోకి కుమారశక్తి పీఠం ఎలా వచ్చింది? ఇక్కడ ఇదే ప్రధాన సమస్య. వారసులు లేనప్పుడు తమ ఆస్తుల్ని గుళ్ళు-గోపురాలకు రాసేయటం సహజవిషయం.

అలాంటి దేవుడి మాన్యాలను మింగేస్తున్నా ఎవరూ పట్టించుకోని రోజులు వచ్చాయనుకో.

ఎన్నో గుళ్ళకు చెందిన వందలు, వేలాది ఎకరాల భూములు అన్యాక్రాంతమైనా దేవాదాయ శాఖగాని, ప్రభుత్వాలుగాని ఆపలేకపోయాయి.

మీ తండ్రిగారు కుమారశక్తిపీఠానికి భూములు, భవనాలు దానంగా ఇచ్చుంటే వంకపెట్టాల్సిన పని లేదు. కాని ఇక్కడ విషయం అదికాదే.

తాంబూలం ఇచ్చేశాం తన్నుకుచావండి అన్నట్టుగా ఈ పర్లాకిమిడి సంస్థానానికి, రాకుమారి భవిష్యత్తుకు, నీకూ, కుమారశక్తిపీఠానికి కలిపి ఆయన పీటముడి వేసి పోయారు. ఎందుకు ఇలా చేశారంటే అది కేవలం నీమీది కోపంతోనే అనుకోవాలి.

ఒక్కటిమాత్రం నిజం రాజా. అమంగళం శాంతించుగాక. రేపు రాకుమారికి ఏదన్నా జరిగితే తమ తొంభై శాతం ఆస్తికోసం ఆ కుమారశక్తిపీఠం వాళ్ళు ఖచ్చితంగా కోర్టుకెళతారు. రాకుమారిని బ్రతికించుకోవటం ఇప్పుడు చాలా ముఖ్యం" అంటూ హెచ్చరించాడు లాయరు హరినారాయణ.

ఏదో ఆలోచిస్తూ కొంత తడవు మౌనంగా వుండిపోయారు, రాజా విష్ణుచంద్రగజపతి మహదేవ్.

"రాజా! ఏమిటాలోచిస్తున్నావ్?" అనడిగాడు హరినారాయణ గుప్తా.

"ఏం లేదు హరి, తమవద్ద గల ఈ వీలునామా ప్రతిని స్వామి సత్యానంద చదివుంటాడా అని చిన్న డౌటు. ఎందుకంటే కుమార శక్తిపీఠంతో మా రాజ కుటుంబానికి మూడుతరాల అనుబంధం వుంది.

పీఠం అభివృద్ధికి మా పూర్వీకులు ఎంతో ఇచ్చారు.

ఈ విల్లు రాసిన తేదీనిబట్టి చూస్తే అప్పట్లో స్వామి యోగానంద పీఠాధిపతిగా ఉండేవారు. అప్పటికే ఆయన వృద్ధుడు. ఆయన కాలం చేశాక ఆయన ప్రథమ శిష్యుడిగా యువకుడైన స్వామి సత్యానంద పీఠాధిపతిగా బాధ్యతలు చేపట్టాడు. పీఠాధిపతులంతా బ్రహ్మచారులే నీకు తెలీంది కాదు"

"రాజా ఇంతకీ నీ సందేహమేమిటి? వీలునామా సత్యానంద దృష్టికి వచ్చిందా లేదానేగదా? అనర్థాలకు కారణం అతను అవునో కాదో పక్కనపెడితే విల్లు మాత్రం ఆయన తప్పకుండా చదివే ఉంటాడు.

ఎందుకంటే స్వామి యోగానందకు ఇతడు ప్రథమ శిష్యుడు గదా. ఇతనికి తెలీకుండా వుండే ఛాన్సే లేదు. అయితే ఒక్కటి. నీవు చెప్పిందంతా విన్నాక ఖచ్చితంగా స్వామి సత్యానందను సందేహించాల్సివస్తోంది" అన్నాడు.

"ఓకే! ఎందుకొచ్చింది. తాడోపేడో తేల్చేస్తే పోలా. ఇప్పుడే ఫోన్‌చేసి అడిగేస్తాను" అంటూ ఫోన్ అందుకోబోతుంటే వెంటనే అడ్డుకున్నాడు లాయరు హరి నారాయణ గుప్తా.

"ఏమని ఫోన్ చేస్తావ్? తొందరపడకు రాజా. ఒక వేళ మనం ఊహించిందే నిజమయితే తనగురించి మనకు తెలిసిపోయిందని గ్రహించేస్తాడు. వాడు మరింత త్వరగా యువరాణికి ప్రాణాపాయం తెచ్చే ప్రమాదము ఉంది. ప్రస్తుతం ఏమీ తెలీనట్టే మౌనంగా ఉండటమే మంచిది" అంటూ హెచ్చరించాడు.

అదీ కరక్టే అనిపించింది.

ఫోన్‌చేసే ప్రయత్నం విరమించుకున్నారు రాజావారు.

"లాయరుగా నాకో విషయం చెప్పు హరి. కోర్టుకు వెళ్తే ఈ విల్లు చెల్లుబాటవుతుందా? ఈ సంస్థానం మా తండ్రిగారి స్వార్జితం కాదు.

అనువంశికంగా సంక్రమించింది. ఒక వ్యక్తి తన స్వార్జితమైన ఆస్తిని ఎవరికయినా ఇచ్చుకోవచ్చు. కాని తాతల ఆస్తికి మనవలు మనవరాళ్ళేగదా వారసులు. ఈ విల్లుమీద నా సంతకం లేకుండా ఎలా చెల్లుబాటవుతుంది?" సందేహాన్ని బయటపెట్టారు.

"అవుతుంది" అన్నాడు రిలాక్స్‌గా సీటుకి జేరబడుతూ లాయరు హరినారాయణ గుప్తా.

"కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో చెల్లుబాటయ్యే అవకాశం ఉంది. అందుకే విల్లులో నీమీద ఇన్ని అభాండాలు గుప్పించారు. నా కొడుకు అప్రయోజకుడు గాబట్టి సంస్థానాన్ని నా ఇష్టానికి ఇచ్చుకుంటాననే రీతిలో విల్లు రాయించటం జరిగింది. నీ సంతకానికి ప్రాధాన్యత ఎంతవరకో పరిశీలించాలి" అన్నాడు.

"కాని సంస్థానం చేజారిపోకూడదు హరి. ఇది నా కూతురి భవిష్యత్తుకోసమో, ఆస్తులమీది వ్యామోహంతోనో చెప్పటంలేదు. పర్లాకిమిడి సంస్థానంమీద ప్రజలకు మంచి అభిప్రాయం వుంది.

ఎన్నో చారిటబుల్ ట్రస్ట్‌లు అనాథాశ్రమాలు సంస్థానంమీద ఆధారపడివున్నాయి.

ఎందరో పేద విద్యార్థుల్ని చదివిస్తున్నాం. ఆపన్నులను ఆదుకొంటున్నాం. మా సంస్థానంతరపున ఎన్నో సేవా కార్యక్రమాలు జరుగుతున్నాయి. సంస్థానం చేజారితే ఇవన్నీ ఆగిపోతాయి"

"డోంట్‌వర్రీ రాజా. అంతవరకు వస్తే కుమారశక్తి పీఠం వాళ్ళని ముప్పుతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు తాగించడానికి సుప్రీంకోర్టు లాయర్ని నేనున్నా గదా. సంస్థానాన్ని చేజారనివ్వను. నన్ను నమ్ము.

ఆ పది పర్సెంట్ కూడా వాళ్ళకి దక్కనివ్వను. సరేనా. విల్లు గురించి మర్చిపో. ముందు యువరాణి ఈ గండం గడిచి బయటపడడం ముఖ్యం. కార్తికేయ విజయుడై తిరిగిరావాలని భగవంతుడిని వేడుకుందాం" అన్నాడు.

"కాని హరి..."

"ఏమిటి రాజా ఇంకా ఏమిటి నీ సందేహం?"

"ఇంతవరకు కుమారశక్తిపీఠంమీద చిన్న రిమార్క్ కూడా లేదు. మచ్చలేని పీఠాల్లో ఇదొకటి. అలాంటి పీఠాధిపతి అయివుండి కేవలం ధన దాహంతో ఇంత



మద్యపాన నిషేధం అమలు అసాధ్యం... ఆ నిషేధంవల్ల కొత్త మాఫియాలు పుట్టుకువస్తాయి. -కమల్‌హాసన్
ఎమ్.ఎన్.ఎమ్. నేత

కుట్రకు స్వామి సత్యానంద పాల్పడ్డాడంటే నమ్మలేక పోతున్నాను. ఇది నిజమేనా అనిపిస్తోంది"

"నిజం నిప్పులాంటిది రాజా. ఏదో ఒకరోజు ఏదో సందర్భంలో దాని ఉనికి బైటపడకపోదు. మఠాలు, పీఠాల వెనక జరిగిన స్కామ్‌లు, భాగోతాలు ఎన్ని బయటపడలేదు. దొరికితే దొంగ స్వామి లేదంటే దైవస్వామి. వాళ్ళంతా భక్తులచేత జేజేలు పలికించుకుని తర్వాత ఛీ ఛీ అనిపించుకున్నవారే.

మాటల గారడీతో జనాన్ని భక్తి అనే మత్తులోవుంచి తాము భోగాలు అనుభవించే స్వాములు ఎందరో ఉన్నారు" అంటూ వివరించాడు.

చాలాసేపు మాట్లాడాక లాయర్‌బృందం ప్యాలెస్ నుంచి తిరుగు ప్రయాణమైంది. కారు వరకు వచ్చి లాయరు హరినారాయణ గుప్తాని సాగనంపారు రాజా విష్ణుచంద్ర గజపతి మహదేవ్.

భళ్ళున తెల్లవారేసరికి సరిహద్దులు దాటి మధ్య ప్రదేశ్ భూభాగంలోకి దూసుకువచ్చేసింది కార్తికేయ నడుపుతున్న జీప్. అప్పటికింకా పక్కసీట్లో నిద్రపోతూనే ఉన్నాడు మర్మయోగి.

ఆకాశం మేఘావృతమైవుంది.

పొద్దు తెలీటం లేదు.

బాగా వెలుగు వచ్చేసింది.

అటవీ ప్రాంతం మీదుగా చల్లని గాలి వీస్తోంది. ఉదయపువేళయినా హైవేలో ట్రాఫిక్ అధికంగానే ఉంది. స్టేట్ మారింది కాబట్టి పోలీసు బెడద తొలగినట్టే. కార్తికేయ మనసుకాస్త నెమ్మదించింది.

మరికాస్త ముందుకు పోగానే ఎడంప్రక్క కొంత దూరంలో కొండవాగు ఒకటి కన్పించింది. జీప్‌ని స్లో చేసి అటు మళ్ళించాడు. పొదలు తిప్పలు విరగదీసుకుంటూ వాగు తీరాన్ని చేరుకుంది జీప్.

పొదల వెనక ఖాళీ జాగాలో జీప్ నిలిపాడు.

వాగులో నీరు స్వచ్ఛంగా అద్దంలా మెరుస్తోంది. రాత్రంతా నిద్రలేమి, ఎడతెగని ప్రయాణం బడలికతో చాలా అలసటగా వుంది. కాసేపు నిద్రపోయి లేచి స్నానం చేయాలనుంది.

జీప్ ఆగిన రెండో నిముషమే ఎవరో లేపినట్టు నిద్ర లేచాడు మర్మయోగి. ఓసారి పరిసరాలను గమనించి దరహాసం చేశాడు.

"సరైనచోట ఆపావు నాయనా. శుభం!"అన్నాడు.

"క్షమించండి స్వామీ... మిమ్మల్ని రూటు అడక్కుండా నాకు తోచిన దారిలో వచ్చేశాను. దారిలో అడుగుదామన్నా మీరు గాఢనిద్రలో ఉన్నారు" అని గుర్తుచేశాడు కార్తికేయ.

"లేదు నాయనా. నిద్రపోయింది నా శరీరమేగాని, నా మనసు కాదు. అది నీ మనసును ప్రేరేపిస్తూనే ఉంది. కాబట్టి నువ్వు రావలసిన మార్గంలోనే వచ్చావు. చింత వలదు" అన్నాడు మర్మయోగి.

"స్వామీ... మీరు చెప్పేది..."

"సామాన్యులకు అర్థంగాని అలౌకిక విషయం. వదిలేయ్. నేను కాలకృత్యాలు తీర్చుకుని స్నానంచేసి సంధ్యావార్చుకొని వచ్చి లేపుతాను. డస్సిగా ఉన్నావు. ఈ లోపల నువ్వు ఓ గంట నిద్రపో" తన మనసు గ్రహించినట్టు చెప్పి ఆయన జీప్ దిగుతూంటే మరోసారి సంభ్రమాశ్చర్యాలకు లోనయ్యాడు కార్తికేయ.

## స్ట్రిక్ట్ డైట్

'రేస్ 3'లో ఛాన్స్‌కొట్టేసిన జాక్వెలిన్ ఫెర్నాండెజ్ ఈ పాత్రకోసం కఠిన డైట్‌ను అనుసరిస్తున్నది. రోజంతా ఎక్కువ ద్రవపదార్థాలు తాగుతున్నది.

లంచ్‌లో పాలకూర, ఓ గుడ్డు, సగం అవకాడో- అంతే. సాయంత్రం ప్రొటీన్ షేక్, డిన్నర్‌లో సగం అవకాడో. ఇప్పటిదాకా గ్లామర్ రూపంలో కనపడిన జాక్వెలిన్ 'రేస్ 3' సినిమాలో యాక్షన్ సన్నివేశాలు చేస్తున్నది. గత నాలుగు నెలలుగా మిక్స్‌డ్ మార్షల్ ఆర్ట్స్ కూడా అభ్యసిస్తున్నది. దీనికోసం రోజుకు రెండుగంటల సమయాన్ని కేటాయిస్తున్నదట. పాత్రకోసం ఈమాత్రం పాట్లు తప్పవుకదా!



ఆయన అటు వెళ్ళగానే జీప్ డోర్ మూసి సీటు మీద వాలి పడుకున్నాడు. చల్లగాలికి వెంటనే నిద్ర పట్టేసింది. తర్వాత ఏం జరిగిందీ కార్తికేయుకు తెలీదు. తిరిగి మెలుకూ వచ్చేసరికి జీప్ టాప్‌మీద చిటపట రాలుతున్న వానచినుకుల శబ్దం విన్పించింది.

మర్మయోగి ఎటు వెళ్ళాడోగాని ఇంకా తిరిగి రాలేదు. వాన మొదలయితే వాగుపొంగే ప్రమాదం ఉంది. తెల్లవారి ఏమీ తీసుకోలేదు.

ఆకలి వేరే. ఆలోచిస్తూ జీప్ దిగాడు. వెళ్ళి కాలకృత్యాలు తీర్చుకున్నాడు. బ్రష్ చేసుకుని వాగు నీటితో ముఖం కడుక్కున్నాడు. టవల్ కట్టుకుని వాగు నీటిలో ఈతలు కొట్టి అలుపుతీరా స్నానం చేశాడు. పాడిదుస్తులు ధరించి విడిచిన దుస్తుల్ని ఉతికి పిండి జీపులో వెనక సీటుమీద ఆరేశాడు.

అప్పటికీ ఆ పెద్దాయన ఎక్కడున్నాడోగాని ఇంకా తిరిగి రాలేదు. ఆయన్ని వెదుకుతూ తీరం వెంట ముందుకెళ్ళాడు. ఒకచోట ఎదురైన దృశ్యం చూసి నిర్ఘాంతపోతూ అక్కడే ఆగిపోయాడు.

అక్కడ ఏనాటిదో పెద్ద రావివృక్షం ఉంది. ఆ చెట్టు పాదంవద్ద నేలకు అడుగు ఎత్తున గాల్లో నిలబడి వున్నాడు మర్మయోగి. ఒంటి కాలిమీద నిలబడి ముక్కు మూసుకొని హఠయోగంలో ధ్యానముద్రలో వున్నాడు. ఆయన ముఖమండలం వెనక అద్భుతమయిన తేజస్సు.

విచిత్రం ఏమంటే వానచినుకులు ఒక్కటి కూడా ఆయన ఒంటిని తాకటంలేదు. చేత్తో తొలగించినట్టు పక్కకు జారిపోతున్నాయి.

యోగులు, మహర్షులు సిద్ధుల గురించి వినడమేగాని వారి మహత్తు ఎలాంటిదో ప్రత్యక్షంగా ఇదే చూడటం. మనసు పులకిస్తుండగా మనసారా మనస్కరించి నిశ్శబ్దంగా వచ్చిన దారినే వెనుతిరిగి జీప్‌వద్దకు వచ్చేశాడు కార్తికేయ.

కాస్త వాన జోరు పెరుగుతోందనగా అర్ధగంట తర్వాత వచ్చి జీప్‌లో కూర్చున్నాడు మర్మయోగి.

"ధ్యానంలో కాస్త ఆలస్యమైంది. పద నాయనా వెళ్ళిపోదాం. అన్నట్టు అదృష్టవంతుడివి. నీ గురించి చెప్పగానే తనవద్దకు తీసుకురమ్మని గురుదేవుడు అనుమతించాడు. వీలయితే చీకటిపడకముందే గురుసన్నిధిలో ఉంటాం. పద" అన్నాడు.



రాజకీయ వ్యవస్థలో మార్పులు వచ్చినప్పుడే ప్రజలకు పాత్ర వుంటుంది, మేలు కలుగుతుంది.
-వరుణ్ గాంధీ, బి.జె.పి. ఎమ్.పి.

అలౌకిక విషయాలేమిటో ఇప్పుడిప్పుడే కార్తికేయకు అర్థమవుతున్నాయిగాబట్టి ఆశ్చర్యాల్ని తనలోనే దాచుకుని "కృతజ్ఞుడను స్వామీ"అంటూ వాన్ స్టార్ట్‌చేశాడు.

గురువుగారు ఎక్కడ ఉంటారు? సెల్‌ఫోన్ లేకుండా ఆయనతో ఎలా సంభాషించారు...? అనుమతి ఎలా తీసుకున్నారు లాంటి సందేహాలు కలగటం సహజం... కాని యోగులకు, సిద్ధులకు సెల్‌ఫోన్‌లతో పనిలేదు. మనసు లగ్నంచేసి కోరినవారితో మాట్లాడగల తపోసంపన్నులు వీళ్ళు.

# చిలిపి



హీరో హీరోయిన్‌ని ముద్దు పెట్టుకునేటప్పుడు హీరోయిన్ కళ్ళు మూసుకుంటుంది ఎందుకు?
ఆ దృశ్యాన్ని చూడలేక.

ఐ లైక్ టెల్గూ వెరీమచ్...
ముఝే భీ బహుత్ పసంద్ హై...

మనిషి తన జీవితంలో సాధించలేనిదేమిటి?
చేతులు ఊపకుండా నడవడం.

విడాకులు కావాలంటే?
కుట్టిన విస్తర్లు విడదీయాలి.

ఉపాధ్యాయులు రోజూ చదివించేది, అర్థం చెప్ప(లే)నిది?
జనగణమన మరియు వందేమాతరం.

పంతులుగారిముందు నిల్చుంటే పిల్లలు చేతులు కట్టుకుంటారు ఎందుకు?
చేతులు చాపుకొనివుంటే బెత్తంతో కొడతాడేమోనని!

డబుల్‌కాట్ దేనికి?
వానకి ఇల్లంతా మడుగైతే క్రింద ఉన్న సామాన్లన్నీ దానిమీద పెట్టుకోవటానికి!

సినిమాల్లో హీరోయిన్ హీరోను రామునితో వర్ణిస్తుందెందుకని?
కృష్ణుడితో వర్ణిస్తే తనకు కష్టమని!

జీప్ తిరిగి హైవేలో ప్రవేశించింది. దారిలో ఒక దాబాహౌస్‌వద్ద ఆగారు.

పండ్లు ఆహారంగా తీసుకుని ఒక గ్లాసు పాలు మాత్రం త్రాగాడు మర్మయోగి. కార్తికేయ టిఫిన్ చేసి వచ్చాడు. మధ్యాన్నం దారిలో ఎక్కడో భోజనం. ఏకబిగిన జీప్ దూసుకుపోతూనే ఉంది.

సాయంత్రం మూడు గంటల ప్రాంతంలో ఒక చోట జీప్ ఆపించాడు మర్మయోగి. హైవేకి ఎటు చూసినా అటవీ ప్రాంతమే కన్పిస్తోంది.

దూరంగా ఎత్తయిన కొండలు వరుసలు తీరి కన్పిస్తున్నాయి. అప్పటికి వర్షం తగ్గిపోయింది. ఆకాశంలో మబ్బులు అలాగే ఉన్నాయి.

"ఎడంపక్క... అటు నాటు దారి ఒకటి కనబడుతోంది చూడు నాయనా. ఆ బాట వెంట జీప్ పోనీ" అంటూ సూచించాడు మర్మయోగి.

జీప్‌ను అటు మళ్ళించాడు కార్తికేయ.

క్రమంగా ఆ మార్గంలో దట్టమైన అటవీ ప్రాంతంలోకి దూసుకుపోనారంభించింది జీప్.

"పోనీరా... ఇంకా ఫాస్ట్‌గా... ఆక్సిలేటర్ అడుక్కి తొక్కెయ్. ఎంత దూరం పారిపోతాడో చూద్దాం. పోనీ" డ్రయివర్ని పెద్దగా అరుస్తున్నాడు ఢిల్లీ నుంచి వచ్చిన సాదూభాయ్.

రాకెట్ వేగంలో హైవేలో దూసుకువెళుతోంది వాళ్ళ కారు. ఆ కారుని అందుకోలేక క్రమంగా వెనక బడుతోంది వెనకే వస్తున్న కిట్టప్పనాయుడి గ్రూప్ వస్తున్న వ్యాను.

"బాస్! ఇప్పటికే స్పీడో మీటర్‌లో నీడిల్ రెండు వందల్ని టచ్ చేస్తోంది. ఇంకా స్పీడంటే మనం స్పీడ్‌గా పైకిపోతాం" కంగారును అణచుకొంటూ హెచ్చరించాడు డ్రయివరు దీనారాం.

సాదూభాయ్‌కి చాలా టెన్షన్‌గా ఉంది.

పొద్దుట తాము పర్లాకిమిడిలో బయలుదేరే సరికి ఉదయం ఆరుగంటలు దాటదు సమయం. అప్పటికి కార్తికేయ జీపు వంద కిలోమీటర్లు దాటి వుంటుంది. గంటకు ముప్పై కిలోమీటర్లు వేగం పెంచినా మధ్యాన్నంలోపు కార్తికేయ జీపును అందుకోవచ్చనుకున్నాడు.

అలాంటిది సాయంత్రం మూడుగంటలు అవుతున్నా ఆ జీపు ఇంకా దరిదాపుల్లోకి రాలేదు. ఎగువన చాలా దూరంలో ఉన్నట్టు రూట్ ఇండికేటర్ సూచిస్తోంది. అంత వేగంగా పోతున్నాడంటే చంపటానికి తాము వెంబడించి వస్తున్నట్టు కార్తికేయకు తెలిసిపోయిందా... దానికి ఛాన్సే లేదు.

ఆ జీప్‌లో తాము అమర్చిన రూట్ ఇండికేటర్‌లో బ్యాటరీ మూడురోజులకు మించి రాదు. ఇవాళ రేపు కూడా వాడు తప్పించుకున్నాడంటే తర్వాత వాడు ఎటు పోయిందీ తెలీదు.

చూస్తుంటే వాడు మధ్యప్రదేశ్ సరిహద్దుల వైపు వెళ్ళిపోతున్నట్టుంది. ఎలాగయినా ఈ రోజు చీకటి పడేలోపు కార్తికేయను అంతం చేసి, రాత్రికే ఢిల్లీకి తిరుగు ప్రయాణంలో ఉండాలని తొందరపడుతున్నాడు సాదూభాయ్. కాని ఈ రోజు పని జరిగేటట్టు లేదు. పరి విధాలుగా ఆలోచిస్తున్నాడు.

కోపం ముంచుకొస్తోంది. దారిలో ఎక్కడా ఆగలేదు. భోజనాలు చేయలేదు. ఏకబిగిన ప్రయాణం. అయినా కార్తికేయ జీప్‌ని పట్టుకోలేకపోతున్నారు.

సాదూభాయ్‌కి భయంకరంగా కోపం ముంచుకొస్తోంది. ఆ కోపంలో అందర్నీ బండబూతులు తిడుతున్నాడు. హైవే తరిగిపోతోంది. క్రమంగా కనుచీకటి వేళ అయింది.

అంతలో మరోసారి కెవ్వున అరిచాడు సాధూబాయ్ అసిస్టెంట్. "ఆపండి... కారు ఆపండి" అని కూడా అరిచాడు. వెళుతున్న వేగానికి వాడు అరిచిన అయిదో నిమిషంలోగాని కారు ఆగలేదు.

"ఏమైంది?" విసుగునంతా గొంతులో చూపిస్తూ అరిచాడు సాదూభాయ్.

"మనం ముందుకు వెళ్ళి లాభం లేదు. ఆ జీప్ హైవేలో లేదు బాస్. ఇటు చూడండి" అంటూ రూట్ ఇండికేటర్ సిగ్నల్‌ని చూపించే పరికరాన్ని సాదూభాయ్ చేతికి ఇచ్చాడు అసిస్టెంట్. అందులో జీప్ పొజిషన్ చూపిస్తూ వెలగాల్సిన రెడ్ స్పాట్ ఇప్పుడు కన్పించటం లేదు.

"ఏమైందిరా దీనికి. సిగ్నలేది?" అరిచాడు.

"ఇప్పుడేగా నేను చూశాను. మనకి ఎడంపక్క ఎక్కడో అడవిలో ఉన్నట్టు చూపించింది. ఉన్నట్టుండి ఏమైంది దీనికి? అడవి మూలంగా సిగ్నల్ అందటం లేదా?" కంగారుపడ్డాడు అసిస్టెంట్.

"మూర్ఖుడా! సిగ్నలందక పోవడానికి ఇది ట్రాన్స్‌మిషన్ కాదురా. శాటిలైట్‌తో పని చేస్తుంది. చెట్లకింద ఆగిందేమో చూద్దాం. నువ్వు సరిగ్గా చూశావా? మనకి ఎడంపక్కనే కన్పించిందా?"

ఇంకా ఉంది



దేశ ఆర్థిక అభివృద్ధి, సాయుధ దళాల ఆధునీకరణ ఏకకాలంలో జరగాలి.
-జనరల్ బిపిన్ రావత్, ఆర్మీ చీఫ్




## దశావతార స్తుతి

**మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహశ్చ వామనః।**
**రామో రామశ్చ రామశ్చ కృష్ణః కల్కిః తథైవ చ॥**

మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ వామన, రామ, పరశురామ, బలరామ, కృష్ణ, కల్కి అవతారాలెత్తిన ఓ శ్రీమహావిష్ణూ నీకు నమస్కారం! ❒

## ఇది యుగాది కాదు

కృత త్రేత ద్వాపర కలి అనే పేరిట నాలుగు యుగాలు ఉన్నాయి. అవి క్రమంగా 17,28,000 - 12,96,000- 8,64,000 - 4,32,000 సంవత్సరాల పాటు ఆ పేరుతో ఉంటాయి.

ప్రస్తుతం ఆ వెనుక 3 యుగాలూ ముగిసి 4వదైన కలియుగం అంటే 4,32,000 సంవత్సరాలపాటు జీవించాల్సిన కలియుగం 5119 సంవత్సరాలని ముగించుకుని 5,120వ సంవత్సరంలోకి వస్తోంది.

ఈ సంవత్సరాన్ని ప్రారంభించేరోజు కాబట్టి ఇది సంవత్సరాది మాత్రమే, యుగాది మాత్రం కాదు.

ఈ ఉగాది రోజున చదివే (సే) కవిత్వాల్లో కొందరు 'ఇది యుగాది' అని ప్రారంభించగానే శ్రోతలు చప్పట్లు కొట్టేస్తూండడాన్ని చూస్తుంటాం.

అలా కవిత చదివినవారినీ, ఈ చప్పట్లవారినీ ఏమనగలం? సంప్రదాయం తెలియకపోతే! ❒

## మంచిబుద్ధి

ఉగాదినాడు ఏం చేస్తే సంవత్సరమంతా ఆనందంగా గడపగలుగుతాం? అని అడుగుతూంటారు ఎందరో.

ఒకే ఒక్క సమాధానం దానికి. ఒక్క ఉగాదినాడు మాత్రమే ఏవేవో ధర్మకార్యాలనీ, సత్యవాదనలనీ చే(సే)సి, ఇక సంవత్సరమంతా ఆనందంగానే ఉంటుందనుకోవడం కల్ల. భారతం చెప్తోంది కదా-ఆత్మనః ప్రతికూలాని పరేషాం న సమాచరేత్

'ఎవరు నీకు దేన్ని చేస్తే నీకు బాధ అనిపిస్తుందో అలాటిపనిని నువ్వు ఇతరులకు చెయ్యకు' అని దీనర్థం. ఈ ఉగాదిరోజునాడు దీన్ని ఆచరించి, ఈ సంవత్సరమంతా ఇలాగే ఉండాలనే బుద్ధిని ఇప్పించవలసిందని ప్రార్థిస్తే ఈ రోజునుండీ అన్ని రోజులూ అలా ఉండలేం గాని, కొంత మార్పు వచ్చేందుకు తప్పక అవకాశముంది.

కాబట్టి ఈ బుద్ధిని ఇప్పించవలసిందిగా దైవాన్ని కోరడం, ఈ రోజు వరకైనా చెడుని చేయకపోవడాన్ని ఉగాదినాడు చేయాలి. ❒

## శుభప్రదం

శ్రీహరికి మనుష్యులే కాదు- 84 లక్షలజీవరాసులూ ఆయనసంతానమే. ఆ కారణంగా ఉగాదినాడు చలువ మందిరాన్ని (చలివేంద్రం) ఏర్పాటుచేసి నెలరోజులపాటూ నిర్వహించడం మంచిది. పెద్దకుండల్ని తెచ్చి జీలకర్ర కొద్దిగా మెంతిపొడి కొద్దిగా అల్లం ఉప్పు కలిపిన మజ్జిగని త్రోవవెంటవచ్చేపోయే వారికి ఉచితంగా ఇస్తూ ఉంటే పితృదేవతలు తరిస్తారు.

అలాగే మంచి ఎండ(ల) కాలం కాబట్టి పక్షులకోసం చిన్న చిన్న గిన్నెల్లో నీటిని వాటిరాకకి వీలుగాఉండే ప్రదేశంలో ఉంచడం ఉత్తమం.

పశువులకి పచ్చిగడ్డీ, ఎండుగడ్డీ తరిగిన కూరముక్కలూ, అరటిపళ్ళూ ఒక చేద నిండుగా నీళ్ళూ మన ఇంటి ముంగిట ఉంచితే రోజూ వచ్చి తిని తాగి వెళ్తాయి.

ఇక చీమలకి పంచదార, నీటిలో తిరిగే జలచరాలకి బియ్యపుపిండి, యాచకులకి పెరుగన్నం... ఇలా ఆలోచిస్తే ఎవరికి వారికే తడతాయి మంచి పనులేమిటో. దేవాలయాన్ని స్వయంగా ఊడ్చి నీళ్ళు చల్లి ముగ్గులేయడం మరింత శుభప్రదం. ❒

## చదవాల్సిన శ్లోకం

మీ జన్మనక్షత్రానికి అధిపతి ఏ గ్రహమో తెలుసుకుని ఆ గ్రహానికి సంబంధించిన శ్లోకాన్నే రోజురోజంతా చదువుకోవడం మరింత మంచిది.

మీ ఇంటిపురోహితుణ్ణి అడిగితే మీ జన్మనక్షత్రం, గ్రహం, సంబంధించిన శ్లోకం ఆయన చెప్పగలుగుతారు. ❒

## యుగాలు నాలుగేనా!

కృత త్రేత ద్వాపర కలి అనే నాల్గింటికీ భగవంతుని ఆమోదముద్ర ఉంది కాబట్టి అవి యుగాలే-వాటి కాల పరిమాణాలు కూడా నిజాలే.

ఇక గొప్పవారైన కొందరిని బట్టి యుగాన్ని లెక్కించాలనే ధోరణి కూడా ఉంది.అయితే దాన్ని శకం అన్నారు.

ఆ లెక్కల ప్రకారం కలియుగం పుట్టుక క్రీస్తు నుండి లెక్కిస్తే 2017 నిండాయి ఉగాదికి.

శంకరాచార్యుల నుండి లెక్కిస్తే 2087 పూర్తయ్యాయి. శాలివాహనుని ప్రకారం 1939, భారత స్వాతంత్ర్యం వచ్చినదాని ప్రకారం 71-72 అవుతాయి. యుగప్రారంభమంటే అదొక అద్భుతమైన, ప్రపంచ అసాధారణమైన, లెక్కించే విధానం.

{ ధర్మాన్ని తెలుసుకున్నంతమాత్రాన ఫలితం లేదు.
దాన్ని ఆచరిస్తేనే ఫలితం దక్కుతుంది. }



# గుండ్రాయుడి కథ

ఎం. రమేష్ కుమార్

గుళ్ళూగోపురాలకు తిరగడం...వ్రతాలు, అభిషేకాలు చేయించడం... ఇలాంటి వాటికి సాధారణంగా నేను ఎప్పుడూ కాస్త దూరంగానే ఉంటాను. ఎవరిపని వారు సక్రమంగా నిర్వర్తించడం, చేతనయినంతలో తోటిమనిషికి సాయం చేయడం. పూజ అంటే నా దృష్టిలో ఇదే!

కానీ ఒక్కోసారి ఇంట్లో వాళ్ళ ప్రోద్భలంతో కొన్ని పనులు చేయక తప్పని పరిస్థితి వస్తూ ఉంటుంది.

మళ్ళీ అలాంటి సందర్భమే వచ్చింది. నాకు ఉద్యోగం వస్తే మా ఊరి అమ్మవారి కోవెలకి నన్ను తీసుకొచ్చి దర్శనం చేసుకొని మొక్కు చెల్లిస్తానని అనుకుందట మా నానమ్మ. నగరంలో మంచి కంపెనీలో ఉద్యోగం వచ్చి జాయినవడంతోటే నన్ను సతాయించడం ప్రారంభించింది.

మా ఇంట్లో అందరికంటే నానమ్మ దగ్గరే నాకు చనువు ఎక్కువ. చిన్నప్పుడైతే నానమ్మ చెప్పే కథల కోసం ఎప్పుడూ ఆవిడవెంటే తిరిగేవాణ్ణి.

ఆవిడ అంతో ఇంతో చదువుకుంది. పేపరు చదువుతుంది. వార్తలు ఆసక్తిగా వింటుంది. కథలే కాదు... ఏ విషయమైనా ఆసక్తికరంగా చెప్పడంలో నానమ్మ దిట్ట. ఫోన్లో ఆవిడ మరీ మరీ చెప్పిన మీదట ఇక తప్పదని అనుకుని శనివారం సాయంత్రానికి మా ఊరు చేరుకున్నాను. ఆదివారం ఉదయాన్నే నానమ్మతో కలిసి కోవెలకి చేరుకున్నాను.

దర్శనం అయ్యాక నేను బైటికొచ్చి అక్కడేవున్న గట్టుమీద కూర్చున్నాను.నానీ అక్కడున్న చెట్లకీ,పుట్లకీ కూడా పూజ చెయ్యందే రాదు. ఆ ప్రదేశమంతా వెదురుతోపు పరుచుకొని ఉండటం మూలాన చల్లగా ఉంది. వెదురుచెట్టు మీద పిట్ట కుదురుగా కూర్చోలేక జంట కోసం గాబోలు... చురుగ్గా బుర్ర తిప్పుతూ అటూ ఇటూ ఎగురుతోంది. కాస్త దూరంలో మా ఊరి ఏరు కన్పిస్తోంది.

వర్షాకాలం కావడం మూలాన ఓ మాదిరి నీటి ప్రవాహం ఉంది. గంభీరంగా నిశ్శబ్దంగా ప్రవహిస్తోంది ఏరు. వర్షాలు ఇంకా ఎక్కువ పడితే మాత్రం తన విశ్వరూపం చూపిస్తూ కాజ్‌వే ఎక్కేస్తుంది ప్రవాహం. కాసేపటి తర్వాత నానమ్మ వచ్చింది.

"ఒరేయ్... ఐదు నిమిషాలన్నా అక్కడ ఉండకుండా వచ్చేశావు. అసలు మొక్కుకున్నది నీ కోసమే కదా... అమ్మవారికి సరిగ్గా దణ్ణం పెట్టుకున్నావా లేదా?" నా పక్కనే కూర్చుంటూ అడిగింది.

నేను నవ్వి... "పెట్టుకున్నాన్లే గానీ కాజ్ వే కట్టక మునుపు ఇక్కడ పరిస్థితేమిటి నానీ? వరద వచ్చినప్పుడు రాకపోకలు బందయిపోయేవా?" అడిగాను.

మా నానమ్మని నేను 'నానీ' అనే పిలుస్తుంటాను.

"అంతేకదా మరి... నువ్వు హైస్కూలు చదువుతుండగా కాబోలు ఇక్కడ కాజ్ వే పడింది. అంతకు ముందు ఏట్లోంచి నడిచి అట్నుంచి ఇటు వెళ్ళడమే... కాస్తా కూస్తా నీరొచ్చినప్పుడు కూడా జనం అలాగే దాటేసేవారు. వర్షాలు ఎక్కువై వరద పెరిగితే మాత్రం రాకపోకలు బందయిపోయేవి"

"అయితే నానీ... మన ఏటిలో ఎవరైనా మునిగి చనిపోవడంలాంటి ప్రమాదాలెప్పుడైనా జరిగాయా? నేనైతే ఎప్పుడూ అలాంటివి వినలేదు" అడిగాను.

"నిజమే... ఎప్పుడూ అలాంటి సంఘటనలు జరగలేదు గానీ... ఒకసారి మాత్రం ఒక సంఘటన జరిగింది. అదో కథలాంటిదే అనుకో... దానిగురించి ఎన్నాళ్ళ వరకో జనాలు చెప్పుకున్నారు. ఇప్పటికీ నాలాంటి పెద్దతరం వాళ్ళు దానిగురించి తల్చుకుంటూ వుంటారు"

"ఏంటది? చెప్పు నానీ... ఇక్కడ వాతావరణం చాలా బాగుంది. కాసేపు ఇక్కడే కూర్చుని వెళ్దాం. నువ్వు చెప్పే కథలు విని చాలా కాలమైంది... ఆ కథేమిటో చెప్పు" ఉత్సాహంగా అన్నాను.

నిజానికి ఆ చల్లని వాతావరణం నుంచి నాకప్పుడే కదలాలని అన్పించలేదు.

"సరే... అలాగే చెప్తాను. కానీ ఇది కేవలం కథ కాదు.. నిజంగా జరిగిన సంఘటన. వెంకటరాయుడని ఓ కుర్రవాడు ఉండేవాడు. వాడు బాగా దిట్టంగా, బలంగా గుండుపిక్కలా ఉండడం వల్ల గుండురాయుడని అంతా అనేవారట.

అలా క్రమంగా వాడిపేరు 'గుండ్రాయుడి'గా మారిపోయింది. చాలా మంచోడు. అమాయకుడు. అసలైన విషయమేమంటే వాడికి మాటలు రావు.

వినబడదు కూడా. అయినా కాస్త సైగలతో చెప్తే మనం మాట్లాడుతున్నతీరు బట్టి ఏం చెప్తున్నామో సులభంగా అర్థంచేసుకునేవాడు.

వాడికి చదువబ్బలేదు.ఎప్పుడూ ఊరంట తిరిగే వాడు. వాడు వాళ్ళమ్మా కలిసి ఓ పూరి గుడిసెలో ఉండేవాళ్ళు. వాళ్ళమ్మే కూలినాలి చేసి వాణ్ణి పోషించేది. జబ్బు చేసి ఆవిడ చనిపోయాక గుండ్రాయుడు ఒంటిగాడైపోయాడు.

ధాన్యం మిల్లులో బస్తాలు మోసి కొన్నాళ్ళు...కూలి పనులు చేసుకొని కొన్నాళ్ళు బతికాడు. అప్పట్లో మన ఏటి ఒడ్డున ఒక ముసలాయన సైకిలు రిపేరు షాపు నడిపేవాడు. వీడు ఆ షాపులో చేరిపోయాడు. ఆ ముసలాయన దగ్గర పని నేర్చుకుంటూ ఆయనకి చేదోడు వాదోడుగా ఉండేవాడు.

సైకిళ్ళకీ, బళ్ళకీ పంచర్లు వెయ్యడం, చిన్నచిన్న రిపేర్లు చెయ్యడం చేసుకుంటూ ఉండేవాడు.

ఖాళీ వున్నప్పుడు గుండ్రాయుడు ఊళ్ళో ఎవరే పని చెప్పినా చేసేవాడు. ఎంత బరువైనా అవలీలగా ఎత్తిపడేసేవాడు. ఊళ్ళో అందరి ఇళ్ళూ తనవిగానూ, అందరూ తన బంధువులే అన్నట్టుగానూ ఉండేవాడు. ఎవరింట్లో ఏ కార్యం జరిగినా వాడు హాజరయిపోయి పనుల్లో చొరబడిపోయి చేసేవాడు. ఎంత చేసినా ఎవరినుంచీ ఏమీ ఆశించేవాడు కాదు. ఏదైనా ఇస్తే తీసుకునేవాడు... పెడితే తినేవాడు... అంతే.

ఎన్ని చేసినా ఎంత చేసినా గుండ్రాయుడికి నీళ్ళంటే మాత్రం విపరీతమైన భయం. ఆ భయం ఎందుకో మరి ఎవరికీ అర్థమయ్యేది కాదు.

చిన్నప్పుడు ఎవరో సాధువు వాడికి జలగండం ఉందని చెప్పాడనీ... అందుకే వాడికి నీళ్ళంటే భయమనీ అనుకునేవాళ్ళు. అయితే వాడిని ఈ విషయం అడిగితే మాత్రం నవ్వి ఊరుకునేవాడు. అప్పట్లో చాలా అవసరాల కోసం ఏరు దాటి అటుపక్క టౌన్లోకెళ్ళాల్సి వచ్చేది. ఈ ఊళ్ళో చాలా వస్తువులు దొరికేవి కాదు.

సైకిలు రిపేరు సామాన్లు ఏవి తేవాలన్నా ముసలాయనే ఏట్లోంచి నడుచుకుంటూ అటుపక్క టౌనుకు వెళ్ళి తెచ్చుకునేవాడు.

ఎందుకంటే ఏట్లో నీరున్నా లేకున్నా దాన్ని దాటి వెళ్ళాలంటే గుండ్రాయుడు భయపడేవాడు.

మన ఊరి ఏరుని 'దొంగ ఏరు' అనేవారు. ఎందుకంటే ఒక్కోసారి ఏట్లో తక్కువ నీరున్నట్టే ఉండేది. పై ప్రాంతాల్లో ఎక్కడో వర్షాలు కురిస్తే అప్పటికప్పుడే నీరు పెరిగిపోయి వరదొచ్చేసేది.

ఒకానొక వర్షాకాలంలో గుండ్రాయుడొక్కడే కూర్చుని ఏదో పనిచేసుకుంటున్నాడు. ముసలాయన సామాన్లకోసం ఏరుదాటి అటుపక్క వెళ్ళాడు. ఏట్లో కాస్త ప్రవాహం వుందిగానీ ఎప్పట్లాగే జనం అటూ ఇటూ నడుస్తూనే ఉన్నారు.

అప్పుడు జరిగింది ఆ సంఘటన. అకస్మాత్తుగా ఏట్లో ప్రవాహం పెరగడం మొదలైంది. మధ్యలో వున్నవాళ్ళు గమనించి గబగబా ఒడ్డుకి చేరిపోసాగారు. అటువైపు నుంచి అప్పుడే ఓ కుటుంబం ఏట్లో దిగి ఊరివైపు నడుచుకుంటూ వస్తున్నారు.

మాటల్లో పడ్డారేమో ప్రవాహం పెరుగుతున్న విషయం గమనించుకోలేకపోయారు. మధ్యలోకి వచ్చేసరికి విషయం అర్థమైంది.

అప్పటికే ప్రవాహం మోకాళ్ళు దాటిపోయి నడుము దగ్గరికి వచ్చేసింది. భార్యాభర్తలు వాళ్ళతో పాటు ఇద్దరుపిల్లలు ఉన్నారు. జరుగుతున్నది గమనించగానే తండ్రి పదేళ్ళ వయసున్న కొడుకును భుజాలమీదకు ఎక్కించేసుకున్నాడు.

చిన్నపిల్లలను ఆవిడ ఎత్తుకునే ఉంది. చూస్తుండగానే ప్రవాహం ఇంకా పెరిగిపోయింది. వాళ్ళు కేకలు వెయ్యసాగారు. చిన్నపిల్లను ఆవిడ కూడా భుజాల మీదకు ఎక్కించుకొంది. కొంతలో కొంత అదృష్టమేమంటే వాళ్ళు నిలబడిన ప్రదేశం కాస్త మెరకగాఉంది. అయినా ఒకపక్క ప్రవాహం పెరిగిపోతూనే ఉంది. వాళ్ళింక ప్రాణాలమీద ఆశ వదిలేసుకున్నారు.

ప్రవాహం బలంగా తోసేస్తుంది. నిలదొక్కుకోవడానికి చాలా కష్టపడవలసొస్తుంది వాళ్ళకి. ఆ సమయంలో సరైన ఈతగాళ్ళెవరూ అక్కడ లేరు.

అయినా ప్రవాహం పెరిగిపోతున్నప్పుడు సాహసించి ఏట్లోకి దూకేవారెవరు? గట్టున వున్నవాళ్ళు



చూస్తూనేవున్నారు. కేకలు వేస్తున్నారు. కానీ ఎవరికీ ఏట్లోకి దిగడానికి ధైర్యం చాల్లేదు. ఒక కుటుంబం నిస్సహాయంగా ఏట్లో మునిగి చనిపోయే పరిస్థితిని చూసి ఒడ్డున వున్నవాళ్ళు తట్టుకోలేకపోతున్నారు.

ఆ సమయంలో గుండ్రాయుడు అక్కడేవున్నాడు. కేకలు విని షెడ్ నుంచి బైటకొచ్చి జరిగింది చూశాడు. సహజంగానే వాడిది చాలా సున్నితమైన స్వభావం. ఎవరికే కష్టం వచ్చినా తట్టుకోలేడు.

అందరినీ తనవారిగానే భావించేవాడు. అలాంటిది కళ్ళముందు అంత ఘోరం జరుగుతుండేసరికి వాడికి హృదయం ద్రవించిపోయింది. వాడి కళ్ళ నుంచి ధారాపాతంగా నీళ్ళు కారసాగాయి.

ఏటి మధ్యలో వున్న కుటుంబానికి ఇక నూకలు చెల్లిపోయాయనీ, వారినెవరూ కాపాడలేరని అందరికీ అర్థమవుతోంది. ఇంతలో ఓ పెద్ద దుంగ ప్రవాహంలో కొట్టుకొచ్చింది. దాన్ని దొరకబుచ్చుకున్నారు వాళ్ళు. దాని ఆసరాతో ఎలాగో ప్రవాహం మధ్యలో నిలదొక్కుకున్నారు.

అందరిలోనూ ఆశలు చిగురించాయి. కాసేపు



## ఇప్పటిదాకా చెయ్యనిది

'తేజా' సినిమాలో నారారోహిత్ సరసన నటించేందుకు ఎట్టకేలకు ఇషారెబ్బాను ఎంపికచేశారు.

వెంకటేష్, శ్రియాశరణ్‌లు నటిస్తున్న ఈచిత్రంలో నారా రోహిత్ సరసన నటించే తాజా అందాలతార కోసం తేజ అన్వేషించి, తుదకు ఇషాకు ఓటువేశాడు.

"ఈ ప్రాజెక్టులో భాగం అవుతున్నందుకు చాలా హాయిగా, ఆనందంగా వుంది.

ఇది అసాధారణ పాత్ర. ఇప్పటిదాకా నేను చెయ్యనిది. బాగా ఎగ్జయిట్ అవుతున్నాను.

'అమీతుమీ'లో తేజగారు నా పర్‌ఫార్మెన్స్‌ను మెచ్చి ఈ పాత్రకోసం నన్ను ఎంపికచేశారు"అంటూ మెరిసే కన్నులతో చెప్పింది.



నిలదొక్కుకోగలిగితే ప్రవాహం తగ్గి వాళ్ళు బయట పడతారని భావించారు.

గుండ్రాయుడితో పాటు అంతా ఆందోళనగా చూస్తున్నారు. కాసేపటికి ప్రవాహం మరింత పెరిగింది. నడుమ దాటి గుండెల వరకూ వస్తోంది.

సరిగ్గా ఆ సమయంలో ఆసరాగా పట్టుకున్న దుంగ ప్రవాహవేగానికి చేయిజారిపోయి కొట్టుకుపోయింది. వాళ్ళిద్దరూ కూడా ప్రవాహంతో పాటు వెళ్ళిపోవాల్సిందేగానీ అతికష్టంమీద నిభాయించుకుని నిలబడ్డారు. ఒడ్డున వున్నవారు ఆందోళనతో కేకలు వేస్తున్నారు. అప్పుడు జరిగింది అది.

ఏం ఆలోచన వచ్చిందోగానీ గుండ్రాయుడు షెడ్‌లోకి పరుగెత్తాడు. లోపల్నుంచి ఒక ట్రాక్టర్ టైర్ తాలూకు ట్యూబ్‌ని పట్టుకొచ్చాడు. బహుశా పంచర్లై రిపేరుకొచ్చిన ట్యూబ్‌ని బాగుచేసి గాలి కొట్టిఉంచాడు కాబోలు. అది పట్టుకుని ఇంక ఎవరివైపూ చూడకుండా ట్యూబ్‌ని తగిలించుకొని ఏట్లోకి దిగిపోయాడు.

అందరూ అలా నివ్వెరపోయి చూస్తుండిపోయారు. ట్యూబ్ పట్టుకొని ఏట్లోకి దిగడంవల్ల మునిగిపోకుండా వెళ్ళొచ్చుగానీ ఈ ప్రవాహంలో ఏమౌతుందో... ఏరు ఎటు ఈడ్చుకుపోతుందో ఎవరికీ అర్థంకాలేదు.

ట్యూబ్ పట్టుకొని ప్రవాహంలో దూకాలన్న ఆలోచన ఆ సమయానికి వాడికి రావడంమాట అటుంచి నీళ్ళంటే విపరీతంగా భయపడే గుండ్రాయుడు ఆ విధంగా దూకడం అందరికీ ఎంతో ఆశ్చర్యాన్ని కలిగించింది. ప్రవాహం ట్యూబ్‌తోపాటు తోసేస్తున్నా బలమైన మనిషి కాబట్టి నిలదొక్కుకుంటూ చేతులు ఆడిస్తూ ముందుకెళ్తున్నాడు గుండ్రాయుడు.

గుండ్రాయుడికి ఏమీ కాకూడదని ఆ కుటుంబం ఒడ్డుకు చేరుకోవాలనీ అంతా మనసులోనే ప్రార్థిస్తున్నారు.ప్రతి ఒక్కరిలోనూ ఉత్కంఠ.. ఆందోళన. గుండ్రాయుడు అలాగే నెమ్మదిగా ముందుకి వెళ్తున్నాడు. ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని మధ్యలో వున్నవారు నిలదొక్కుకుంటున్నారు. ప్రవాహం తగ్గలేదు, పెరగలేదు. అదేవిధంగా ప్రవహిస్తోంది ఏరు.మొత్తానికి గుండ్రాయుడు వారి వద్దకు చేరుకున్నాడు.

మగ మనిషిని తన నడుము గట్టిగా పట్టుకోమని సైగ చేసి వెనక్కి తిరిగి చేతులు బలంగా కదిలిస్తూ ఒడ్డువైపు రాసాగాడు. భుజంమీద వున్న పిల్లాడితో సహా అతన్ని తనతో పాటు లాక్కువస్తున్నాడు.

వాళ్ళు క్షేమంగా ఇటుపక్క చేరాలని ఒడ్డున వున్నవారు మొక్కుకుంటున్నారు.

మొత్తానికి ఎలాగైతేనేం... ఒడ్డు దగ్గరికి చేరుకున్నారు వాళ్ళు. ఒడ్డునే కాస్త ముందుకొచ్చి సిద్ధంగా వున్న ఓ ఇద్దరు మనుషులు వాళ్ళని అందుకుని గబుక్కున బైటికి లాగేశారు.

గుండ్రాయుడు మాత్రం మళ్ళీ వెనక్కి తిరిగి ఆడమనిషినీ, పిల్లనీ ఒడ్డుకు చేర్చడానికి బైల్దేరాడు.

ఆయాసపడుతూ మధ్యకి చేరుకొని ముందులాగే వాళ్ళని కూడా లాక్కురాసాగాడు. మొత్తానికి ఎలాగైతేనేం ఒడ్డుకు దగ్గరగా వచ్చేశారు వాళ్ళు.

ఈసారి ధైర్యం చేసి ఇంకాస్త ముందుకొచ్చి ప్రవాహంలో నిలబడ్డ మనుషులు ఆడమనిషినీ చంటిపిల్లనీ అందుకుని ఒడ్డు పట్టించారు.

గుండ్రాయుడు ట్యూబు తగిలించుకునివున్నాడు గాబట్టి వచ్చేస్తాడని చెప్పి ఒడ్డు కెళ్ళిపోయారు వాళ్ళు. అక్కడే ఊహించని సంఘటన జరిగింది. ట్యూబుకి వేసిన పంచరు వదిలేసి గాలి బైటకిపోయిందో ఏమో ట్యూబ్ చప్పగా అయిపోయి వేళ్ళాడిపోయింది. ఒడ్డుకి సులువుగా చేరిపోవచ్చని ధీమాగా వున్న గుండ్రాయుడు ట్యూబ్ ఆసరా పోగానే ఒక్కసారిగా పట్టుదప్పి ప్రవాహంలోకి వెళ్ళిపోయాడు. ఒడ్డున వున్నవారు హాహాకారాలు చేశారు.

అప్పటికే పరిస్థితి చేయిదాటిపోయింది. మునుగుతూ తేలుతూ రెండు మునకలేసిన గుండ్రాయుడు తర్వాత ప్రవాహపు ఉరవడికి వేగంగా కొట్టుకుపోతూ చూస్తుండగానే కనుమరుగైపోయాడు. ఒడ్డున వున్నవారు అరుస్తూనే ఉన్నారు. ప్రవాహంలో పడ్డ గుండ్రాయుడి కథ అక్కడితో ముగిసిపోయింది.

మర్నాడు ఉదయం పక్కవూరి వంతెన దగ్గర గుండ్రాయుడి శవం తేలింది. మన ఊరి వాళ్ళు అతని శవాన్ని తీసుకొచ్చి సకల లాంఛనాలతో ఏటి ఒడ్డునే ఖననం చేశారు.

నీళ్ళంటే అమితంగా భయపడే గుండ్రాయుడు ఎదుటివారి ప్రాణాల్ని కాపాడ్డానికి ఆ భయాన్ని కూడా లెక్కచేయకుండా ఏట్లోకి దిగి వాళ్ళని కాపాడి చివరికి తన ప్రాణాల్నే కోల్పోయాడు.

వాడికి నీటిగండం వుందని సాధువు చెప్పినమాట నిజమో కాదో ఎవరికీ తెలీదుగానీ చివరికి వాడి ప్రాణం మాత్రం ఆ నీట్లోనే కలిసిపోయింది... అదిరా కథ" అని ముగించింది నానీ.

కాసేపు ఆ కథ కలిగించిన భావోద్వేగం నుంచి తేరుకోలేకపోయాను నేను.

"అయితే ఆ గుండ్రాయుడి సమాధి ఇంకా ఉందా నానీ?" చివరికి తేరుకొని అడిగాను.

"ఎందుకు లేదు? అమ్మవారి కోవెల వెనకవైపునే ఆ సమాధి ఇప్పటికీ ఉంది. కోవెలకి వచ్చినవాళ్ళు కొంతమంది ఆ సమాధిని కూడా దర్శించుకొని వెళ్తుంటారు"

"సరే అయితే... పద అక్కడికోసారి వెళ్దాం" లేచి నిలబడుతూ అన్నాను.

నానీ నావైపు ఓసారి తేరిపార చూసి మళ్ళీ ఏమనుకుందో ఏమిటో "పద" అంది.

ఇద్దరం నడుచుకుంటూ కోవెల వెనకవైపుగావెళ్ళాం. కాస్త దూరం నడిచాక కనబడింది అది.ఎత్తుగా వున్న చిన్న కట్టడం సున్నంవేసి ఉంది.

దానిపైన తాటి కొమ్మలతో చిన్న సాలవేసి వుంది. అక్కడకు వెళ్ళి దాన్నిచూస్తూ నిలబడ్డారు. గుండ్రాయుడి పేరు, చనిపోయిన సంవత్సరం దాని మీద రాసి ఉంది. అప్రయత్నంగా చేతులు జోడించి నమస్కారం చేశాను. బామ్మ నావైపు కాస్తవింతగా చూస్తోంది.

"అలా చూస్తావేం నానీ?" అడిగాను.

"నువ్వు కుదురుగా నిలబడి ఇంత భక్తిగా నమస్కరించడం తొలిసారి చూస్తున్నాన్రా" అంది. నవ్వి "సరే... పద" అంటూ దారి తీశాను. చాలా రోజుల తరువాత దేవుడి దర్శనం అయిన అనుభూతితో అక్కణ్ణుంచి బయల్దేరాను.



ఈ దేశానికి పట్టిన
చిన్న రోగం కాంగ్రెస్,
పెద్ద రోగం బి.జె.పి.

-ప్రకాష్‌రాజ్, నటుడు

సీరియల్

# హృదయం ఎక్కడున్నదీ...?

"ఎందుకు అలా?" అని అడిగింది యశస్వి.

ఆ ప్లేస్ పేరు చెప్పగానే గూగుల్, యు ట్యూబ్ చూసేస్తుంది. అందులో వివరాలు, ఫొటోలు చూశాక సగం థ్రిల్ తగ్గుతుంది. కానీ ఇవన్నీ చెప్ప కుండా "యు కెన్ రిలై ఆన్ మి!" హామీ ఇచ్చాడతను.

"ష్యూర్! ఎక్కడికి రమ్మంటావ్?" రావటానికి సిద్ధమైపోయి అడిగింది.

"నువ్వు ఎక్కడికీ రావద్దు! మీ ఫ్లాట్ దగ్గరుంటే నేనే వచ్చి పికప్ చేసుకుంటా. నీ బైక్‌వద్దు! నువ్వు ముందు బైక్‌మీద వెళ్తుంటే నేను వెనక కార్లో వస్తుంటే ఏదో ఊరేగింపుకెళ్ళినట్లుంటుందికానీ రైడ్‌కెళ్ళినట్లుండదు కదా?" అన్నాడతను.

డాక్టర్ బొమ్మదేవర నాగకుమారి

ఒకసారి విజువలైజ్ చేసుకుని, "ఎస్!" అంటూ నవ్వింది. "ఉదయాన్నే ఎనిమిదింటికల్లా రెడీగా ఉండు! ఓకే?"

అనుకోకుండా డేట్ ఫిక్సయ్యింది... విష్ణు ఆ రోజంతా కావాల్సిన ఏర్పాట్లన్నీ చేసుకుని, ఉదయాన్నే చెప్పిన టైమ్‌కల్లా వచ్చాడు. అప్పటికే రెడీగా ఉన్న యశస్వి నవ్వుతూ వచ్చి కారులో కూర్చుంది. "హాయ్!"అంటూ విష్‌చేసింది. ఆమెవైపు ఒకసారి చూసి, చిరునవ్వుతో "హాయ్!" అన్నాడు.

"నాకు డ్రైవింగ్ వచ్చు! నేను డ్రైవ్ చేయనా?" చనువుగా అడిగింది.

"ఈరోజు మీరు మాకు యువరాణి అన్నమాట! మీకు సేవ చేసుకునే భాగ్యాన్ని మీ పట్టణంలోని ఈ పౌరుడికి ఇస్తున్నారు" చెప్పాడతను.

ఆమె నవ్వేసి చెప్పింది. "మా నానమ్మ కూడా అంతే! నన్ను యువరాణీ అనే పిలిచేది!"

"యువరాణిని ఎవరైనా అలాగే పిలవాలి కదా?" అన్నాడు అతను. ఆమె మళ్ళీ నవ్వేసింది.



## ఒక్కో సినిమాలో ఒక్కో కోణం

మొదటి సినిమా 'ముకుంద'లో ముగ్ధమనోహ రంగా కనపడిన పూజాహెగ్డే రెండో తెలుగు సినిమా 'డి.జె.జగన్నాథం' సినిమాలో తన అందాలతో హోర త్తించింది. తన ఈ రెండు పాత్రల్లాగే తన ఆలోచన ల్లోనూ వ్యత్యాసం ఉంటుందని వెరైటీగా పోల్చు కుంటున్నదీ అందాలభామ.

"ఒక్కో సినిమాలో నాలోని ఒక్కో కోణాన్ని ఆవిష్క రించాలని ఆశపడుతుంటాను. నా అదృష్టంకొద్దీ అటువంటి అవకాశాలే వస్తున్నాయి. చిన్నప్పుడు నేను టామ్‌బాయ్‌మాదిరి ఉండేదాన్ని. కథానాయి కను అవుతానని కలలో కూడా అనుకోలేదు.

గతాన్ని చూసుకుంటే ఇంతలా మారిపోయానా అనిపిస్తుంది. ఎటువంటి పాత్రలు చేయడానికైనా నేను సిద్ధం" అంటున్నది పూజ.

అతని శరీరం కార్లో, మనస్సు మాత్రం ఆకాశంలో పల్టీలు కొడుతోంది.

"ముందు బ్రేక్‌ఫాస్ట్ చేద్దాం..." అని అంటూ ఒక హోటల్ ముందు కారు ఆపాడు.

టేబుల్ ముందు కూర్చున్నాక చెప్పాడు "ఈ హోటల్లో దోశ చాలా ఫేమస్! మసాలా దోశ, ఆనియన్ దోశ, రవ్వ దోశ, ప్లెయిన్ దోశ... చెప్పు! ఏం తీసు కుంటావ్?" అడిగాడు.

"మసాలా దోశ!" చెప్పిందామె. అది సెల్ఫ్ సర్వీస్ హోటల్ కావడంతో అతనే వెళ్ళి వాటర్ బాటిల్స్, రెండు ప్లేట్లల్లో దోశలు తీసుకువచ్చాడు.

"అయ్యో! నేను వచ్చేదాన్ని కదా...?" అందామె అతని ఇబ్బందిచూసి నొచ్చుకున్నట్టుగా!

"చెప్పాకదా? ఈరోజు మీరు మా యువరాణి! మీతో పని చేయిస్తామా?" కావాలని చూపుడువ్రేలిని పెదవులమీద ఆనించుకున్నాడు.

అతని అభినయం చూసి ఆమెకు మళ్ళీ నవ్వొచ్చింది. నవ్వుతున్న ఆమెనే పరిశీలనగా చూశాడు. తను రోజూ ఆఫీస్‌లో చూసే ఆ అమ్మాయీ ఈ అమ్మాయీ ఒక్కరేనా అన్నంత తేడాగా, ప్రత్యేకంగా అనిపించింది అతనికి.

ఆఫీస్‌కి ఎంతో సింపుల్‌గా వస్తుంది.కానీ ఈ రోజు ప్రత్యేకంగా, లైట్‌గా మేకప్ వేసుకున్న ట్లుంది. కళ్ళకి కాటుక పెట్టుకోవటంవల్ల ఆమె కళ్ళ అందం మరింత ద్విగుణీకృతమయింది.

ఆ పెదవులకి లిప్‌స్టిక్ వేసుకుంది. అందుకే ఆమె మాట్లాడుతుంటే మరీ మరీ చూడాలనిపిస్తోందని అతనికి అర్థమయ్యింది.

సౌందర్యమే మనస్సుని కోసేస్తుంటుంది. ఇక అందమైన అమ్మాయిలు పని గట్టుకుని అలంకరించు కుంటే ఎంత ఇబ్బందో? అతను చూస్తున్నాడని ఆమెకి అర్థమయింది. మళ్ళీ అదే ఫీలింగ్!

అభినందనగా, ఆరాధనగా ఒక్కో పువ్వే తనమీద వేస్తున్నట్టు! తనను ఎందుకు అంత ఇష్టంగా చూస్తాడు? సూటిగా తన కళ్ళల్లోకి అక్కడనుంచి తన మనస్సు లోకి చూడాలన్నట్టుగా అలా చూస్తాడేం?

అంత ఇష్టంగా చూస్తే ఎంత కష్టం? అయినా తనుమాత్రం బయటపడకూడదు. మనస్సులోనే అనుకుని, చూపు తిప్పుకుని "ఇక్కడ టీ బావుం టుందా...? కాఫీ బావుంటుందా?" అడిగింది.

"టీ!" వెంటనే చెప్పాడు.



"ఏమిటీ?" ఆమె అడిగిన విధానానికి అతనికి నవ్వు వచ్చింది. కార్లో కూర్చున్నతర్వాత అన్నాడతను. "ఈ రోజు ఆదివారమైపోయింది. లేకపోతే కాసేపు షాపింగ్ కూడా చేసేస్తే ఓ పనైపోయేది"

"అంత అర్జెంట్‌గా ఏం కొనుక్కోవాలి?"

"ఎప్పుడూ ఓ లిస్ట్ రెడీగా ఉంటుంది. వెరీ అర్జం టయితే చెప్పులు! ఇలా షాపింగ్‌కి వెళదామని మూడు నెలల నుంచి అనుకుంటున్నాను. అలానే పోస్ట్‌పోన్ చేస్తున్నాను. ఎందుకంటే ఏ షాపులోకి వెళ్ళినా నా సైజ్ చెప్పులు దొరకవ్...! తిరిగీ తిరిగీ వేసుకున్న చెప్పులు కూడా అరిగిపోతాయ్" నవ్వాడతను.

"నాదికూడా సేమ్ ప్రోబ్లమ్! సేమ్ పించ్!" ఆమె చిన్నగా నవ్వి చిన్నగా అతని ఎడమ చేతి మీద సున్నితంగా పించ్ చేసింది. ఛాతీలో కొద్దిగా ఎడమవైపుగా ఉండే గుండె జారి చేతిలోకి వెళ్ళిపోయినట్టనిపించింది.

"ఐ నో! నువ్వయితే అర్థం చేసుకుంటావని నీతో షేర్ చేసుకుంటున్నాను!" అని బుద్ధిగా చెప్పాడు.

"ఐ అండర్‌స్టాండ్! మనది సేమ్ ప్రాబ్లమ్! మీ ఇంట్లో అందరూ మీలా పొడుగేనా?"

"కాదు కాదు! మమ్మీ డాడీ నార్మల్ హైట్! మా తాతగారు అంటే మమ్మీవాళ్ళ డాడీ ఆరు అడుగుల ఆజానుబాహుడు అని మమ్మీ చెబుతుంటుంది. నాకు ఆయన పోలికే వచ్చిందంట!

నేను అసలు స్కూల్లో ఉండగా చాలా మామూలు హైట్‌లో ఉండేవాడిని. అకస్మాత్తుగా నైన్త్‌క్లాస్‌కి వచ్చినప్పటినుంచి ఎత్తు పెరగటం మొదలుపెట్టాను.

ఇంటర్మీడియట్‌లో ఉన్నప్పుడయితే ఇలా మూడు నెలలు తిరిగేసరికి అలా నా ప్యాంటు ఇలా పైకి లాక్కున్నట్టే పైకి





## జరిగిన కథ

6

ఆది, నీతూ ఇస్తున్న బ్రేకప్‌పార్టీకి అటెండ్ అవుతారు యశస్వి, విష్ణు.

లోగడ తాము ఒకరికొకరు ప్రేమగా ఇచ్చుకున్న ప్రజెంటేషన్స్‌ని తిరిగి వాపస్ చేసుకుంటారు. ఆ తర్వాత అందరి ఎదుట హగ్ చేసుకుని విడిపోతారు.నీతూ, యశస్విలతో 'బాహుబలి' సినిమా చూస్తాడు విష్ణు.

యశస్విపక్కన కూర్చుని సినిమాచూడటం అతనికి ఎంతో థ్రిల్లింగ్‌ని ఇస్తుంది.

యశస్వికి క్రికెట్ అన్నా, విరాట్‌కొహ్లీ ఆటన్నా ఇష్టమని తెల్సుకుంటాడు విష్ణు. ఐపిఎల్ ట్వంటీ ట్వంటీ మ్యాచ్ చూసేందుకు రెండు టిక్కెట్‌లు సంపాదిస్తాడు. విష్ణుతోపాటు యశస్వి మ్యాచ్‌కు బయలుదేరుతుంది. ఆ రోజు మొదటిసారిగా విరాట్ ఆడిన ఆ గేమ్‌ని లైవ్‌లో చూడగలిగినందుకు సంతోషపడుతుంది యశస్వి.

వీకెండ్‌లో ఓ రోజు ఆమెకు ఫోన్‌చేసి మాట్లాడాలి అనుకుంటుండగా తనే ఫోన్ చేస్తుంది. సెలవు రోజులుకదా ఏదైనా ప్లాన్ చెయ్యి అని అడిగేసరికి రేపు నిన్ను మంచి ప్లేస్‌కు తీసుకువెళతానని చెప్తాడు విష్ణు. ఇక చదవండి.



## ఎంతో వ్యత్యాసం

కెరీర్‌లో తన తొలినాటికి, ఇప్పటికీ ఎంతో వ్యత్యాసం వుందంటున్నది సమంత. ఓ నటిగా ఎదగడం ఎంత కష్టమో, అదే స్థానంలో కొనసాగడమూ అంతే కష్టమన్నది ఆమె అభిప్రాయం.

"నటిగా ఎదిగాక అందరి కళ్ళూ మాపైనే వుంటాయి. కెరీర్‌లో ఒక్క తప్పుచేసినా, ఒక్క వైఫల్యం ఎదురైనా వేలెత్తి చూపేందుకు రెడీగా వుంటారు. అదే తొలి దశలో అయితే, ఇంతటి నిఘా వుండదు. ఏదో ఆడుతూ పాడుతూ పని చేస్తున్నట్లు వుంటుంది.

గుర్తింపు పొందాక ప్రతిరోజూ ఒక సవాలే. కథ ఎంపికనుంచి ప్రతి సన్నివేశంలోనూ టెన్షనే.

మొదట్లో ఒత్తిడిపడేదాన్ని కాని, ఇప్పుడు సత్ఫలితాలతో ఆత్మ విశ్వాసం పెరిగింది" అంటూ తన మార్కు నవ్వులు రువ్వింది.

వెళ్ళేది, ఇదెక్కడి గొడవరా అని డాడీ కోప్పడేవాళ్ళు! వాటెబవుట్ యు?" అడిగాడు.

"మా ఇంట్లో అమ్మా,నాన్నా, నేనూ అందరమూ పొడుగే! ఇంత పొడుగు వుండటంవలన ఎలాంటి సమస్యలు ఫేస్ చేయాలో అమ్మకి తెలుసు!

అందుకే అమ్మకి నేను పొడుగు పెరుగుతుంటే చిరాకు వచ్చేది. చెప్పులు, షూ, జీన్స్... ఏవీ నా సైజ్ ఒకపట్టాన దొరికేవి కావు.

చిన్నప్పుడు అదేపనిగా నేను పొడువు పెరుగుతున్నానని ఒకరోజు అమ్మ నన్ను కోప్పడింది. 'రోజూ నెత్తిమీద నాలుగు మొట్టికాయలు వేస్తా! ఇంక పొడవు పెరక్కుండా ఉంటావు' అంది.

ఆమె నిజంగానే అలా కొడ్తుందనుకుని భయపడి నేను ఇంకో ఉపాయం చెప్పాను. పోనీ నా తలమీద ఒక మేకు కొట్టమ్మా ఇంక పొడవు పెరగను అన్నాను. మా నాన్నగారు ఆ రోజు అమ్మని బాగా కోప్పడ్డారు" ఆమె చెబుతున్న విధానానికి అతనికి బాగా నవ్వొచ్చి, చాలాసేపు నవ్వాడు.

"రియల్లీ! ఎక్కడికి వెళ్ళినా అందరూ నా వైపు తల తిప్పి మరీ చూసేవారు. వాళ్ళలో ఒక ఆశ్చర్యము, ఒక అపనమ్మకము కనిపించేవి. చిన్నప్పుడు నన్ను అలా అందరూ వింతగా చూస్తూవుంటే నాకే ఇబ్బందిగా అనిపించేది. రాన్రాను నా పొడుగు నాకు అలవాటయ్యింది" చెప్పింది.

"నా హైట్‌వల్ల మా చెల్లెలు ఇప్పటికీ టీజ్ చేస్తూ ఉంటుంది. మమ్మీ నీకు పాలల్లో కాంప్లాన్ కలప

లేదురా. గ్రో మోర్ కలిపిందీ అని..."

"ఔనా?" అంటూ నవ్వసాగింది.

"అంతే అనుకున్నావా? మా కజిన్స్ అందరూ ఇంకోరకంగా ఏడిపిస్తుంటారు. వీడిఎత్తుకు సరిపోయిన అమ్మాయి ఎక్కడ దొరుకుతుంది? వీడి పెళ్ళి టైమ్‌లో వీడి మెళ్ళో పూలదండ వేయాలంటే ఆ అమ్మాయికి ఒక నిచ్చెన వేయాలి, అని జోక్స్ వేస్తుంటారు" ముఖం విషాదంగా పెట్టాడు.

'మా కజిన్స్ కూడా అంతే! దీనికన్నా పొడుగ్గా ఉన్న అబ్బాయ్ సౌత్ ఇండియాలో ఎక్కడ దొరుకుతాడు? దీని పెళ్ళికోసం అంకుల్ ఎన్ని మ్యాట్రిమోనీలచుట్టూ తిరగాలో? అంటారు.

కానీ మా నాన్నగారు 'నో ప్రోబ్లమ్! సౌత్ ఇండియాలో దీని ఎత్తుకు సరిపోయిన అబ్బాయ్ దొరక్కపోతే నార్త్ ఇండియా నుంచి తీసుకువస్తాను' అంటారని చెప్పబోయి గొంతుకు ఏదో అడ్డంపడ్డట్లు ఆగిపోయింది. అతను అలా కబుర్లు చెప్తూనేవున్నాడు.

ఎంత దూరం వచ్చారో తెలీదు. ఎంత టైమైందో తెలీదు. చివరగా విష్ణు కారు ఆపి, ఆమెవైపు తిరిగి అభివాదం చేస్తూ-

"యువర్ హైనెస్! దిసీజ్ యువర్ ప్యాలెస్! ఒకసారి సందర్శించుకుని వద్దాం!" చెప్పాడు.

ఎర్ర డోములున్న ఆ పెద్ద భవంతిని ఆమె ఇదివరకు చాలాసార్లు ఫోటోలలో, కొన్నిసార్లు టీవీ ప్రోగ్రామ్స్‌లో, సినిమాల్లో చూసి ఉంది. అందుకే చూడగానే గుర్తుపట్టింది. 'ఓ! మైసూర్ ప్యాలెస్సా?' విభ్రమంతో ఆమెకి నోట మాట రాలేదు.

కారుఓపక్కగాపార్క్ చేసి, తన మొబైల్ తీసి ఒక నెంబర్‌కి డయల్ చేసి చెప్పాడు-

"మేము ప్యాలెస్‌కి రీచయ్యాం!" తర్వాత 'మొబైల్స్ లోపలికి అనుమతించరు" అంటూ ఆమె దగ్గర్నుంచి కూడా మొబైల్ తీసుకుని, తన మొబైల్‌తో కలిపి డ్యాష్ బోర్డులో పెట్టాడు.

ఇద్దరూ కారు దిగి, ఓ గేట్‌వైపు నడవసాగారు. చుట్టూ పెద్ద గార్డెన్! మధ్యలో తన వైభవాన్ని చాటి చెపుతూ మూడంతస్థుల ప్యాలెస్ ఠీవిగా నిలుచుని ఉంది.

"నీకు తెల్సా? భారతదేశంలోని ఏడు వింతల్లో మైసూరు ప్యాలెస్ ఒకటి! మిగిలిన ఆరు వింతలు ఏమిటో చెప్పగలవా?" అడిగాడు.

ఒక్కక్షణం చురుగ్గా ఆలోచించి, "శ్రావణ బెళగొళలోని 'బాహుబలి' స్టాచ్యూ, తాజ్‌మహల్, హంపి, ఇంకా..." అంటూ ఆగిపోయింది.

"గుడ్! నువ్వు మూడు పేర్లుమాత్రమే చెప్పావ్! ఇంకా మూడు చెప్పాలి!" ఆమెను ఉడికిస్తున్నట్టుగా అడిగాడు అతను.

"నేను వెళ్ళి మొబైల్ తెచ్చుకుంటాను" అని చిన్నపిల్లలా చెప్పింది.

"నో! మొబైల్ హెల్ప్ తీసుకోకుండా చెప్పాలి! అందుకే చేతిలో మొబైల్ లేనప్పుడు ఈ ప్రశ్న అడిగాను" అన్నాడు.

"తొండి తొండి! నేను ఒప్పుకోను..." చిన్నపిల్లలా మారాం చేసింది ఆమె.

"నో ప్రాబ్లమ్! సాయంత్రం మనం తిరిగి వెళ్ళేలోగా ఆలోచించి చెప్పినా ఫర్లేదు! అలా చెబితే నీకో ఫైవ్‌స్టార్ చాక్లెట్ ఇస్తాను" చెప్పాడు.

ఆమె ఆలోచనలో పడింది. ఈలోగా ఓ వ్యక్తి వారి దగ్గరకు పరుగు పరుగున వచ్చి, అక్కడి ఉద్యోగిగా కన్నడలో పరిచయం చేసుకున్నాడు.

తన ఆఫీసర్‌కి బంధువులు కాబట్టి వివిఐపీ గేట్‌ద్వారా లోపలికి వెళదామని చెప్పాడు.

యశస్వి అర్థంగాక చూస్తుంటే విష్ణు చెప్పాడు "ఈ ప్యాలెస్‌లోకి వెళ్ళటానికి మూడు మెయిన్‌గేట్లున్నాయ్! చూడు!" అంటూ చెయ్యిసాచి చూపించాడు. తలతిప్పి చూసిందామె.

"అదుగో అటు దక్షిణంవైపున ఉన్న ఆ గేట్‌లోనుంచి సాధారణ సందర్శకులు లోపలికి ప్రవేశిస్తారు. తూర్పువైపున ఉన్న ఈ గేట్‌లోంచి కేవలం వివిఐపీలకు, విదేశీ సందర్శకులకు మాత్రమే ప్రవేశం వుంటుంది"

మా ట్విట్టర్‌ని ప్రజలు ఉపయోగించుకుంటున్న తీరే కాదు ఆ సమస్యకు పరిష్కారం మేము కనుక్కుంటున్న తీరు కూడా బాగోలేదు.

-జాక్ డోర్సీ, సి.ఇ.ఓ. ట్విట్టర్



"అంటే ఇప్పుడు మనం వివిఐపీలమా...?" అని వెంటనే అడిగింది.

"యువరాణీగారు అంటే అంతేకదా మరి?" అని చెప్పాడతను.

ఆమె ముసిముసిగా నవ్వుకుంది.

"సార్! 'మహిషాసురుడు' అనే రాక్షసుని పేరు మీద ఈ పట్టణానికి 'మైసూరు' అనే పేరు వచ్చింది! ఆ రాక్షసుడ్ని సంహరించిన ఆ తల్లి చాముండేశ్వరీ దేవి ఆలయం చాముండీ హిల్స్ మీద ఉంది.

అసలీ ప్యాలెస్ ప్రపంచంలోనే చాలా ఫేమస్! ప్రతిరోజూ అమెరికా, ఆస్ట్రేలియా, ఇంగ్లాండ్, దుబాయ్ లాంటి దేశాలనుంచి కూడా టూరిస్ట్‌లు వచ్చే ప్లేస్ ఇదే సార్!" బసప్ప మొదలుపెట్టాడు.

గొప్ప గొప్ప సందర్శనా స్థలాలలో నివసించేవారందరికీ ఆ స్థల మహత్యంవల్ల కాబోలు అంతో ఇంతో ఇలాంటి వాగ్ధోరణి ఉంటుంది.

విష్ణు పర్స్‌లోంచి ఐదువందలరూపాయల కాగితంతీసిచ్చి "టికెట్లు తీసుకురా!" అని చెప్పాడు.

"వద్దు సార్! నేనున్నాను కదా! టికెట్ అవసరం లేదు... పైనుంచి మీరు మా సారు బంధువులు!" అని ఎంతో వినయంగా, అభిమానంగా చెప్పాడు.

విష్ణు తల అడ్డంగా ఊపి, వెళ్ళి టికెట్లు తెమ్మని అతని చేతిలో నోటు బలవంతంగా పెట్టాడు.

అతను వెళ్ళాక చెప్పాడు-

"ఈ కట్టడాలన్నీ మన భారతజాతి వారసత్వ సంపదలు! వాటిని కాపాడటానికి అయ్యే ఖర్చులో కొంత ఈ టికెట్ల పైకంద్వారా వస్తుంది. మనం ప్రత్యేకంగా వెళ్ళి దేశసేవ గొప్పగా చేయలేకపోవచ్చు కానీ కనీసం ఇలాంటి చిన్న చిన్న విషయాల్లో అయినా స్ట్రిక్ట్‌గా ఉండాలన్నది నా ప్రిన్సిపుల్!"

"గుడ్ ప్రిన్సిపుల్! ఆ బసప్ప ఇక్కడ గైడ్‌గా పని చేస్తున్నాడా?"

"కాదు. ఎడ్మినిస్ట్రేషన్ విభాగపు ఉద్యోగి!"

"మరి అతడ్ని ఎందుకు పిలిచావు? మనంతట మనం వెళ్ళేవాళ్ళంకదా?" అయిష్టంగా అడిగింది.

నేనూ అదే అనుకున్నాను. సాయంత్రం ఓ చిన్న పనుంది. అందుకే ఇతడ్ని పిలవాల్సివచ్చింది. ఐనా టికెట్స్ తేగానే అతడ్ని పంపించేస్తాలే!" చెప్పాడతను.

వారిదగ్గరకు ఇంకో వ్యక్తి వచ్చి అడిగాడు- "సార్! గైడ్‌కావాలా? తెలుగు, కన్నడ, తమిళం, హిందీ?!"

విష్ణు ఆమెవైపు చూశాడు.

ఆమె వద్దన్నట్టుగా చిన్నగా తల వూపింది. అతను ఆమె అంతర్యాన్ని అర్థంచేసుకుని మనసులోనే నవ్వుకుని-

"థ్యాంక్స్! వద్దు" అన్నాడు. తిరిగివచ్చిన బసప్పదగ్గర నుంచి టికెట్‌లు తీసుకుని చెప్పాడు. "సాయంత్రం ఐదింటికి వచ్చెయ్!" అతను తలవూపి వెళ్ళిపోయాడు.

ఆ ప్యాలెస్‌లోకి అడుగుపెడుతుంటే ఆమెకి ఒడలంతా పులకించింది.

ఆ ప్యాలెస్ ఓ పురాతన చారిత్రక కట్టడం మాత్రమే కాదు, ఓ అత్యద్భుతమయిన మాస్టర్ పీస్! ఓ కళాఖండం!!

'ఒకప్పుడు మహారాజులు, రాణులు తిరుగాడిన ప్రాంతంలో తాము నడుస్తున్నారా?' ఆ ఫీలింగ్‌తో కాలు పూర్తిగా నేలమీద కూడా ఆనటం లేదు. గాలిలో తేలిపోతున్నట్టుగానే నడవసాగింది.

"టిప్పు సుల్తాన్ రోజుల్లో ఇక్కడ ఒక పాత రాజ కోట ఉండేది! ఆ సుల్తాన్ మరణించినతరువాత అంటే సుమారుగా పద్నాలుగో శతాబ్దంలో ఆ రాజ కోట మధ్యలో ఈ ప్యాలెస్‌ని రాజుల నివాసానికి, ఇతర అధికారిక సమావేశాలకు, కార్యకలాపాలకు వీలుగా ఉండేలా నిర్మించారంట!

అయితే కేవలం కలపతో నిర్మించటంవల్ల ఒక అగ్ని ప్రమాదంలో ఆ నిర్మాణమంతా కాలి బూడిదై పోయింది. ఆ తర్వాతి కాలంలో అంటే సుమారుగా పంతొమ్మిదీ ఇరవై శతాబ్దాల్లో వడయార్ల వంశస్తులు ఈ ప్యాలెస్‌ని నిర్మించారు.

అంటే మన దేశాన్ని బ్రిటీషర్లు పరిపాలిస్తుండగా ఈ నిర్మాణం జరిగిందన్న మాట! కాబట్టి వారి అభిరుచికూడా ఇక్కడ ప్రతిఫలిస్తుంది.

ఇందులో ఉపయోగించిన ఈ టైల్స్ చూడండి సార్! అప్పట్లో ఇంగ్లాండ్ నుంచి తెప్పించారు" ప్రక్కన ఎవరో తెలుగు టూరిస్టులు కాబోలు గైడ్‌ని హైర్ చేసుకున్నట్టున్నారు. అతను ప్రతి విషయాన్నీ పెద్ద గొంతుతో వివరిస్తున్నాడు.

విష్ణు చెయ్యి పట్టుకుని యశస్వి ఆపి, ముందు ఆ గ్యాంగ్ వెళ్ళిపోయినతర్వాత తాము వెళదామని సైగ చేసింది. అతను అర్థంచేసుకున్నట్టుగా ఆగాడు. కాసేపట్లో ఆ గ్యాంగ్, వారితోపాటు పెద్ద గొంతుతో మాట్లాడే ఆ గైడ్ కూడా వెళ్ళిపోయాడు.

ఆ కారిడార్లలో, అష్టభుజాకారంలోని ఆ దర్బార్ హాల్లో విష్ణు చెయ్యి పట్టుకుని నడుస్తుంటే ఆమెకి టైమ్ మెషీన్‌లోకి ఎక్కి మరో యుగంలోకి వెళ్ళిపోయిన ఫీలింగ్ కలిగింది.

"యశూ! ఈ ప్యాలెస్ ఆర్కిటెక్చర్ చూడు! ఈ ఆర్కిటెక్చర్‌ని ప్రత్యేకంగా 'ఇండో సార్సెనిక్ ఆర్కిటెక్చర్' అని పిలుస్తారు. ఒకప్రక్క మొఘలాయిల శిల్పకళ, ఇంకోప్రక్క హిందువుల నైపుణ్యం, ఆ ప్రక్క రాజ్‌పుత్‌ల చాతుర్యం చక్కటి నిష్పత్తిలో కల్పిన మేలు కలయిక కదా?!" విష్ణు అడిగాడు. అవునన్నట్టుగా తల వూపిందామె.

ఇంకొంచెం ముందుకు వెళ్ళాక రహస్యం చెబుతున్నట్టు చెప్పాడతను. "ఈ ప్యాలెస్‌లో కొన్ని రహస్య సొరంగ మార్గాలున్నాయంట! ఒక సొరంగమార్గమయితే నేరుగా శ్రీరంగ పట్టణానికి దారితీస్తుందంట!"

ఆమె చుట్టూ చూసింది. ఎక్కడా ఏమీ కనిపించలేదు.

"ఈ దర్బార్ హాల్లో రాజుగారు ఓ పెద్ద

## భాష నేర్చేశా

ఒకేసారి రెండు తమిళ సినిమాల్లో నటిస్తున్న రీతూవర్మ తమిళానికి మెరుగులు దిద్దుకునే అవకాశం లభించిందంటూ ఉత్సాహపడుతున్నది.

"నిజానికి నాకు ఇంతకుముందే కొంచెం తమిళం వచ్చుకాబట్టి కష్టంగా ఫీలవలేదు. సెట్స్‌లో సిబ్బంది అంతా కూడా తమిళం మాట్లాడతారు. దీనివల్ల నాకు త్వరగానే భాష వస్తున్నది.

పైగా, చిత్ర నిర్మాతలు నాకు డైలాగులను ముందుగానే ఇచ్చేస్తున్నారు. బాగా ప్రాక్టీస్ అవుతోంది" అంటున్న రీతూ, విక్రమ్‌తో తెర పంచుకోవడం గురించి జోరుగా చెపుతున్నది.

"అతనో గొప్ప నటుడు. నేను తొలిసారి సెట్స్‌లో కలసినపుడు చాలా కూల్‌గా, సింపుల్‌గా ఉన్నాడు. పనిపట్ల అతని అంకితభావం, నిబద్ధత చూసి ఎంతో ఆశ్చర్యపోయాను" అంటూ పొగడ్తల జాబితా విప్పింది అందాల తార రీతూవర్మ.





ఏ సమస్యకైనా చర్చలే మార్గం... తుపాకీ సంస్కృతికి అసలు ఆస్కారమే లేదు.
-రాజ్‌నాథ్‌సింగ్, కేంద్రమంత్రి

సింహాసనంమీద కూర్చుని మంత్రులతో, అధికారులతో సమావేశాలు జరిపేవారంట! జస్ట్ ఇమాజిన్! ఎంత వండర్‌ఫుల్‌గా ఉండివుంటుందో?"

'ఎవరక్కడ?' అని చప్పట్లుచరిచి పిలిచినట్టే అన్పించింది.

"అదుగో అక్కడ పైన ఆకుపచ్చ రంగులోని ఆర్చీలదగ్గర విదేశీయులు కూర్చుని ఈ క్యాబినెట్ మీటింగ్స్‌ని తిలకించేవారంట!

అక్కడ కనిపిస్తున్న ఆ గ్యాలరీల్లో మంత్రులు,వారి సహాయకులు,ఇదిగో ఈ చివర పరదాల్లో రాణులు, యువ రాణులు, అంతఃపుర స్త్రీలు,వారి పరిచారికలు కూర్చునేవారంట!"



నేడు జరుగుతున్నది ఉగ్రవాదంపై పోరాటమే కాని ఒక మతంపై యుద్ధం కాదు. -నరేంద్రమోడీ, ప్రధాని

ఆమెకి అంతా కలగా, మాయగా ఉంది. అతను చెప్తున్నదంతా ఎప్పుడో జరిగిపోయిన చరిత్రలాగా అనిపించటంలేదు. ఇప్పుడే తన కళ్ళముందే జరుగుతున్నట్టు, తాను అందులో ఓ భాగమైనట్టు అన్పించసాగింది.

ఆజానుబాహునిలా ముందు నడుస్తున్న విష్ణు ఓ యువరాజులా, తానో యువరాణిలా ఆమెకి భ్రాంతి కలిగింది.కలలో నడుస్తున్నదానిలా నడవసాగింది.

"చూడు! ఆ రోజుల్లోనే లిఫ్ట్‌కూడా ఏర్పాటుచేసుకున్నారు!" అక్కడున్న లిఫ్ట్‌ని నవ్వుతూ చూపించాడు.

"ఓగాడ్! ఈ లిఫ్ట్ మన లిఫ్ట్‌లాంటిదేనంటావా?" అని నమ్మశక్యంకాని ఆశ్చర్యం!

"కాకపోయుండొచ్చు! కానీ నమూనా అయితే అదే!" అన్నాడు. ఆ లిఫ్ట్‌ని ఉపయోగించటానికి వీలులేకుండా తాళం వేసివుంచారు.

ఇద్దరూ కలిసి రెండో అంతస్థులోకి మెట్లెక్కి వెళ్ళారు. "దక్షిణంవైపుగా ఉన్న ఈ ఆంతరంగిక దర్బార్‌హాల్‌ని 'అంబా విలాస్'గా పిలుస్తారు. ఇది ఇనుప కట్టడం! ఈ కట్టడాన్ని ఇనుప స్తంభాలు సపోర్ట్ చేస్తున్నాయి! ఈ స్తంభాల్ని కూడా ఎంతందంగా, ఆకర్షణీయంగా అలంకరించారో చూడు!"

"హాల్లో కన్ను తిప్పుకోనివ్వని నీలం, ఎరుపు, బంగారు వర్ణాల మేళవింపు, అందంగా తీర్చిదిద్దిన ఆ లతలు, ఆ పువ్వులు... ఈ అలంకరణంతా చూస్తే మనకు వెంటనే ఒక కళ్యాణమండపం గుర్తొస్తుంది కదూ?" అడిగాడు.

గత సంవత్సరం అక్కడో కళ్యాణం జరిగిందని పేపర్లో చదివినట్టు ఆమెకు గుర్తొచ్చింది.

"ప్లాస్టర్ ఆఫ్ ప్యారిస్‌తో రూపొందించిన పిట్టగోడల్ని మాత్రం ప్రత్యేకంగా మైసూరుకి చెందిన కె. వెంకటప్ప అనే ఒక చిత్రకారుడు రూపొందించాడు"

అద్భుతమైన పనితనం!

"ఆ పైకప్పు చూడు! ప్యాలెస్‌లోకి అంతటికీ ఎత్తయిన పాయింట్ ఇదే! మూడుప్రక్కలా ఉన్న టీక్ వుడ్ సీలింగులో ఎంత చక్కటి కార్వింగ్ చేశారో చూడు!" వర్ణించి చెప్పాడతను.

మెడ మొత్తం వెనక్కి వంచి తలెత్తి చూసిందామె. వర్ణచిత్రాలతో అలంకరించిన గ్లాస్ సీలింగ్స్, పైకప్పునుంచి వ్రేలాడుతున్న పెద్ద పెద్ద షాండ్లియర్స్, గ్లాస్ లైట్స్ ఆ హాల్ అందాన్ని మరింత ద్విగుణీకృతం చేశాయ్!

ఆమెకు ఒక్కసారిగా తల తిరిగినట్టుగా అన్పించింది. అక్కడికి బిలబిలమంటూ స్టూడెంట్స్ వచ్చారు. వారితోపాటు వచ్చిన మరో గైడ్ వివరించసాగాడు.

"ఆ దర్బార్‌హాల్లో రాజుగారు 'మయూర సింహాసనం' అని పిలవబడే ఓ పెద్ద బంగారు సింహాసనంమీద కూర్చుని తన మంత్రులతో సమావేశాలు జరిపేవారు!

ఆ సింహాసనాన్ని చెక్కతో తయారుచేసి, పైన బంగారు ఫలకాలతోతాపడం చేశారు. ఆ బంగారు ఫలకాల తయారీకి సుమారు 200 కిలోల బంగారం పట్టింది.

ఇంకా ఉంది



# అనాకారి వధువు

పూర్వం ఒక బలసంపన్నుడైన రాజుండేవాడు. ఆయనకొక కుమార్తె ఉండేది. ఆమె చాలా అనాకారి. కాని తండ్రి కళ్ళకు ఆమె అతిలోక సుందరిలాగా కనిపించేది. ఎందుకంటే ఆ రాజుకు తన కూతురంటే పంచప్రాణాలు.

తండ్రి తనను సాటిలేని సుందరి అంటూంటే కుమార్తె కూడా తను అందగత్తెననే అనుకున్నది.

రాజుగారి మాట కాదనే ధైర్యం లేక ఆయనకింద కొలువు చేసే వారంతా రాజకుమార్తె అందాన్ని వేనోళ్ళ పొగుడుతూ వుండేవారు.

రాజకుమార్తెకు యుక్తవయసు వచ్చింది. రాజు ఆమెకు వివాహం చేయ నిశ్చయించి, ఒక దూరదేశపు రాజకుమారుణ్ణి వరుడుగా ఎన్నుకున్నాడు.

కుర్రవాడు బుద్ధిమంతుడు, తెలివితేటలుగలవాడు. అతనితండ్రి రాజకీయ కారణాలవల్ల ఈ సంబంధం అనుకూలంగా భావించి, కొడుకును పెళ్ళికి ఒప్పించాడు. రాజకుమారుడు తండ్రి చెప్పగానే ఒప్పుకున్నాడు. ఎందుకంటే అతని మనసు ఎవరిమీదా లగ్నం అయి ఉండలేదు. తనకు తండ్రి నిర్ణయించిన రాజకుమార్తె అందగత్తె అని పుకారు కూడా వున్నది.

కాని అతనుతీరా బయలుదేరివచ్చి, తాను పెళ్ళాడనున్న వధువునుచూసేసరికి అతనికి కంపరంపుట్టుకొచ్చింది. అతను ఆమె సరసన కూర్చోవటానికి ఒప్పుకోలేదు. "అదేం?" అన్నాడు వధువు తండ్రి.

"అబ్బో, ఇంత అందం చూసేసరికి నా కళ్ళు జిగేలు మంటున్నాయి. ఒళ్ళంతా కంపరమెత్తుతున్నది. నన్ను క్షమించండి" అన్నాడు వరుడు.

"నీకు కాబోయే భార్య కాదుటోయ్? అంత బిడియపడితే ఎలా?" అన్నాడు వధువు తండ్రి.

"ఇంత అందగత్తెను నేను పెళ్ళాడజాలను. నేను ఆమెకు ఎంతమాత్రమూ అర్హుణ్ణికాను. నన్ను మీరు మన్నించాలి" అన్నాడు వరుడు. అంతా నిశ్చయమయ్యాక పెళ్ళికొడుకు ఇలా వెనకఅడుగు వెయ్యటం చూసి రాజుకు సహించరాని ఆగ్రహంవచ్చింది.

కాని అంతలోనే రాజకుమార్తె తన తండ్రితో, "నా అందానికి రాజకుమారుడు తగని పక్షంలో నేనొక విద్వాంసుణ్ణి పెళ్ళాడతాను" అన్నది.

రాజు ఆస్థాన విద్వాంసుణ్ణి దగ్గరికి పిలిచి, "ఏమయ్యా, నిన్ను మించిన విద్యాంసుడు మన దేశంలో లేడు. అందుచేత నువ్వే మా అమ్మాయిని పెళ్ళాడు" అన్నాడు. విద్వాంసుడు వణికిపోతూ, "మహారాజా, ఇదెక్కడైనా కద్దా? అదివరకే ఒకరిని అగ్నిసాక్షిగా పెళ్ళాడి, బిడ్డలను కన్నవాణ్ణి. శ్రోత్రియుణ్ణి. నన్ని వర్ణాంతర వివాహం చేసుకోమని తమరు కోరటం భావ్యం కాదు" అన్నాడు.

"బ్రాహ్మలు నాలుగువర్ణాల కన్యలనూ పెళ్ళాడవచ్చునని శాస్త్రాలు చెబుతున్నాయి" అన్నాడు మంత్రి.

"దానికేమంటావు? అమ్మాయి విద్వాంసుణ్ణి చేసు



కుంటానంటున్నది. ఆమె కోరిక నా ఆజ్ఞతో సమానం. దాన్ని నువ్వు ఉల్లంఘించరాదు" అన్నాడు రాజు.

"మహారాజావారు నన్ను క్షమించాలి. ఇది నావల్ల అయ్యేపనికాదు. తమఆజ్ఞ పాటించనందుకు ఏ శిక్ష విధించినా సంతోషంగాభరిస్తాను"అన్నాడు విద్వాంసుడు. "రేపు ఉదయంలోపల నా దేశం విడిచి వెళ్ళు" అన్నాడు రాజు ఆగ్రహావేశంతో. పరిస్థితి విషమించింది. ఈ రాజు తనను కూడా శిక్షించవచ్చునని వరుడుగా వచ్చిన రాజకుమారుడికి తోచింది.

"మహారాజా, రాజకుమార్తె వివాహం జరిగి తీరాలి. జరుగుతుంది కూడానూ. అందుకు నేనొక సూచన చేస్తాను. నచ్చితే మరలా చేయవచ్చు"అన్నాడతను.

"చెప్పు" అన్నాడు రాజు.

"సుక్షత్రియులైన యువకులను ఏరి తెచ్చి, వారి మధ్య ద్వంద్వయుద్ధాలు ఏర్పాటుచెయ్యండి. అందరినీ జయించినవాడు రాజకుమార్తెను పెళ్ళాడతాడు. ఈ పోటీలో నేను కూడా విధిగా పాల్గొంటాను..." అన్నాడు రాజకుమారుడు.

రాజు నగరంలో ఉన్న క్షత్రియ యువకులను పిలిపించి, వారి మధ్య ద్వంద్వ యుద్ధాలు ఏర్పాటు చేశాడు. వచ్చినవారంతా కత్తులు తీసుకుని ఎదురెదురుగా నిలబడి,రాజుగారు ఆజ్ఞాపించగానే, పెద్దపెట్టున రంకెలు పెడుతూ, కదను తొక్కుతూ కలియబడ్డారు. ద్వంద్వ యుద్ధాలు ఎంతసేపు జరిగినా ఎవరికీ సూది గుచ్చుకున్న పాటి గాయమైనా కాలేదు.

ఇదిగమనించి రాజుయోధులతో, "మీలో ముందు ఎవడు గాయపడితే వాడు నా కుమార్తెను చేసుకుంటారు" అన్నాడు. వెంటనే ద్వంద్వయుద్ధాలు కుక్కల కొట్లాటగామారాయి. ప్రతి ఒకడూ తాను గాయపడే లోపల అవతలివాణ్ణి గాయ పరచటానికి విశ్వప్రయత్నం చేశాడు.

కళ్ళుమూసి కళ్ళుతెరిచే లోపల అందరూ గాయపడ్డారు. ముందు గాయపడినదెవరో చచ్చినా నిర్ధారణ కాలేదు. ఎవడిమటుకువాడు, అవతలివాడే తన కన్నాముందు గాయపడ్డట్టు చెప్పాడు.

ఇదంతాచూసి రాజకుమార్తెకు వైరాగ్యం వచ్చేసింది. ఆమె తన తండ్రితో "నాన్నా, నా అందం చూసి బెదిరిపోయే వీళ్ళను నేనెలా పెళ్ళి చేసుకుంటాను? ఇంతకంటె పెళ్ళిలేకుండా ఉండటం మేలు" అన్నది. అప్పుడు ఆస్థానగాయకుడు ఒక మూలనుంచి "మహారాజా, నాదొక్కమనవి"అన్నాడు. అతను గుడ్డివాడు.

"ఏమిటి నీ సూచన?" అన్నాడు రాజు.

"నేను పుట్టుగుడ్డిని. పెళ్ళికాని వాణ్ణి. రాజకుమార్తె అందచందాలు చూసి ఆనందించే యోగ్యతగాని, బెంబేలు పడే భయంగాని నాకులేదు.

అందుచేత ఆమెను నాకిచ్చివెయ్యండి. నన్నొక ఇంటివాణ్ణిచేసిన పుణ్యంమీకుదక్కుతుంది"అన్నాడు ఆస్థానగాయకుడు. రాజకుమార్తె ఆ గుడ్డి గాయకుణ్ణి పెళ్ళాడటానికి తక్షణం ఒప్పుకున్నది. రాజు సంకోచించకుండా ఇద్దరికీ పెళ్ళిచేసేశాడు. ఆ దంపతులిద్దరూ ఎంతో అన్యోన్యంగా జీవించారు.

ఆర్.దయానందరావు



సేకరణ : చందమామ రావే

# వారఫలం

మార్చి 15 నుండి 21, 2018 వరకు

పిడపర్తి వీరేశ్వరశాస్త్రి, పిడపర్తి భాస్కర సుబ్రహ్మణ్యశాస్త్రి
సెల్ : 94921 56064



**మేషం:** అశ్విని, భరణి, కృత్తిక 1వ పా. మీరు ఆర్థిక వ్యవహారాలందు వివేకంతో సాగాలి.కుటుంబవ్యక్తులతో వైమనస్యము ఏర్పడే అవకాశమున్నది. మిత్రులుకదాఅని అనాలోచితంగా విశ్వసించకండి. తొందరతొందరగా మీపనులను పూర్తిచేసుకోవడానికి యత్నించకండి. పొరపాట్లు జరగగలవు.విద్యార్థులకు అనుకూల సమయం.సంతాన వ్యవహారాలు కొన్ని చికాకునుఏర్పరచినా సుఖాంతమవ్వగలవు.భాగస్వామిక ఒప్పందాలు, అగ్రిమెంట్లు పూర్తిచేసుకోగలరు. గురు, శుక్ర, బుధవారాలు అనువైనది.



**వృషభం:** కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా. కుటుంబసభ్యులు, భాగస్వామివంటివారినుండి ప్రోత్సాహాలు మీకు లభిస్తాయి. వ్యాపారేతర లాభాలు కొన్ని ఏర్పడతాయి. విద్యార్థులు లక్ష్యములు ఏర్పరచుకుని యత్నించుకోవాలి. మీ పనులను పూర్తిచేసుకోగల్గుతారు. ఉపాధి, వ్యాపార ప్రారంభాలువంటివాటితో బిజీగా ఉంటారు. టెక్నికల్‌గా ఎదగడానికి ప్రయత్నాలను ప్రారంభించు సూచనలుగలవు. ఈ రాశివారికి గురు, శుక్ర, శని, ఆదివారాలు అనువైనవి.



**మిథునం:** మృగశిర 3, 4పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా. ఈ సమయంలో ముఖ్యం అనుకున్న వ్యవహారాలపై దృష్టి కేంద్రీకరించగలరు.కుటుంబవ్యక్తులతో మనస్సువిప్పి సంతోషంగా వ్యవహరించుకోగల్గుతారు. గతమున ఇబ్బందిపెట్టిన అంశాలను సరిదిద్దుకునేందుకు ప్రయత్నాలను ముమ్మరంచేయగలరు.ఆర్థికంగా ఉత్సాహమునిచ్చు వార్తలు ఉంటాయి. వృత్తి, ఉద్యోగాలందు మీ సామర్థ్యతకు గుర్తింపులేర్పడు అవకాశాలు లభిస్తాయి. శని, ఆది, సోమ, బుధ వారాలు అనువైనవి.



**కర్కాటకం:** పునర్వసు 4వ పా, పుష్యమి, ఆశ్లేష. ఇతరుల సహకారాలు తీసుకుని ముఖ్య పనులను పూర్తిచేసుకోగల్గుతారు. ఇదే సమయంలో సన్నిహితులతో వ్యవహారాలందు మెలకువలు పాటించుకోవాలి. వృత్తి, ఉద్యోగ, వ్యాపారాలు సాధారణలతో సాగుతాయి. దీర్ఘకాలికంగా ఉంచు పెట్టుబడులందు జాగ్రత్తలు అవసరం. ప్రయాణాలందు వస్తు జాగ్రత్తలు అవసరం. గురు, శుక్రవారాలందు మెలకులతో సాగాలి.



**సింహం:** మఖ, పూర్వఫల్గుని, ఉత్తరఫల్గుని 1వ పా. మీ పనులన్నిటినీ తెలియని ఒత్తిడితో చేపట్టుకోవలసి రావచ్చును. నిశ్చింతగా సాగు మీ తీరు మీకు ఉపకరించగలదు. కుటుంబవ్యక్తుల తీరుపై దృష్టినుంచక కర్తవ్యాలనుపాటించుకొనుటయే మేలుకరం.సమయపాలనకు ప్రాధాన్యతనీయండి. ఆదాయాలు కొత్త రిస్క్ తీసుకోవడానికి ప్రేరేపించు సూచనలున్నాయి-ప్రయత్నించండి. గురు, శుక్ర, శనివారాలు అనువైనవి.



**కన్య:** ఉత్తరఫల్గుని 2, 3, 4పా, హస్త, చిత్త 1, 2పా. నూతన వ్యక్తులు, నూతన ప్రణాళికలువంటివాటితో ఉత్సాహాలతో సాగగలరు. ఒకింత అనవసర ఖర్చులువంటివి ఉండు సూచనలు గలవు. సోదరులతో తగాదాలువంటివి శాంతించగలవు. వృత్తి, వ్యాపారాలపట్ల ఎక్కువ శ్రద్ధ వహించగలరు. సంతానపు నిర్ణయాలు మీ ప్రమేయంచే మార్పుచేర్పులకు గురికాగల సూచనలున్నాయి. కొందరికి హోదాలువంటివి ఏర్పడగలవు. ఈ రాశివారికి ముఖ్యమైన పనులు చేపట్టుటకు గురు, శుక్ర, శని, ఆదివారాలు ఎంతో అనువైనవి.





**తుల:** చిత్త 3, 4పా, స్వాతి, విశాఖ 1, 2, 3పా. వీరికి కొన్ని అంశాలు గురించి టెన్షన్లు ఏర్పడగలవు. వృత్తి, వ్యాపార సంస్థలలో అసంతృప్తులకు గురికాగలరు. ఆత్మీయులు, కుటుంబ వ్యక్తులు అనుకునేవారిచే ఊహించని విధంగా వ్యతిరేకాలు పొందగలరు. వాగ్విషయాలందు లౌక్యాలు చాలా అవసరం. వ్యక్తిగతంగా స్వయంగా ఆలోచించుకుని నిర్ణయాలు తీసుకోవాలి.పెట్టుబడులువంటివి కొంతకాలం వాయిదావేసుకోండి. ఈ రాశివారు ముఖ్యమైన పనులుచేయుటకు శని, ఆది, సోమవారాలు చాలా అనువైనవి.



**వృశ్చికం:** విశాఖ 4వ పా, అనూరాధ, జ్యేష్ఠ. ఈ రాశివారికి వ్యక్తిగతమైన ఆదాయంపట్ల శ్రద్ధ వహించుకోవాలి. అనుమానాలు, ఒత్తిడిలు వంటివాటిచే ఇబ్బందులను ఎదుర్కోవలసి రావచ్చును. ప్రముఖులువంటివారితో సంబంధాలు ఏర్పడవచ్చును. ఆలోచనలను అమలులో పెట్టలేకపోతారు. ముఖస్తుతి వ్యక్తులను అంచనావేసుకోవాలి. ఖర్చులందు నియంత్రణ విధానాలు అమలుచేసుకోవాలి. ఈ వారమంతా తగు జాగ్రత్తలు పాటించుకోవటం చాలా అవసరం.



**ధనుస్సు:** మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వ పా. స్వంత విషయాలను, కుటుంబ సంబంధ విషయాలను చక్కదిద్దుకునే ప్రయత్నంలో వేగవంతమవ్వగలరు.ఇతరులను ఒత్తిడిలకు గురిచేయాలనే ప్రయత్నంలో ఇబ్బందులను కొనితెచ్చుకుంటారు. ఖర్చులకు సరిపడువిధంగా ఆదాయాలుంటాయి. వస్తువులపై ఖర్చులెక్కువచేయు సూచనలున్నాయి.కొత్తపరిచయం మీకు సంతృప్తినివ్వగలదు. పరీక్షలందు సంతృప్తిని పొందగలరు. గురు, శుక్ర, శని వారాలు అనువైనవి.



**మకరం:** ఉత్తరాషాఢ 2, 3, 4పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2పా. సంతోషం, గౌరవం రెండింటినీ పొందగలరు. ప్రతీ విషయంలోను దృఢసంకల్పంతో సాగగలరు. బంధుమిత్రులతో ఆప్యాయతలు పంచుకోవాలని యత్నించుకుంటారు. మీ అభిప్రాయాలను ఇతరులపై పెట్టేటప్పుడు ఆలోచనలు చేసుకోవాలి. ఒక అంశం మీకు మంచి ప్రేరణ అవ్వగల సూచనలున్నాయి.నూతనమైన ఆర్థిక ప్రణాళికలువంటివి రచించు సూచనలుగలవు. శని, ఆది, సోమవారాలు అనువైనవి.



**కుంభం:** ధనిష్ఠ 3, 4పా, శతతార, పూర్వాభాద్ర 1, 2, 3పా. స్థిరమైన ఆలోచనలు చేయతగ్గ సమయం. చిన్నచిన్న ఒడిదుడుకులున్నా భవిష్యత్‌కు బాట ఏర్పడగలదు. నా అన్నవారినుండి సహాయాలు లభించగలవు. మానసికంగాను, శారీరకంగాను కష్టించి పని చేయగల్గుతారు. అవరోధాలు, ఆటంకాలు లేకుండా మీ ప్రయత్నాలు ముందుకు సాగుతాయి.ఆర్థికంగా కొన్ని సర్దుబాట్లు అవసరమవ్వగలవు. ఈ రాశివారికి గురు, శుక్ర, బుధవారాలు అనువైనవి.



**మీనం:** పూర్వాభాద్ర 4వ పా, ఉత్తరాభాద్ర, రేవతి. మీ ఊహలకి, మీ అర్హతలకి సమతుల్యత పాటిస్తూ వ్యవహరించుకోవాలి. మీపై ఆధారపడేవారిని దృష్టిలో ఉంచుకుని మీ ప్రయత్నాలను సాగించుట మేలవ్వగలదు. ఆరోగ్యమును కాపాడుకోవాలి.స్థాన-స్థలమార్పులకై చేయు యత్నాలు ఉపకరిస్తాయి. ఇతరుల తప్పులను చూసీచూడనట్లు వదిలివేయుట మంచిది అవ్వగలదు. మీ నడవడిక, మాట సంబాళించుకుంటూ సాగుట మేలవ్వగలదు. శని, ఆది, సోమవారాలు అనువైనవి.

సంతోషంగా, తృప్తిగా జీవించే మనిషికి సహజమైన సిరిసంపదలు లభించినట్లే.

కామెడీ కథ



# హౌస్ అరెస్ట్

ఉదయాన్నే నరసయ్య గారు ఫోన్ చేశారు. ఆయన ఫోన్లో అయినా, ముఖా ముఖిగా ఐనా, గంటలు గంటలు ఆయనకి మాట్లాడ్డం అలవాటు.

అవి వినడం నాకలవాటు అయిపోయింది. ఆయన నాకంటే వయసులో పెద్దవారే! అయితే ఇద్దరం ఒకే ఆఫీసులో పనిచేసి రిటైర్ అయిపోయాం. ఒకరికొకరం ఏకవచనంలో పిలుచుకునే చనువున్నా, పిలుచుకునే అలవాటైతే రాలేదు. విషయం ఉన్నా, లేకున్నా, రోజుకోసారి ఫోన్లోనో, ప్రత్యక్షంగానో మాట్లాడుకోవడం అలవాటైపోయింది.

ఆ మాట, ఈ మాట మాట్లాడుతుంటే గుర్తొచ్చి "నిన్న మీ పెళ్ళిరోజట కదా! చెప్పనేలేదు! పార్టీ ఇవ్వాలని ఎగ్గొట్టారా" అంటూ అడిగాను.

"అంటే అన్నానని అంటారు గాని, ఓ విషయం చెప్పండి! ఆ రోజుని అంతలా జ్ఞాపకం ఉంచుకోవలసిన అవసరం ఉందా? గుర్తుంచుకోకపోతే జాతిలో వెలేస్తారా? దశాబ్దాల కిందట జరిగిన ఓ పొరపాటుని జీవితాంతం గుర్తుంచుకోవాలా? ఉంచుకున్నా... పండగ చేసుకోవాలా?" అంటూ ఆయన ఫోన్‌లోనే గయ్యిమంటూ అంతెత్తు ఎగిరి, అరగంటసేపు గుక్కతిప్పుకోకుండా మయసభ సీనులో దుర్యోధనుడిలా ఉపన్యాసం దంచేశారు.

నరసయ్యగారు అంత సీరియస్ అయిపోతారని ఊహించలేదు. నేరకపోయి అడిగానా అని అనిపించింది. ఆయనే ఓ అరనిమిషం గుక్క తీసుకుని అన్నారు. "...మీకో విషయం చెప్పాలి! ఆరోజుల్లో మా అమ్మ అంటూనే ఉండేది!

ఆ అమలాపురం సంబంధం మనకెందుకురా! చోడవరం, విశాఖపట్నం సంబంధాలు వచ్చాయికదా! అవైతే బావుంటాయి! నా మొహం చూసి వాళ్ళు ఓ పదివేలు కట్నంకూడా నీకు పడేస్తామన్నారు! నా మాట విను! బాగు పడతావు.

ఈ మాట ముప్పై ఏళ్ళ తర్వాత నీకు గుర్తుకు రాకపోతే ఒట్టు! అయినా నేను చెప్పవలసింది చెప్పాను! వింటే సరేసరి, లేదా నీ ఖర్మ" అంటూ 'క'కి వత్తు కూడా ఇచ్చి మా అమ్మ ఆరోజే పోరింది!

ఈ మాట చాలాసార్లు చిలక్కి చెప్పినట్టు చాలా సార్లు చెప్పింది! కాని నేనే... మా అమ్మ, మా అక్కల మాట వినలేదు! 'ఏదో... ఎర్రగా బుర్రగా ఉంది. వారపత్రికలు చదివే చదువుంది. వంట బానేచేస్తుంది. ఇంకేం కావాల్లే' అని అనుకున్నాను!

పెళ్ళిచూపులకి వాళ్ళ గుమ్మంలోకి వెళ్ళగానే కాళ్ళు కడుక్కోవడానికి వాళ్ళ నాన్న చెంబుడు నీళ్ళిస్తే,వాళ్ళ అమ్మగారు తుడుచుకోడానికి తుండుగుడ్డ అందించారు. ఆ కోనసీమ మర్యాదలు చూసి సగం బోల్తా పడ్డాను" అంటూ ఆగిందా ఉపన్యాస ప్రవాహం.

నేను ఊపిరి పీల్చుకోబోయాను.

"అబ్బే! అప్పటితో కథ అయిపోలేదయ్యా! అసలు కథ అప్పుడు ప్రారంభమైంది! ఒక్క నిమిషం ఉండు! ఈ దిక్కుమాలిన గదిలో సిగ్నల్స్ సరిగ్గాలేవు! బాల్కనీలోకివచ్చి మాట్లాడుతాను. లైన్లోనే ఉండు!" అంటూ ఓ హెచ్చరిక పడేశారు.

ఆ తర్వాత నరసయ్యగారు ఏం చేస్తారో ఊహించడం అంత కష్టం కాదు!ఆయన బాల్కనీలోకి వచ్చి, అటూ ఇటూ పచారులు కొడుతూ, గిరీశంలా రెండు చిటికెలేసి,ఉత్తి చేత్తో సిగరెట్టు దమ్ము లాగినట్టు ఓ పోజు ఇచ్చి, మొహం సీరియస్‌గా పెట్టి ఉంటారు.

"వినబడుతున్నదా?" అన్న ఆయన ప్రశ్నకి నా జవాబు కూడా వినకుండా మళ్ళీ మొదలెట్టారు. నరసయ్యగారు మాట్లాడుతుంటే సినిమా చూస్తున్నట్టు ఉంటుంది. నలుగురి సంభాషణలు ఒక్కడే చెపుతున్నా, గొంతుకలు మార్చిచెప్పటంలో సిద్ధహస్తులు. ఆయనకి ఇంటా, బయట నాటకాలు ఆడటం అలవాటే!

అంచేత ఎదుటివాడ్ని ఆకట్టుకునే వాగ్ధాటి, నటనా ప్రతిభ పుష్కలంగా ఉన్నాయి.

ఒక్కొక్కసారి నటన ఏదో, వాస్తవం ఏదో కూడా తెలుసుకోలేం! ఇప్పుడు నా పరిస్థితి అదే!

జయంతి ప్రకాశ శర్మ

## నీడలా విమర్శలు

తన స్వచ్ఛమైననవ్వుతో చూపరుల పెదవులనూ విప్పారింపచేసే కాజల్ అగర్వాల్ ప్రశంసల్నిఎంతగా స్వీకరిస్తుందో, విమర్శలనూ అంతే అందుకుంటుందట. అంతేకాదు-ఆసక్తిగా వుండే విమర్శలపై ఎప్పటికప్పుడు స్పందిస్తుంటుంది కూడా.

ఈ విషయం గురించి కాజల్‌ను కదిలిస్తే పక్కున నవ్వులు కురిపించింది. "మనం ఏం చేసినా విమర్శించేవారు నీడలాగా ఉంటుంటారు. మనం మనను అద్దంలో చూసుకున్నప్పుడు కూడా ఇలా వుంటే బావుంటుంది, అలా వుంటే బావుంటుంది అనుకుంటాం కదా. అదే విషయాన్ని ఇంకొకరు చెప్తే కోపం ఎందుకు" అంటోంది.



ఇక చేసేది లేక, సోఫాలో చతికిలపడి, ఫోన్ చెవి దగ్గర పెట్టుకున్నాను.

"ఆ ఎక్కడి వరకు వచ్చాను! సగం బోల్తా పడ్డానంత వరకువచ్చాను కదా! ఆ తర్వాత అమ్మాయి నచ్చిందని మేం కబురు పంపిన మర్నాడే మా మావగారు మా ఇంటికొచ్చి,

కట్నం కింద ఓ వెయ్యి నూటపదహార్లు పువ్వుల్లో పెట్టి, మీరేం అడగలేదు గాని, ఏదో మాకు కలిగిన కాటికి అంటూ మా నాన్న చేతిలో పెట్టేశారు! మా అమ్మకి ఆ వ్యవహారం నచ్చలేదు. మరీ వెటకారం కాకపోతే అలా పువ్వుల్లో పెట్టి ఇవ్వాలా?

రేపొద్దున్న పెళ్ళిలో, బుట్టనిండా పువ్వులు వేసి, అందులో పెళ్ళికూతుర్ని కూర్చోబెట్టి, పెళ్ళిపీటల మీదకు తీసుకువస్తారో ఏమో! అతి వినయాలు!' అంటూ వాళ్ళకి వినబడకుండా మా నాన్నదగ్గర మా అమ్మ కడుపులో దాచుకోకుండా అనేసింది!

ఆ తర్వాత పెళ్ళి విషయాలు మాట్లాడుతూ, మా అత్తగారు "పెళ్ళిలో మా అల్లుడికి ఓ మరచెంబు, వెండి కంచం, గ్లాసు ఇస్తాం.

అప్పచెల్లెళ్ళకి తలో నూటపదహార్లు ఇస్తానమ్మా! అంతకంటే ఏం ఇచ్చుకోలేము! ఇంకా ఇద్దరు ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు చెయ్యాలిగా!" అంటూ మా వీధంతా వినబడేటట్టు చెప్పింది.

వెంటనే మా అమ్మ, మా నాన్నని వంటింటిలోకి తీసుకువెళ్ళి మీరు మరీ గుమ్మడి వెంకటేశ్వరరావులా చేతులు నులుపుకుంటూ నుంచోకుండా, అడగవలసింది అడగండి! అన్నీనేనే అడిగితే, అత్తగారు సూర్యకాంతంలా ఉందని ఇప్పుడే పేరొచ్చేస్తుంది!



దేశాన్ని కాపాడుకోవాల్సిన బాధ్యత హిందువులది. అందుకే వారంతా ఏకం కావాలి. -మోహన్ భగవత్,
ఆర్.ఎస్.ఎస్.చీఫ్

మరీ లౌక్యం కాకపోతే... వీధిలో అందరిళ్ళకి వెళ్ళి, బొట్టు పెట్టి మరీ చెప్పినట్టు, పెళ్ళికి ఏమేమి ఇస్తారో ఇక్కడ్నుంచే వీధి అంతా వినబడేటట్టు చెప్పేసింది! తెలివితేటలు కాకపోతే, వెండికంచం అని నొక్కి వక్కాణించిందిగాని, తెలివిగా మరచెంబు, గ్లాసుల సంగతి దాటవేసింది!

రేపొద్దున్న పీటలమీద ఓ కంచు మరచెంబు, ఓ రాగిగ్లాసు మన మొహంమీద కొట్టి,అనుకున్నవి ఇచ్చేశామంటూ చేతులు దులుపుకునే రకంలా ఉన్నారు! అంచేత ముసుగులో గుద్దులాటెందుకు?

అదేదోముందుగానే మాట్లాడుకోవటం మంచిది!" అంటూ, మా నాన్న, వాళ్ళతో ఏం మాట్లాడాలో నూరి పంపింది. మా నాన్న ఓ గ్లాసుడు నీళ్ళు గొంతుకలో వేసుకుని, వాళ్ళకి ఫలహారాలను పళ్ళెంలో పెట్టుకుని వచ్చారు.

"అయ్యయ్యో! మీకెందుకు శ్రమ అన్నయ్యగారు! అయినా మీరు మరోలా అనుకోకండి. కలికితే అతకదంటారు! మా అత్తగారు మరీ మరీ చెప్పి పంపారు. అంచేత ఇవేం వద్దు!" అని మా అత్తయ్యగారునవ్వుతూ అనేసరికి మా నాన్న నోట మాట ఆగిపోయింది.

"అన్నట్టు మర్చిపోయాను అన్నయ్యగారూ! వాళ్ళ ఇంట్లో పెళ్ళిచేయమంటూ బొంకుల దిబ్బ దగ్గర మా మేనత్త డాక్టరు రామాయమ్మ లేరూ.. ఆవిడ ఒకటే గొడవ. పాపం ఆవిడకి పిల్లలు లేరు! మీకు తెలిసే ఉంటుంది!

మా పిల్లలంటే ప్రాణం.అందుకే తెగ కాళ్ళా వేళ్ళా పడిపోయింది! ఉభయ కుసులోపరిగా ఉంటుందని సరే అన్నాను! అది డాక్టర్ కదా... ఇంటినిండా నౌకర్లు, చాకర్లు ఉంటారు! ఇబ్బంది ఉండదు!

ఎటొచ్చి... మేం ఓ నెలరోజుల ముందర రావాలి! ఎలాగు ఇప్పుడు వచ్చాం కదా అని, ఆ ఇంటిముందర పందిరి పురమాయించి ఇలా వచ్చేశాం. వేసవికాలం కదా... ఈ మూడు నెలలు చల్లగా ఉంటుంది.

ఇంట్లో శుభకార్యం అని కూడా అందరికీ తెలుస్తుంది! ఎక్కడ పనులు అక్కడే ఉన్నాయనుకోండి! పెళ్ళికి ఇంకా మూడునెలలు టైముందిగాని, కళ్ళు మూసుకుని తెరిచేలోపల ముహూర్తం వచ్చేస్తుంది. ఇంకా సారే సామాను కొనాలి, పెళ్ళిబట్టలు కొనాలి. అవి ఆ టైలరుగాడికి ఇవ్వాలి.

లడ్డూలు, సున్నుండలు, అరిసెలు అమలాపురంలో చేయించాలి.అప్పడాలు, వడియాలు పెట్టుకోవాలి. శుభలేఖలు అచ్చు వేయించాలి.

పెళ్ళి అక్కడ కాకపోయినా మా కొంపకి సున్నాలు వేయించుకోవాలి. మా ఆయన ఇక్కడ పూచికపుల్ల తీసి అక్కడ పెట్టరు!

నేను, పిల్లలు ఈ పనులన్నీ చక్కపెట్టాలి. అక్కడ మా వీధిలో వాళ్ళు కూడా సాయం చేస్తారు.

వాళ్ళున్నారన్న ధైర్యంతోనే దిగానమ్మా, లేకపోతే నా ఒక్కదానివల్ల అవుతుందా! అన్నట్టు చెప్పటం మర్చిపోయాను.

పీటల మీద కూర్చోవడానికి పట్టుపంచా, చాపు మేం పెడతాం. ఎదురు సన్నాహాల దగ్గర, నాగవల్లప్పుడు అబ్బాయికి పెట్టడానికి ప్యాంటు, షర్టులకి గుడ్డ తీసి ముందుగానే పంపుతాం!

కుట్టించుకోమనండి. ఆ చేత్తోనే ఓ కోటు కూడా కుట్టించుకుంటే బ్యాంకుకి వేసుకువెళ్ళడానికి బావుంటుంది" అంటూ మా కాబోయే అత్తయ్య వీధి సావిడిలోకి వచ్చి, మా వీధి వాళ్ళకి వినబడేటట్టు, విషయాలన్నీ ఏకరవు పెట్టింది.

అక్కడ నుంచి వీధి గుమ్మంలోకి వచ్చి 'మళ్ళీ మరచిపోతాను వదినగారు! పెళ్ళికొడుకు కాశీయాత్రకి వెళ్ళినప్పుడు బావమరిదికి బట్టలు మీరు పెట్టాలిగా! మా వెంకటేశం పొడుగ్గా ఉంటాడు.

రెండు గజాలు గుడ్డ తీస్తే గాని వాడికి సరిపోదు. మిగతా సాంప్రదాయాలు మీకు తెలుసుగా.

అలాగే చెయ్యండి! ఏదో ఉన్నదాంట్లో ఘనంగానే చేస్తాం!! అన్నట్టు వదినగారు! ముందుగానే చెపుతున్నాను. పెళ్ళిలో ఎప్పుడైనా మా వలన పొరపాట్లు జరిగితే మీరు పెద్ద మనసుతో అర్థంచేసుకోండి.

మగాళ్ళకి పట్టేదు, ఎటొచ్చీ మన ఆడవాళ్ళమే, అన్నింటికీ రాద్ధాంతం చేస్తాం!!

ఏమిటో... అన్ని విషయాలు మాట్లాడాను, కానీ అసలు విషయం మరిచిపోయాను!

మీరు ఎంత మగపెళ్ళివారైనా సరే బోల్డంత పని ఉంటుంది. మీరు హైరానా పడి, ఇబ్బందిపడకండి.

మా రామాయమ్మ వాళ్ళ పనివాళ్ళకి పని పురమాయించుకోమని మరీ మరీ చెప్పింది!

ఏవైనా పనులుంటే వాళ్ళకి చెప్పండి. మొహమాటం పడకండి! ఆ మాత్రం ఒకరికొకరు సాయపడకపోతే ఎలా చెప్పండి! వస్తాను వదినగారు.

చాలా పొద్దుపోయింది!' అంటూ గుమ్మంలోఉన్న రిక్షా ఎక్కేశారిద్దరు.అంతే! మా అమ్మ ఆ మాటలకి బోల్తాపడి నవ్వుకుంటూ 'ఏమో అనుకున్నానుగానీ, సంబంధం మంచిదే' అని స్వగతంలో అనుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది. వెండి మరచెంబు, వెండి గ్లాసు అలా గాల్లో కలిసిపోయాయి.

ప్యాంటు, షర్టు వాళ్ళవి, కోటు మాది! వింటున్నావా?''అదే ఫోనులో ఆఖరిమాట వినబడింది.

నా ఫోన్లో బ్యాటరీ అయిపోయి మూగబోయింది. వాన వెలిసినట్టు అనిపించింది. ఒక్కమాట అడిగానో లేదో, నరసయ్యగారు కడుపులో దుఃఖాన్ని కక్కిపారేశారు. అయితే పెళ్ళిలో ఏమయిందో అనే ఆత్రుత నాలో చోటు చేసుకుంది.

బుర్ర వేడెక్కిపోవటంతో "ఓ కప్పు కాఫీ పెట్టవోయ్'' అని మా ఆవిడకి పురమాయించాను. "నాక్కూడా ఓ కప్పు'' అన్న మాటలు వినేసరికి గుమ్మంవైపు చూశాను. ఎదురుగా నరసయ్యగారు. ఆశ్చర్యపోయాను.

"మీ సెల్లో బ్యాటరీ అడుగంటి ఉంటుందని ఊహించాను. అయితే అసలు విషయం ఉండిపోయింది. దాన్ని ప్రత్యక్షంగా చెప్పాలని ఉన్న పళంగా వచ్చేశాను'' అంటూ లోపలికి వచ్చి సోఫాలో కూలబడ్డారు. మా ఆవిడ అందించిన కాఫీ తాగుతూ మళ్ళీ మొదలెట్టారు.

"అంటే అన్నానని అంటారు కానీ, మీ అయ్య కోనేరు గట్టు వాళ్ళందరికి వెటకారం ఎక్కువే! పెళ్ళికి పల్లకి పెడతామన్నారు. అది దొరకలేదుట. రిక్షాకి రంగు కాగితాలు కట్టి అందులో ఊరేగించారు.

డ్రస్సులతో బ్యాండుమేళం పెడతామన్నారు. సన్నాయి మేళంపెట్టారు. రామాయమ్మ గారింటి నుంచి మూడు లాంతర్ల వరకు పందిరి వేయిస్తామన్నారు. వాళ్ళ ఇంటి ముందు నాలుగు రాటలు పాతి, దానిమీద నాలుగు కొబ్బరాకులు పరిచి, అదే ఆకాశమంత పందిరి అన్నారు!

అదేమిటండి, పదిమంది కూర్చోడానికి కూడా సరిపోదు. అని అడిగితే, మున్సిపాలిటీవాళ్ళు పందిరి వేయడానికి ఒప్పుకోలేదన్నారు.

మా బ్యాంకువాళ్ళు భోజనాలు అయ్యాక వాళ్ళకి ప్రకాశం కిళ్ళీ కొట్లో ప్రత్యేకంగా కిళ్ళీ కట్టించి ఇస్తామన్నారు. చివరి క్షణంలో వాడికి ఏదో అవాంతరంవచ్చి కిళ్ళీకొట్టు మూసేశాడుట!

తమలపాకులు, సున్నం, వక్కలు పళ్ళెంలో వేసి వాళ్ళ ముందర పడేశారు.

భోజనాలయ్యాక పద్యం పాడితేకానీ లేవనిచ్చేది లేదని బెత్తం పట్టుకుని నిలబడ్డారు.

వేమన పద్యం ఒకటి మా చిన్నాన్న పాడితే, అందరూ ఒకటే నవ్వులు!

అదయిందా... ఉదయాన్నే స్నాతకం అయ్యాక, కాశీయాత్రకి వెళ్ళబోతుంటే, మా బామ్మర్ది ఓ టిక్కెట్టు చేతిలో పెట్టి 'బావగారు! కాశీ వెళ్ళడానికి రైల్లో రిజర్వేషన్‌లేకుండా ప్రయాణం చేయడంకష్టమని ముందే రిజర్వేషన్ చేసి ఉంచాను.

క్షేమంగా వెళ్ళి, లాభంగా రండి. ఈలోగా మా అక్కకి మరో సంబంధం చూసి పెళ్ళి చేస్తాం' అంటూ ఓ నవ్వు నవ్వాడు!



నేను గతుక్కుమన్నాను. 'బావుంది వేడుక' అంటూ మా నాన్న సంబరపడిపోయారు! పుస్తె కడుతుంటే 'ఇవాళ ముడులు వేయడానికి నీకు ఆఖరు రోజు. రేపట్నుంచి అమ్మాయి ముడులు వేస్తుంది, నీ పని అవి విప్పడమే నాయనా' అంటూ అక్కడ మూకలోంచి మాటలు తూటాల్లా పేలాయి.

మా ఆవిడ తలంబ్రాలు రెండో రౌండుకే పళ్ళెం తీసి నా బుర్రమీద బోర్లించింది.

బిందెలో ఉంగరం తియ్యడానికి చెయ్యి పెడితే, ఓ రక్కు రక్కి, ఉంగరాన్ని తన్నుకుపోయింది.

చివరికి చదివింపుల దగ్గర మరీ ఆట పట్టించారనుకో!మా బామ్మర్ది ఓ పెద్ద ప్యాకెట్టు తీసుకొచ్చి, బావగారికి అభిమానంతో అని చదివించి,

ఆ ప్యాకెట్లో ఉన్న బహుమతిని అందరికి చూపించాలని పట్టుపట్టాడు. దాన్ని నన్నే ఇప్పమంటే, జబ్బలు పట్టేశాయి. తీరా లోపల ఓ లక్కపిడత బొమ్మ, పాలతిత్తి ఉన్నాయి. అవి చూసి అందరూ ఒకటే నవ్వులు. నాకు మాత్రం తలతీసినంత పనైంది. నాగవల్లి వేడుక ఇంకా జరగనేలేదు.

మా బామ్మర్ది నా దగ్గరకి వచ్చి 'ఏం బావ! పెళ్ళి బాగానే జరిపించాంగా!'' అంటూ ఏకవచన ప్రయోగం చేసి, నా భుజంమీద చెయ్యి వేశాడు. ఇలా క్షణం క్షణం గుర్తుండేలా పెళ్ళి చేశారు!'' అంటూ నరసయ్యగారి మాటల ప్రవాహం ఆగింది.

నాకు మాటలు రావటం లేదు. చిరునవ్వుతో అయన్నే చూస్తూ కూర్చున్నాను.

"ఇప్పుడు చెప్పండి. అలాంటి రోజుని జ్ఞాపకం ఉంచుకోవాలా?'' చాలా సీరియస్‌గా అడిగారు.

ఏం మాట్లాడాలో నాకు తోచలేదు.

కారణం... ఒక్కొక్కసారి నరసయ్యగారిలో హావభావాలను కనిపెట్టడం చాలా కష్టం. అవును, కాదు అనడానికి కూడా సాహసించలేం. ఎందుకంటే ఆయన జవాబు వేరేగా ఉంటుంది.

ఒక్క నిమిషం ఆలోచించి అన్నాను.

"చూశారా! ప్రతీక్షణం, ప్రతీమాట ఇప్పటికీ మీకు గుర్తుండిపోయేలా జరిగింది! అందుకే పెళ్ళంటే నూరేళ్ళ పంట కదా!'' నా మాటలు ఇంకా పూర్తి కాకుండానే...

"నిజం కదా!

ఆ పంటను పూర్తిగా మా ఆవిడతో పంచుకోడానికే నిన్న హౌస్ అరెస్టు అయ్యాను!'' అంటూ నరసయ్యగారు ముసిముసిగా నవ్వుకుంటూ వడివడిగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయారు.

## కోపం వచ్చింది!

తాప్సీ మాటల్లో కాస్త పదును ఎక్కువనే చెప్పుకోవాలి. పైగా ఆమె మాటల్లో కాస్తంత పెడ అర్థాలు కూడా తొంగిచూస్తున్నట్లే వుంటాయి. ఈ అర్థాలపై ఆమె క్లారిటీలు ఇస్తూనేవుంటుంది.

ఈ మధ్య మరోమారు ఇటువంటి ఇరకాటమే తాప్సీకి ఎదురైంది. తన ట్విట్టర్‌లో పెళ్ళికి సంబంధించి కొన్ని వ్యాఖ్యానాలతో పోస్టింగ్ పెట్టింది. ఇది చూసి ఓ సామాజికమాధ్యమం ఓ అడుగు ముందుకు వేసి తాప్సీ పెళ్ళికి 'ఎస్' అంటున్నదంటూ వార్తలు ప్రచారం చేసింది.

దీంతో సొట్టబుగ్గల అమ్మడికి కోపం వచ్చేసింది. ఇక ఆపండి, నిజమైన వార్తలు రాయండి అంటూ సదరు మీడియాకు వార్నింగ్ ఇచ్చిందట.

"పెళ్ళికి 'నో' చెప్పకండి అంటే నేను 'ఎస్' చెప్పినట్లా?'' అంటూ రుసరుసలాడింది.



# నేనెవరో తెలుసా!

ఈ క్రింది ప్రశ్నలకు సమాధానాలు ఇన్‌లాండ్ కవర్‌పై రాసి స్వాతి చిరునామాకు 24 మార్చి 2018 తేదీలోగా పంపించండి.

కరెక్టు సమాధానాలు రాసినవారిలో లాటరీ పద్ధతి ద్వారా ఒకరిని విజేతగా ఎంపికచేసి ₹ 500/- నగదు బహుమతిని అందజేస్తాం.

సమాజంలో ఎన్నో సమస్యలుంటాయి. అటువంటి సమస్యలను అసమానతలను విద్యతో పోగొట్టగలమనుకున్నారు. అది చాలావరకు సాధ్యమైంది. అవగాహన పెంచితే మరికొన్ని పరిష్కారం కాగలవన్నారు. వీటన్నిటినీమించి నేటి సమస్యలన్నింటికీ పరిష్కారం టెక్నాలజీలో వుందనేది నమ్మకం. సిబ్బంది అవినీతికి విరుగుడు కంప్యూటర్ రిజర్వేషన్ అనుకుంది రైల్వేశాఖ.

కాంట్రాక్టర్ల అవినీతికి విరుగుడు ఈ బిడ్డింగ్ అంటున్నాయి ప్రభుత్వాలు. ఇలా ప్రతిదాన్ని టెక్నాలజీతో అధిగమించగలమని నేడు పాలకులు అనుకుంటున్న విషయాన్ని ఎనభై ఏళ్ళక్రితమే ఒక భారతీయ రచయిత చెప్పాడు.

ఆ విషయం చాలామందికి తెలియదేమో కాని ఆ రోజుల్లో ఆయన ఆ విషయం చెప్పినప్పుడు అది సాధ్యం అయ్యే విషయమా! అనుకున్నారు అప్పటి పెద్దలు. అయితే ఆయన ఊహించినట్టే సమాజం మారింది. చట్టాలు అవీ వచ్చాయి.

చివరికి ఒకనాటి హీనమైన వృత్తి అంతమైంది. అటువంటి మార్పును తన రచనల్లో చూపించిన ముందుచూపు ఆయనది. ఆ కాలంలో కుల వ్యవస్థ మరింత స్థిరంగా వుండేది. ఒకరితో ఒకరు మాట్లాడేందుకు వీలు లేదు. తాకేందుకు, కలిసి భోజనం చేయటానికి సమాజం అంగీకరించేది కాదు.

ఎవరైనా ఆ కట్టుబాటును ధిక్కరిస్తే వారిని కులంలోనుండి వెలివేసేవారు. ఆ పరిస్థితిలో తన బంధువు ఒకామె పరాయి మతం అమ్మాయితో కలిసి భోజనంచేసిందని కులంలోనుండి వెలివేస్తే, ఆ అవమానం తట్టుకోలేక ఆమె ఉరివేసుకుని ఆత్మహత్య చేసుకుంది.

ఆ సంఘటన అతన్ని కదిలించి వేసింది. సమాజంలోని అట్టడుగు వర్గాలవారి బాధలు అర్థంచేసుకోవటం మొదలుపెట్టాడు. ఆ రోజుల్లో మలాన్ని సేకరించి తలమీద పెట్టుకుని తీసుకువెళ్ళే వృత్తిలో కొందరుండేవారు. అటువంటివారి సమస్యకి పరిష్కారంసమాజం, నేతలు చూపించలేరని, దానికి పరిష్కారం కొత్తగా వచ్చిన టెక్నాలజీనే చూపిస్తుందని తన నవలలో చెప్పి, అదే 'ఫ్లషింగ్ టెక్నాలజీ' అని చూపిస్తాడు ఆ నవలలోని ప్రధాన పాత్రకు. ఆయన ఏం చెప్పాడో ఆ తర్వాతి కాలంలో అలాగే జరిగింది.

అవిభక్త భారతదేశంలో పుట్టాడు ఆ రచయిత. పెషావర్‌లో పుట్టినా చదువుకున్నది అమృతసర్‌లో. 1919లో జలియన్‌వాలాభాగ్ సంఘటనకు దేశమంతా అట్టుడికింది. టీనేజ్‌లో వుండి ఈయన స్వాతంత్ర్య ఉద్యమంలోకి దూకి, బ్రిటీష్ పోలీసుల దెబ్బలు తిన్నాడు, స్వల్పకాలం జైలుకు వెళ్ళాడు.

ప్రశాంత ఉద్యమాన్ని పోలీసు జులుంతో భయపెట్టేవారిమీద తిరగబడాల్సిందేననుకున్నాడు. పోలీసులు తనమీద కన్నువేసి వుంచారని, మరల అరెస్టు చేస్తారనే ఆలోచనతో దేశం వదిలి లండన్‌కి వెళ్ళిపోయాడు. 1920ల్లో ఇంగ్లండ్ వెళ్ళినప్పుడు ఆయన దగ్గర తగినంత డబ్బు లేదు.

పేదరికం వెంటాడింది. అయినా చదువుకోవాలన్న తపనతో హోటల్‌లో సర్వర్‌గా పనిచేస్తూ లండన్‌లో చదువుకున్నాడు. కేంబ్రిడ్జి నుండి ఫిలాసఫీలో ఇప్పటికి 90 ఏళ్ళ క్రితం డాక్టరేట్ సంపాదించాడు. ఐరోపాలోని ఇతర దేశాలలో లెక్చర్స్ ఇచ్చాడు.

ఇంగ్లండ్‌లో వుండగానే ఒక విదేశీ నటితో ప్రేమలో పడి ఆమెను పెళ్ళాడాడు. తొమ్మిదేళ్ళ కాపురం, ఒక కూతురు... ఆపైన విడాకులు.

బ్రిటన్‌లోని ప్రముఖులు భారతదేశం గురించి తక్కువచేసి మాట్లాడటం ఆయనకు నచ్చలేదు. గాంధీ సమాజాన్ని పాడుచేస్తున్నారని భారతీయులకు పాలన చేతకాదన్న వారి మాటలను తిప్పికొట్టాలంటే భారతీయ సమాజంగురించి రచనలు చెయ్యాలి.

అదికూడా ఇంగ్లీషువారికి అర్థమయ్యే భాషలో చెయ్యాలని ప్రయత్నం చేశాడు. తొలి పుస్తకంతోనే మంచి గుర్తింపు సంపాదించాడు.ఇంగ్లీషులో మంచి పేరున్న రచయిత ఛార్లెస్ డికెన్స్ రచనల స్థాయి ఈ భారతీయ యువ రచయితకు వుందని మెచ్చుకున్నారు. ఆ కాలానికి అది ఒక గొప్ప సర్టిఫికేట్.

లండన్‌లో వున్నరోజుల్లో భారతదేశ స్వాతంత్ర్య ఉద్యమంగురించి, భారతదేశానికి స్వాతంత్ర్యం ఇవ్వాల్సిన అవసరంగురించి విరివిగా ప్రచారంచేశాడు. ఆయన మిత్రుడు, ఆ తర్వాతి కాలంలో నెహ్రూ మంత్రివర్గంలో కీలక మంత్రి అయిన వి.కె.కృష్ణమీనన్‌తో కలిసి లండన్‌లో భారత్ అనుకూల కార్యకలాపాలు చేశాడు.

అన్ని దేశాలకు స్వాతంత్ర్యం ఇవ్వాలి.వలస పాలన అంతమవ్వాలన్నది ఆయన కోరిక.

అందుకే స్పెయిన్‌లో జరుగుతున్న ప్రజా పోరాటానికి మద్దతుగా ఆ దేశం వెళ్ళి, వారికి అనుకూలంగా

## Real leaders are mentors

జర్నలిస్ట్ కథనాలను బయటి ప్రపంచానికి అందించాడు. ఆయన రచనలను దాదాపుగా ప్రముఖులందరూ గౌరవించి, స్వాగతించారు. రెండవ ప్రపంచ యుద్ధ సమయంలో ఆయన బి.బి.సి.కి స్క్రిప్ట్ రైటర్‌గా పనిచేశాడు.జార్జి ఆర్వెల్, ప్రముఖ చిత్రకారుడు పికాసోలకు ఆప్తుడయ్యాడు.

భారతీయులు ఇంగ్లీషులో రాయుటమా అనుకున్న ఆర్వెల్ వంటివారుకూడా ఆయన రచనలు బాగున్నాయి, భారతీయ సంస్కృతిని అర్థంచేసుకునేందుకు ఆయన రచనలు సహాయపడతాయని మెచ్చుకున్నాడు. పికాసో అయితే తన చిత్రాలను ఆయనకు బహుమతిగా అందించాడు.

1946లో భారతదేశానికి తిరిగి వచ్చి తన రచనా వ్యాసాంగాన్ని కొనసాగించాడు. పలు విశ్వవిద్యాలయాలలో విజిటింగ్ ఫ్యాకల్టీగా లెక్చర్స్ ఇచ్చాడు, ఒక సాహిత్య పత్రికను నడిపాడు.

ఇంటర్నేషనల్ ప్రోగ్రెస్ ఆర్గనైజేషన్ (ఐ.పి.ఓ)తో సంబంధాలు కలిగివుండి, వామపక్ష భావజాలాన్ని పెంచుకున్నాడు. ప్రత్యక్ష రాజకీయాలతో సంబంధాలు పెట్టుకోకపోయినా, భారతీయ సమకాలీన సామాజిక, రాజకీయ అంశాలమీద తన పంథాలో వ్యాసాలు రాస్తూ, ప్రసంగాలుచేస్తూ దేశంలో పర్యటనలు చేస్తూండేవాడు.

జాతీయ నాయకులు గాంధీ, ఠాగూర్, నెహ్రూ వంటివారి జీవితాలు, భారతదేశానికి వారు చేసిన సేవలు వంటి అంశాలు వున్నాయి ఆయన ప్రసంగాలలో. భిన్న నాగరికతల మధ్య సంవాదం లేదా సంభాషణ అవసరంమీద ఆయన ఒకవేదికమీదచేసిన ప్రసంగం విలువైనదిగా ప్రపంచం స్వీకరించింది.

'మానవతావాదం' అన్ని వాదాలకన్నా మేలైన వాదమన్నది ఆయన మాట. ఆ అంశం ఆధారంగానే తన రచనలవన్నింటినీ చేసేవాడు. ఇంగ్లీషులో రాసిన భారతీయులలో ఆర్.కె. నారాయణ, రాజారావులతోపాటుగా ఈయన పేరును ప్రపంచం గుర్తుపెట్టుకుంది. 98 సంవత్సరాలపాటు జీవించిన ఆయన పునాలో మరణించాడు.ఇంతకీ...

*1. ఆ రచయిత ఎవరు?*

*2. ఆయన తొలి సంచలన నవల పేరు?*

---

**సా!**

9.3.2018 సంచికలో ప్రచురించబడిన 'నేనెవరో తెలుసా!' శీర్షిక సమాధానాలు:

1. అన్నాప్రగడ కామేశ్వరరావు.
2. నాదెండ్ల (గుంటూరు జిల్లా).

విజేత : జె.హారిక,
D/o. వేణుమాధవ్, లెనిన్‌నగర్,
గుణదల, కృష్ణాజిల్లా.

# ఒక చిన్నమాట

రాజకీయనాయకుల గురించి, మంత్రుల, ప్రధానమంత్రుల గురించి ఎన్ని పరిహాసాలు, ఛలోక్తులు వినవస్తాయో అంతకు దీటుగా బ్యూరోక్రసీ (పరిపాలనలోని అధికారులు) గురించి అన్నిరకాల ఛలోక్తులు, పరిహాసాలు ప్రాచుర్యంలో ఉంటాయి. విన్‌స్టన్ చర్చిల్ రాజకీయ నాయకునికి కావల్సిన లక్షణాలగురించి ఈ విధంగా చెపుతారు.

"రేపు ఏమి జరుగుతుంది,రాబోయే వారం, రాబోయే నెల, రాబోయే సంవత్సరం ఏమి జరుగుతుందో ముందే చెప్పగలగాలి. ఆ తరువాత ఆ విధముగా ఎందుకు జరగలేదో విశదీకరించగలగాలి"

కొంచెం మార్పులు చేర్పులతో ఈ మాటలు బ్యూరోక్రసీకి అన్వయించుకోవచ్చు. నేర్పరితనం అత్యంత అవసరం. ముఖ్యంగా రాజకీయనాయకులకు, పదవులలో ఉన్నవారికి అతి దగ్గరగా పని చేయటమంటే కత్తిమీది సాము అనుకోవచ్చు.

బ్యూరోక్రాట్స్ గురించి చెణుకులు కూడా తక్కువగా లేవు. ఇవి అధికారులకు మార్గదర్శకాలట.

1) ఏదైనా చేయవలసివచ్చినపుడు ఆలోచించు, 2) ఏదయినా ఇబ్బంది ఎదురయ్యేటట్లయితే ఆ పని ఇతరులకు అప్పగించు, 3) సందేహం ఉన్నప్పుడు అస్పష్టంగా మాట్లాడు.

అధికారుల పనుల నిర్వహణ గురించి పార్కిన్‌సన్ చెప్పినంత సూటిగా, గురితప్పని తీరులో మరెవ్వరూ చెప్పలేదనుకోవచ్చు. దానిని 'పార్కిన్‌సన్స్ లా' అని పిలుస్తారు. దీనిప్రకారం ఒక పని పూర్తి చేయటానికి ఎంత సమయం మనముందు ఉంటే అంత సమయమూ పని విస్తరిస్తుంది. సి. నార్త్ కోట్ పార్కిన్‌సన్ మరోమాట కూడా అన్నారు-

"ముఖ్యమయిన నిర్ణయాలు తీసుకొనే అవకాశం పొందని వ్యక్తి తాను తీసుకొన్న నిర్ణయాలే ముఖ్యమనుకొంటాడు" ఈ మాటలు కేవలం ఉద్యోగస్తులకే కాదు, ఎవరికైనా అన్వయించుకోవచ్చు.

అభివృద్ధి చెందిన దేశానికి సంబంధించిన ఒక మంత్రి ఒక అంతర్జాతీయ సమావేశంలో అభివృద్ధి చెందుతున్న దేశం నుండి వచ్చిన మంత్రితో కలివిడిగా మాట్లాడాడు. ఇద్దరికీ స్నేహం కుదిరింది.

సమావేశం జరిగేది తమ దేశంలోనేగనుక అభివృద్ధి చెందిన దేశం మంత్రి తన కొత్త మిత్రుడిని తన ఇంటికి ఆహ్వానించాడు. ఆ ఇల్లు, ఆ పరిసరాలు, విలువైన వస్తువులు చూసి పేద దేశం మంత్రి ముగ్ధుడయ్యాడు.

"మీదెంత సంపన్న దేశమైనా మీకు వ్యక్తిగతంగా ఇంత సంపద సాధ్యమా?" అని ఆశ్చర్యపోయాడు.

ఆ మంత్రి తన కొత్త మిత్రుని బాల్కనీలోకి తీసుకువెళ్ళాడు. "అదిగో చూడండి. దూరాన ఎంతో అందంగా దీపాలతో మెరిసిపోతున్న వంతెన కనిపిస్తోందా?" అని అడిగాడు.




"అవును. చాలా అందమయిన వంతెన నిర్మాణానికి చాలా ఖర్చయివుంటుంది"

"ఆహా, చాలా ఖర్చే. అంచనాకు మించినది. అందులో యాభైశాతమే ఈ ఇల్లు."

కొన్నేండ్లకు ఈ మిత్రులు మరో సమావేశంలో కలిశారు.

ఈసారి అభివృద్ధి చెందుతున్న దేశం ఆతిథ్యం ఇచ్చింది. పేద దేశం మంత్రి, ధనిక దేశం మంత్రిని తన ఇంటికి ఆహ్వానించాడు.



డాక్టర్ జె.భాగ్యలక్ష్మి
E-mail: jbhagyalakshmi43@yahoo.in

కొస్త చిన్నచూపుతోనే ధనిక మిత్రుడు ఇతని ఇంటికి వచ్చాడు. ఇల్లుచూసి నోరెళ్ళబెట్టవలసిన పరిస్థితయింది. కథల్లో, ఊహల్లో ఉండే రాజనగరులా ఉంది. రాజప్రాసాదంలో భోజనం చేసినట్లనిపించింది. ధనిక దేశం మంత్రి, తన మిత్రుని అడిగాడు.

"మీదింకా అభివృద్ధిచెందుతున్న దేశంకదా! ఇంత విలాస జీవితం ఈ దేశంలోని మంత్రికి సాధ్యమా?"

తన మిత్రుడిని, పేద దేశం మంత్రి ఒక పెద్ద కిటికీ దగ్గరకు తీసుకువెళ్ళాడు. "అటు చూడండి. ఆ గుబురు చెట్లమీదుగా, అదే ఆరులేన్ల హైవే. మంచి క్వాలిటీ" అని నవ్వాడు.

"రోడ్డేదీ?" అని ఈయన అడిగాడు.

"నూటికి నూరుశాతం" అని తన దివ్య భవంతిని చూపించాడు మంత్రి. ఇదే కథనాన్ని కొద్దిగా మార్చి బ్యూరోక్రాట్స్ గురించి కూడా చెప్పుకుంటారు.

వీరందరికీ సంబంధించిన పరిహాసాలు నవ్వుకోటానికే. బిబిసిలో 1980, 1990 దశకాలలో "యస్, మినిస్టర్", "యస్, ప్రైమ్ మినిస్టర్" అనే సీరియల్స్ ప్రపంచవ్యాప్తంగా ఆదరణ పొందాయి.

మంత్రులది, అధికారులది చిత్రమైన సంబంధం. కాని ఫిబ్రవరి ఆఖరి వారంలో ఢిల్లీలో ముఖ్యమంత్రి కేజ్రీవాల్ సమక్షంలో ప్రభుత్వ చీఫ్ సెక్రటరీ అంశు ప్రకాశ్‌మీద పదకొండుమంది ఆప్ ఎం.ఎల్.ఏ.లు భౌతికంగా దాడి చేసి ఆయనను అవమానపరచారు.

అది అధికారులనే కాదు, ప్రజలలో అన్ని వర్గాలవారినీ ఆందోళనకు, అశాంతికి గురిచేసింది.

అధికారులు సమ్మెచేసి క్షమాపణ చెపితేగాని పనికి వెళ్ళమన్నారు. లెఫ్టినెంట్ గవర్నరు ఇరుపక్షాలకూ నచ్చజెప్పారు. ఎఫ్.ఐ.ఆర్. కూడా దాఖలా అయింది. ఇద్దరు ఎమ్.ఎల్.ఏ.లను కస్టడీలోకి తీసుకొన్నారు.

వీరు తమ కులాన్ని అవమానించారని, తమ మతంమీద పగ అనీ అర్థం లేని మాటలు ప్రచారంలోకి తెచ్చారు. అసలు విషయం వీరికి శిక్ష పడుతుందా లేదా అని కాదు, రాజకీయాలు ఇంతగా దిగజారిపోవాలా?

ఒక సీనియర్ ఐ.ఏ.యస్. ఆఫీసర్ రాజస్థాన్‌గురించి చెపుతూ ఒక మంత్రి ఒక అధికారికి చెంపదెబ్బ కొట్టాడని ఆనాటి ముఖ్యమంత్రి భైరవ్‌సింగ్ షెకావత్, ఆ మంత్రినే పదవినుండి తొలగించారన్నారు.

ప్రజలచే ఎన్నుకొన్నబడ్డవారు అంటే అందరికీ గౌరవమే. వారూ నాగరిక సమాజంలో ఎదుటివారిని గౌరవించి గౌరవం పొందే స్థానంలో ఉండాలి.

అధికారులు తమ నౌకర్లు అన్న మనఃస్థితి కొందరు అనాగరికులకు ఉంటుంది.

కేజ్రీవాల్ స్వయంగా ప్రభుత్వాధికారిగా ఉండి రాజకీయాలలోకి వచ్చినా చిత్రంగా ఆయన తన అధికారులతో సవ్యంగా పనిచేసినట్లే కనిపించదు. ఎప్పుడూ అందరిమీదా ఫిర్యాదులే. నాట్యం రాని వాడు నేల బాగలేదు అన్నట్టు వుంటుంది.

రాజకీయనాయకులు, అధికారులు కూడా ప్రజాక్షేమంకోసం పనిచేస్తే తగాదా ఎందుకు? మంత్రులు, అధికారులు పరస్పర పూరకాలు కదా!

# ఎంతో పరిణతి వచ్చింది

గ్లామర్ నిష్పత్తిని ఒక్కో దశగా పెంచుకుంటూపోతోంది రకుల్ ప్రీత్‌సింగ్. సినిమాల్లో విరజిమ్మే అందాలతో ఓపక్క మత్తెక్కిస్తూనే, ఫోటో షూట్‌లతో మరింత ఉక్కిరిబిక్కిరి చేస్తున్నది. తెలుగు నాట దూసుకు పోతూ, మరోమారు బాలీవుడ్‌లోనూ చక్కెరలు కొడుతున్నది. ఆమెతో ఇంటర్వ్యూ విశేషాలు :



**ఇంతటి తరగని అందాల రహస్యం ఏమిటంటారు?**

ఇదంతా నా దృఢనిశ్చయం, విల్ పవర్‌వల్ల సాధ్యపడిందని భావిస్తున్నాను. అన్నింటికంటే ముఖ్యంగా నాలోని అనుకూల దృక్పథం, హార్డ్ వర్క్‌చేస్తే ఏదైనా సాధ్యపడుతుందనేది నా అభిప్రాయం.

అదే నేను అత్యంత కాన్ఫిడెంట్‌గా ఫీలవడానికికారణంగా భావిస్తున్నాను.

**తిరిగి మీరు హిందీ సినిమాల్లోకి రావడం ఎలాఉంది?**

దీన్ని తిరిగిరావడం అని నేను అనుకోను. ఇక్కడ పనికి విరామం ఇచ్చి వుండవచ్చు. కాని నా జీవితంలో నేను ప్రతిరోజూ షూటింగ్‌చేస్తూనే వున్నాను. ఇదో గొప్ప సంగతి.

**'అయ్యారే' అనుభూతులేంటి?**

మంచిటీమ్‌తో పనిచేశాను. దర్శకుడు నీరజ్ పాండేసర్ తనకు తానే ఓ సంస్థ. ఎంతో మంచి అనుభవం, విజ్ఞానం, ఆయన మంచి అబ్బాయి. ఓ వ్యక్తిగా ఆయన నుంచి ఎంతో నేర్చుకోవచ్చు.



**సిద్ధార్థ్ మల్హోత్రా సంగతో?**

అతను ఢిల్లీ అబ్బాయి.మాదీ ఢిల్లీనే. కొద్ది రోజుల తర్వాత కాని మేం ఇద్దరం ఒకే నగరానికి, డిఫెన్స్ కాలనీకి చెందిన వారమని తెలియలేదు. అంటే పక్క పక్క వీధుల్లో ఉండేవారం అట. హార్డ్ వర్కర్. నేలమీదుండే తత్వం.

**బాలీవుడ్‌లో కొనసాగుతారా?**

మంచి సినిమాల్లోపనిచేయాలన్నదే నా కోరిక. అది తెలుగు, తమిళం, హిందీ ఎక్కడైనా కావచ్చు. పదేళ్ళు వెనక్కుతిరిగి చూస్తే నా కిట్టీలో అన్నీ మంచి సినిమాలే వున్నాయి. కెమెరా ముందుండడం నాకు ముఖ్యం.

**సినిమాలఎంపికలో మీప్రాధాన్యం?**

స్క్రిప్టు ముఖ్యం. ఒకటే పని మళ్ళీ మళ్ళీ చేస్తుంటే జీవితంలో ఎగ్జయిట్‌మెంట్ వుండదు. ప్రతిరోజూ కొత్తదనం కావాల్సిందే. ఏ విషయాన్నీ నేను అతిగా ఆలోచించలేను.

**మీరు ప్రణాళికలు వేసుకోరా?**

ఈవిషయంలో నాదికొంచెంఆధ్యాత్మికమార్గం. చాలామంది ప్రణాళికలు వేసుకుంటారు. కాని, వాటిని మర్చిపోతుంటారు. దీనివల్ల వర్తమానాన్ని స్ట్రీమ్‌లైన్ చేసుకోవడానికి అవసరం అయిన శక్తిని కోల్పోతుంటారు.

నా నియంత్రణ ఉంటే ప్రణాళిక దానంతట అదే రూపుదిద్దుకుంటుందనేది నా అభిప్రాయం. దక్షిణాదిలో సినిమాలు ఆరంభించాలన్న నిర్ణయం ప్లాన్‌చేసుకుని తీసుకున్నది కాదు.

నాకెప్పుడూ ఒక్కటే లక్ష్యం వుంటుంది- నేనేం చేసినా దాన్ని బాగా చేయాలన్నది. జీవితంలో స్ట్రగుల్ అవలేను. ఫిఫ్త్‌గ్రేడ్‌నుంచి నాకు క్లారిటీ వుంది. నేనేం చేయాలని కోరుతున్నదీ నాకు తెలియదు- కాని, నాకేది వద్దు అనేది తెలుసు.

**సినిమాలు చేయాలన్న ఉద్దేశ్యం లేనప్పుడు, ఎలా ఆరంభించారు?**

నేను ఆర్మీ కిడ్‌ను. సినిమాల ఆలోచనతో పెరగలేదు.నాకు 18 సంవత్సరాల వయస్సులో నా మొదటి పోర్ట్ ఫోలియో షూట్ చేశాను. వారంలోగానే కన్నడచిత్రసీమనుంచి కాల్‌వచ్చింది.

నాకు అప్పట్లో దక్షిణాది సినిమాల పట్ల పెద్దఅవగాహనలేదు.ఒకవేళ అక్కడెవరైనా గాడ్‌ఫాదర్ దొరికితే హిందీ సినిమామాత్రమే చేస్తానని మా నాన్నతో చెప్పాను. కొన్నాళ్ళ తర్వాత అదే టీమ్ మా నాన్నకు ఫోన్‌చేసి, నా డేట్ ఆఫ్ బర్త్ చూశామని, నేను పెద్ద స్టార్‌ను





కాగలనని చెప్పారు. నాతో కలసి పనిచేయాలను కుంటున్నట్టు తెలిపారు. నేనా సినిమాచేశాను. ఎందుకంటే అప్పుడు నా పాకెట్‌మనీ నెలకు రెండు వేలు. దానికోసమే చేశాను.

15-20 రోజుల్లో కెమెరా ముందుండడాన్ని నేను ఎంజాయ్‌చేస్తున్నానన్న విషయం అర్థం అయింది. నాలోని మరోకోణాన్ని గుర్తించాను.

కాలేజీ చదువు పూర్తిచేశాక తిరిగి సినిమాల్లోకి రావాలనుకున్నాను. కాలేజీ తర్వాత ముంబయ్ వెళ్ళాను. 'యారియాన్' చేశా. ఇది నా తొలి హిందీ సినిమా. రెండురోజుల తర్వాత తెలుగు సినిమా షూటింగ్ మొదలుపెట్టాను.

***సినిమాల్లో పనిచేయడం ఆరంభించాక ఏ విధంగా మారారని భావిస్తున్నారు?***

నిస్సందేహంగా నేను మారాను. కొన్ని రకాల అనుభవాలతో, కలిసే వ్యక్తులవల్ల తప్పనిసరిగా మార్పు వస్తుంది. నేను ఖచ్చితంగా పరిణతి పొందాను. ఎందుకంటే నేను చాలా ప్రొటెక్టివ్‌గా వుండే వాతావరణం నుంచి వచ్చాను. కంటోన్మెంట్‌లో పెరిగాను. బయటి ప్రపంచం మాకు తెలియదు.

అయితే దక్షిణాదిలో కాని, ముంబయ్‌లో కాని నేను సరైన వ్యక్తులను కలవగలగడం నా అదృష్టం. నాలోని ఆధ్యాత్మికతకూడా నా పరిణతికి దోహదపడింది. చాలా చిన్నతనంలోనే ఓషో చదివాను. ఐదేళ్ళ క్రితంతో పోల్చితే ఇప్పుడు నిర్ణయాలు తీసుకునే ధోరణి బాగా మారింది.

***మూడు ఫంక్షనల్ 45 జిమ్స్ ఆరంభించాలన్న ఆలోచన ఇంకా ఎవరిదైనానా? కేవలం మీదేనా?***

అవును. పూర్తిగా నా ఆలోచనే. ఏదో ఒక వ్యాపారం చేయాలన్న ఆలోచనవుండేది. వాస్తవం మాట్లాడుకుంటే, అదృష్టం బావుంటే ఏడెనిమిదేళ్ళు అంటే ముప్పైలోకి వచ్చేవరకు లేదా ప్రజలు వయస్సు పెరిగి కనపడుతున్నావనేవరకు ఈ పరిశ్రమలో పనివుంటుంది. అందుకే ఏదో ఒక వ్యాపారం కూడా చేయాలనుకునేదాన్ని.

ఎఫ్-45 ఆస్ట్రేలియన్ బ్రాండ్‌కు తొలి ఇండియా బ్రాంచి. నేను ఈ బ్రాండ్‌కు ఎడిక్టయ్యాను. తెలిసిన వారెవరైనా వుంటే ఫ్రాంచైజ్ ఆరంభిస్తారా? అని నన్ను వాళ్ళు అడిగారు. అది నేనే ఎందుకు కాకూడదనుకున్నాను. ఆరోగ్యపూరిత జీవితాన్ని నేను ఎంజాయ్ చేస్తాను. ఫిట్‌నెస్, ఆహారం, సినిమాలు నా జీవితంలో మూడు 'ఎఫ్'లు.

***మగవాడిలోముందుగా మీరుగుర్తించేదిఏంటి?***

అతని ఎత్తు. బహుశా అది నా తొలి ప్రాధాన్యం కావచ్చు. నా ఎత్తు ఐదూ తొమ్మిది. మూడంగుళాల హీల్స్ వేస్తా. నేను మెచ్చే పురుషుడు కనీసం ఆరడుగుల ఎత్తు వుండాలి. ఇక్కడే సగంమంది క్వాలిఫై అవ్వలేరన్నమాట అంటూ ముగించింది.

**అయినపూరి సుజాత**







# WhatsApp

**భార్యాభర్తల బంధం :**
భార్య : బెడ్రూమ్‌లో నుండి "ఏమండీ" అని పిలిచిందంటే బొద్దింకను కొట్టాలని అర్థం.
కళ్యాణమండపంలో "ఏమండీ" అని పిలిస్తే తెలిసినవారొచ్చారని అర్థం.
బట్టల షాపులో "ఏమండీ" అంటే వెతుకుతున్న చీర దొరికిందని అర్థం.
బైక్‌పై వెళ్ళేటప్పుడు "ఏమండీ" అంటే పూలు కొనమని అర్థం.
బీరువాముందు నిలబడి "ఏమండీ" అంటే డబ్బు కావాలని అర్థం.
అద్దంముందు నిలబడి "ఏమండీ" అంటే కొత్త చీరలో తనెలా ఉందో చెప్పమని అర్థం.
నడిచేటప్పుడు "ఏమండీ" అంటే చేయిపట్టుకొని నడవమని అర్థం.
నీవు చివరి శ్వాస తీసుకునేటపుడు "ఏమండీ" అని పిలిచిందంటే "నీతోపాటు నన్నూ తీసుకెళ్ళు" అని అర్థం.
ప్రతి క్షణం "ఏమండీ" అంటూ చంపేస్తోందని అపార్థంచేసుకోటం కాదు.అర్థంచేసుకొని మసలుకుంటే జీవితం సంతోషమయమవుతుంది.
భారతీయ వివాహ వ్యవస్థను లోకమంతా గౌరవిస్తోంది.ఆ గౌరవం నిలపాల్సిన బాధ్యత మనదే.
"ఒకే వ్యక్తితో ప్రతిరోజా ప్రేమలో పడటమే పెళ్ళంటే"

- Silent Letters ఇంగ్లీషులోమాత్రమే వుండవు. తెలుగులో కూడా ఉంటాయి. కూతురుని అల్లుడుతో, అత్తారింటికి మొదటిగా పంపేటపుడు మామగారు అంటారు "బాబూ... జాగ్రత్త..." మధ్యలో "నువ్వు" అనే రెండక్షరాలు సైలెంటే బాసూ...

- చనిపోయినతరువాత దేవుడు అందరినీ పిలిచి మీరు చేసిన తప్పులన్నీ తెల్లకాగితాలపై రాసి ఇమ్మని చెప్పినప్పుడు...
అందరం గుర్తుచేసుకుంటూ రాయటం మొదలుపెట్టాం. ఇంతలో నా వెనుకనుండి ఓ గొంతు. "అరే, కొంచెం చూపించు బే...!!!"
ఫ్రెండ్స్ ఎప్పుడూ ఫ్రెండ్సే.ఎక్కడైనా,ఎప్పుడైనా.

- **ఏనుగు-అరటిపళ్ళు :**
బ్రహ్మానందం : ఒక ఏనుగు దగ్గర పదిహేడు అరటిపళ్ళు పెట్టాను. కానీ అది పదకొండు పళ్ళు తింది. ఒకటి తినలేదు.
వెంగళప్ప : దాని కడుపు నిండిపోయిందేమో!
బ్రాహ్మీ : కాదు, 17వది ప్లాస్టిక్ అరటిపండు.

* * *

బ్రాహ్మీ : ఈసారి 17 అరటిపళ్ళు పెట్టాను. వాటిలో ఒక్కటి కూడా తినలేదు.
వెంగళప్ప : అన్నీ ప్లాస్టిక్ పళ్ళేకదా!
బ్రాహ్మీ : కాదు, ఏనుగు ప్లాస్టిక్‌ది.

* * *

బ్రాహ్మీ : ఈసారి నిజమైన ఏనుగుకు, నిజమైన పళ్ళు పెట్టాను. అయినా తినలేదు. ఎందుకు?
వెంగళప్ప : ఎందుకు?
బ్రాహ్మీ : ఏనుగు టీవీలో ఉంది. పళ్ళు బయట ఉన్నాయి.

* * *

బ్రాహ్మీ : నిజమైన ఏనుగు, నిజమైన అరటిపళ్ళు టీవీలో ఉన్నాయి. అయినా ఏనుగు ఒక్క పండూ తినలేదు. ఎందుకు?
వెంగళప్ప : నావల్ల కాదు, నువ్వే చెప్పు.
బ్రాహ్మీ : ఆ రెండూ వేరు వేరు ఛానల్స్‌లో ఉన్నాయి.



- 6 ఏళ్ళ షర్మిళా తన అన్న వినోద్ ల్యాప్‌టాప్‌తో ఆడుతోంది...
వినోద్: "ఏమే ఎంతసేపూ పక్కవాళ్ళ ల్యాప్‌టాప్ వాడతావు, నీ దానితో ఆడుకోవచ్చుగా? అరే, మర్చేపోయాను. నీకు ల్యాప్‌టాప్ లేదుకదూ!" అంటూ చెల్లి తలపై గట్టిగా కొట్టాడు.
కాసేపాగి చూస్తే షర్మిళ తన మొబైల్‌తో ఆడుతూ కనిపించింది. దాంతో మళ్ళీ వినోద్ "ఎప్పుడూ పక్కవాళ్ళ మొబైల్‌తో ఆడతావే? నీ మొబైల్‌తో ఆడుకోవచ్చుగా? అరే, నీకు మొబైల్ లేదుకదూ?" అంటూ ఆమె తలపై మళ్ళీ చేత్తో కొట్టాడు.
అప్పుడు షర్మిళ : "అన్నా! ఎప్పుడూ పక్కవాళ్ళ తలపై కొడతావే? అరే, మర్చిపోయాను, నీకు బ్రెయిన్ లేదుగా" అంది.
"చిన్నపిల్లలు సముద్రంలాంటివారు, వారిపై ఏది విసిరినా, తిరిగి మనకు చేరుస్తారు".

- "బ్యాంకు ఖాతాదారులు రెండు రకాలు. మొదటి రకం మధ్యతరగతి మనుషులు. వీరి అవసరాలు తీరగా మిగిలిన డబ్బు బ్యాంకులో దాచుకుంటారు. ఆ డబ్బును ఎలా వాడాలన్న "ఐడియా" వారికి వుండదు.
రెండో వర్గం ధనవంతులు. వారిదగ్గర చాలా "ఐడియాలు" ఉంటాయి. ఆ ఐడియాలు ఆచరణలో పెట్టేందుకు వారివద్ద వున్న డబ్బు సరిపోదు. బ్యాంకుదగ్గర అప్పు తీసుకుంటారు.
పై విషయాన్ని గమనిస్తే, డబ్బు దాచుకొని గొప్ప ధనవంతుడైనవాడు ఎవడూ లేడు. అప్పుతీసుకొని బిలియనీర్‌లు అయినవారే ఎక్కువ.
మరి మీరేమంటారు? "ఓ ఫైవ్ (మిలియన్) అప్పిద్దురూ!"

- **గాలిబుడగ జీవితం :**
దివ్యానంద స్వామీజీ తన శిష్యులందరినీ దగ్గరకు పిలిచి ఒక్కొక్కరికీ ఒక బెలూన్ ఇచ్చి వాటిపై వారి పేర్లు రాయమన్నారు. అందరూ రాసినతరువాత వాటిని ఒక గదిలో ఉంచారు.
ఓ పదినిమిషాల తరువాత శిష్యులందరినీ వారి వారి పేర్లున్న బెలూన్లను గదిలోనుంచీ 10 నిమిషాల్లో తెమ్మన్నారు. 200 మంది శిష్యులూ వెళ్ళి తమ బెలూన్లకోసం వెతికారు. ఓ పదిమందికి మాత్రం దొరికాయి. మిగిలినవారు ఉత్త చేతులతో తిరిగొచ్చారు.
స్వామీజీ, ఈసారి శిష్యుల్ని వెళ్ళి ఏ బెలూన్ దొరికితే ఆ బెలూన్ తెచ్చి దానిపై పేరు రాసిన వ్యక్తికి అందజేయమన్నారు.
ఐదునిమిషాల్లో ఎవరి బెలూన్ వారికి చేరింది.
స్వామీజీ అప్పుడు శిష్యులకు వారు చేసిన పని ప్రయోజనాన్ని ఇలా వివరించారు.
"బెలూన్ మన సంతోషానికి గుర్తు. మన సంతోషంకోసం ఎక్కడెక్కడో వెదుకుతాం. కానీ, దొరకదు. అలాకాక ఇతరులను సంతోషంగా ఉంచితే, మనమూ సంతోషంగా ఉంటాం. మనచుట్టూ ఉండేవారికి సంతోషాన్ని ఇస్తే, మనకి సంతోషం దొరుకుతుంది"

# హెల్త్ బిట్స్



## అరటి ఊచ ఔషధమే

అరటిపండ్లు ఆరోగ్యంకోసం తింటారు. అరటి కాయను కూరగా చేసుకుంటారు. అరటి ఆకులో భోజనం ఆరోగ్యకరం.అలాగే వాటితోపాటుగా అరటి ఊచ ఆరోగ్యాన్ని అందిస్తుంది.

అరటికాండం కూరగా చేసుకుని తింటారు. అందులో రుచి లేదనుకుంటారుగాని దానిలో ఎన్నో ఔషధ గుణాలు ఉన్నాయి.

- పిత్తాశయంలో రాళ్ళు ఏర్పడితే విరుగుడుగా ఆహారంలో అరటి ఊచను తీసుకోవాలి. దీనిలో నార ఎక్కువ. అది తింటే కడుపు త్వరగా నిండుతుంది. బరువు తగ్గించటంలో దానికి పాత్ర వుంది.
- కడుపులో మంట అనిపిస్తుంటే అరటి ఊచరసం తీసుకుంటే తగ్గుతుంది. మలబద్ధకాన్ని తొలగించే శక్తి అరటి ఊచకు ఉంది.
- షుగర్ జబ్బుగలవారికి అరటి ఊచరసం తీసుకుంటే మేలుచేస్తుంది.
- రక్తంలో చక్కెర స్థాయిని పెరగనివ్వదు.
- ఎముకలకు బలాన్నిస్తుంది.
- ఇది విటమిన్ బి కాంప్లెక్స్‌ని అందించేది.
- మూత్రనాళ ఇబ్బందులు ఏర్పడినప్పుడు అరటి ఊచరసం తీసుకోగలరు. ◆

## సేంద్రీయ ఆరోగ్యం



కృత్రిమ ఎరువులు వాడి వాడి, పురుగుల మందులు చల్లీ చల్లీ వ్యవసాయం నడిపించారు అర్ధ శతాబ్దంపైన. ఇప్పుడు కృత్రిమ రసాయనాల వ్యవసాయంనుండి తిరిగి శాస్త్రీయ వ్యవసాయంవైపు దృష్టి మళ్ళింది. అంతా 'ఆర్గానిక్ ఫార్మింగ్' చేస్తున్నారు. ఆర్గానిక్‌గా పెంచిన గడ్డిని ఆవులకు ఆహారంగా ఇస్తే ఆవులు ఆరోగ్యంగా, బలంగా తయారవటమే కాదు, ఆ ఆవుల నుండి వచ్చే పాలు తాగితే మనిషి ఆరోగ్యానికి మేలు పెరుగుతుందని. పాలు మంచి పోషక పదార్థాలు. ఆవు పాలు మరీ శ్రేష్ఠం.

అయితే పాలలో ఉండే ఒమేగా-6, ఒమేగా-3 కొవ్వు ఆమ్లాలు ఉంటాయి. వాటి నిష్పత్తిలో ఉండే తేడావల్ల పాలు అధికంగా తీసుకునేవారికి ఊబకాయం, హృద్రోగం వచ్చే అవకాశముంటుంది.

కాని ఆర్గానిక్ గడ్డిని మేసిన ఆవుల పాలలో ఒమెగా-6, ఒమెగా-3 కొవ్వు ఆమ్లాల నిష్పత్తి సామాన్యంగా ఉంటుంది. అలా ఆ కొవ్వు ఆమ్లాలు సరైన నిష్పత్తిలో ఉన్నందున మానవ ఆరోగ్యానికి మేలు చేస్తాయి. వీటి ప్రభావాన గుండె ఆరోగ్యం మెరుగవుతుంది. అంతేకాకుండా జీవక్రియ సంబంధిత వ్యాధులు రాకుండా కాపాడబడతాయి. ◆

## ఈ పరీక్షలు అవసరం



ఇటీవలి కాలంలో మహిళల్లో పెరుగుతున్న క్యాన్సర్‌ల దృష్ట్యా ఒక వయసు అంటే నలభైల తరువాత మహిళలు తప్పనిసరిగా చేయించుకోవాల్సిన పరీక్షలుగా పాప్‌స్మియర్, మామోగ్రఫీలను వైద్యులు సూచిస్తున్నారు. సెర్విక్స్ క్యాన్సర్, రొమ్ము క్యాన్సర్ లను గుర్తించే పరీక్షలు అవి.

గర్భాశయ ముఖద్వారానికి వచ్చే క్యాన్సర్‌ని గుర్తింపుకు చేసే పాప్‌స్మియర్ పరీక్షవల్ల ఆ భాగ క్యాన్సర్‌ని ఐదునుండి పదిసంవత్సరాల ముందుగానే గుర్తించగలుగుతారు. సెక్స్ జీవితం మొదలుపెట్టినతరువాత ప్రతి రెండు మూడు సంవత్సరాలకు ఒకసారి పాప్‌స్మియర్ పరీక్ష చేయించుకోవాలి.

హ్యూమన్ పాపిలోమా వైరస్ పరీక్షను ఐదేళ్ళకు ఒకసారి చేయించుకోవాలి.రొమ్ము క్యాన్సర్ గుర్తింపు కోసం చేసే పరీక్ష మమ్మోగ్రఫీ.

ఇది 40 ఏళ్ళు దాటినప్పటినుండి చేయించుకోవటం మంచిది. కుటుంబంలో గతంలో పెద్దవారు రొమ్ము క్యాన్సర్‌కి గురైవుంటే 40 ఏళ్ళవయసుకన్నా ముందుగానే మమ్మోగ్రఫీ చేయించుకోవటం అవసరం.



ఎవరికి వారు తమ స్తనాలను పరీక్షించుకోవటం నేర్చుకోవాలి. స్తనాలను తాకి, వాటిని నొక్కిచూసుకుని ఏదైనా గట్టితనం కనిపిస్తే ఆ విషయం వైద్యులకు తెలియచేసి పరీక్ష చేయించుకోవటం అవసరం. ◆

## విటమిన్‌తో శిరోజాలు

శరీరం లోపలి ఆరోగ్యం తలమీది శిరోజాలలో ప్రతిబింబిస్తుంది. పోషక పదార్థాలు సరిగా తీసుకుంటే జుట్టు ఆరోగ్యంగా ఉంటుంది. జుట్టు రాలిపోదు.

ఆహారం ద్వారా తీసుకున్న ఇనుము శరీరానికి ఒంటపట్టేలా చేసేది 'సి' విటమిన్. అలా ఇనుము సరిగా చేరితే జుట్టు ఆరోగ్యంగా ఉంటుంది. కాబట్టి 'సి' విటమిన్ సమృద్ధిగా లభించే నిమ్మ, ఉసిరలను ఆహారంలో భాగంగా తీసుకోవాలి.

జుట్టు కుదుళ్ళకు రక్తంద్వారా ఇనుము చేర్చబడాలి. జుట్టు నిర్జీవంగా తయారై కళ తప్పుతున్న దంటే ఇనుప లోపం ఉందని అర్థం.

ఇనుపధాతువుతోపాటు తప్పనిసరిగా 'సి' విటమిన్ అవసరమని గుర్తించండి. అందమైనది, అందాన్నిచ్చేది విటమిన్ 'ఇ' అంటారు. విటమిన్ 'ఇ' లోపం ఉంటే జుట్టు బాగుండదు.



'ఇ' విటమిన్ దొరికితే జుట్టు పొడవుగా పెరుగుతుంది. విటమిన్ 'ఇ' కోసం తప్పనిసరిగా బాదం గింజలు తీసుకోవాలి. విటమిన్ 'ఇ' బయటనుండి జుట్టుకు అందిస్తున్నారు ఇప్పుడు.

విటమిన్ 'ఇ' మాత్రలను కొబ్బరినూనెలో కలిపి తలకు రాసుకుని, ఆ తర్వాత అరగంటకు కడిగేసుకుంటే జుట్టుకు విటమిన్ 'ఇ' లభిస్తుంది. జుట్టుకు రక్తం, ప్రాణవాయువు అందించే పద్ధతి ఇది.

సీరియల్

# సామ్రాట్ సముద్రగుప్త

సి. శివరామమూర్తి

కలర్స్ సురేష్ Kadali

## జరిగిన కథ (9)

భైరవుణ్ణి ఆవాహన చేస్తాడు కాపాలికుడు. యజ్ఞవాటికను బద్దలు చేసుకుంటూ భైరవుడు దర్శనమిస్తాడుచంద్రగుప్తునికి.

ఆ భయంకరాకారాన్ని చూసి స్పృహ కోల్పోతాడు చంద్రగుప్తుడు. స్పృహ వచ్చాక చూస్తే సముద్రగుప్తుడు ఆందోళనగా పలకరించడం చూస్తాడు.

కాపాలికుడు ఓ పక్కన తపస్సమాధిలోఉంటాడు. యజ్ఞవాటిక మామూలుగానే వుంటుంది. తనది కలా?నిజమా అని ఆశ్చర్యపోతాడు చంద్రగుప్తుడు.

కాపాలికుడు సముద్రగుప్తుడిలోని క్షాత్రాన్ని రెచ్చగొడతాడు. తన తల్లి నాగాయకుడివల్ల ఆత్మత్యాగం చేసుకున్న దుర్ఘటన గుర్తుకువచ్చి బాధపడుతుంది లావినియా.

లావినియాను సముద్రగుప్తుడి నుంచి దూరం చేసేందుకు సౌగంధి, సుకన్యలు కుట్ర చేస్తారు. వైశాలీ నగరంలోని నగర పాలకుడు ప్రజాధనాన్ని దుర్వినియోగంచేసినందుకు అత్యంత కఠిన శిక్షను విధిస్తాడు కచుడు. ఆలయం నుంచి నిష్క్రమించిన యువరాజు రాజధానికి ఎందుకు చేరలేదో కచ, కశ్యపులకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

ఇక జరిగేది చదవండి.

ఆందోళనగా ఉన్న మహారాణి కుమారదేవి సముద్రుడ్ని గాలించమని సామ్రాట్‌ను కోరితే, సామ్రాట్ నిమ్మకునీరెత్తినట్టుగా ఏమీపట్టనట్టుగా ప్రవర్తిస్తున్నారట. ఈసారి కచ, కశ్యపులకు అణచుకోలేని ఆశ్చర్యం!

"ఏవో జరుగుతున్నాయ్... వింత వింత సంఘటనలు జరుగుతున్నాయ్! ఇవన్నీ ఏ దిశకూ, ఏ..గమ్యానికి ప్రయాణించబోతున్నాయ్!"

**లా**వినియా ఏకాంతమందిరంలో కూర్చొనివుంది. ఆమె వచ్చి రెండు రోజులు పూర్తి అయింది. యువరాజు సముద్రగుప్తుడు ఆరోజు నుంచి మళ్ళీ దర్శనం ఇవ్వనేలేదు. ఇది లావినియాను ఆశ్చర్యపరుస్తోన్న విషయం.

ఈలోగా రాజనర్తకి సౌగంధిని, పరిచారిక సుకన్య - ఇరువురూ లావినియాను చూడటానికి వచ్చివెళ్ళారు. లావినియా వారితో నోరు విప్పనేలేదు.

మౌనంగా ఉండిపోయింది. ఆమెమౌనం ఆ ఇరువురికి అవమానంగా తోచింది.

'ఏమాత్రం సభ్యత తెలియని అడవిమనిషి' సౌగంధిని, సుకన్యతో రుసరుసలాడింది. సుకన్య సౌగంధినికి మరో నాలుగుమాటలు అంటించి ఆమె అక్కసును మరింత పెంచింది. అయితే సుకన్యకు మనసులో ఆనందం 'ఇంత కాలమూ సౌగంధినికి విర్రవీగే గర్వం. తనంత అందగత్తె ఎవరూలేరని! అంతేకాదు తోటివారిని చులకనగాచూసి గాయపరచిన సందర్భాలు లేకపోలేదు.

సౌగంధినికి, లావినియాను చూసి నప్పటినుంచి సూర్యుడి ముందు చంద్రుడు తేజోవిహీనమయిన అనుభూతి. లావినియా అద్భుత సౌందర్యానికి సౌగంధినిలో అపూర్వసంచలనం.

మహా సౌందర్యవతి అయిన తనకే లావినియాను చూస్తున్నప్పుడు ఇంతటి అసూయ జ్వాలలు చెలరేగుతున్నాయంటే, మగవాడైన ఆ యువరాజుకు సాక్షాత్తు మతిభ్రమణం కల్గినా తానాశ్చర్యపోదు!

'ఆపదలో ఉన్నదట. సముద్రగుప్తుడి ఆశ్రయాన్ని కోరిందట. ఏమిటో ఆ ఆపద. వివరాలు తెలియదు. వెళ్ళి పలకరిస్తే నోరు విప్పదు. ఇంతకుమించిన అవమానం ఏముంటుంది. ఆమె కళ్ళకు తాను గడ్డిపోచతో సమానంకాబోలు'

సౌగంధిని మనసు భగభగమని మండుతోంది. 'ఈ మధ్యకాలంలోనే యువరాజు సన్నిహితమవుతున్నాడని ఆనందిస్తూంటే, ఈ ఆనందం కాస్తా క్షణికమయింది.

లావినియా కనుక ఈ ప్రాసాదంలో శాశ్వతంగా ఉండిపోతే, తాను ఆమె అడుగులకు మడుగులు ఒత్తే పరిచారికగా మారవలసి ఉంటుంది'

ఇవి సౌగంధిని ఆలోచనలు.

సుకన్య క్రితం రోజునే చెవిలో ఊదింది. 'తన సమస్యను ఎలా విరుగుడు చేయాలో!'

ఈసారి సౌగంధిని, సుకన్య తోడు లేకుండా ఒంటరిగా లావినియా మందిరానికి చేరింది. ఈసారి లావినియా కళ్ళెత్తి సౌగంధినిని చూసి ఒక లిప్తకాలం చిరునవ్వును అనుగ్రహించింది.

సౌగంధినికి ఈ చిన్న ఊతంచాలు, అల్లుకుపోగలదు. సౌగంధిని తల వంచింది వినయంగా "లావినియా! మీ అపూర్వ సౌందర్యానికి నీరాజనాలు ఇస్తున్నాను" అంది.

ఒక స్త్రీ మరోసాటి స్త్రీ సౌందర్యాన్ని పొగడటం అనేది ఒక అత్యద్భుత విషయం. అదీ రాజనర్తకి సౌగంధిని నుంచి వచ్చిన ప్రశంస ఇంతకుమించి లావినియా సౌందర్యానికి ప్రశంసాపత్రం ఏం కావాలి?

లావినియా ఈసారి హృదయం లోంచి నవ్వింది. ఎందుకనో తెలియదు కాని, లావినియాకు సౌగంధిని అంటే స్నేహభావం ఏర్పడింది.

"మీ స్నేహం కోసం ఉవ్విళ్ళూరుతున్నాను. మీ అనుగ్రహం సంభాషణ కోసం పరితపించిపోతున్నాను. మీ సౌందర్యాన్ని ఇంతవరకూ పురుషులే ఆరాధించే వారనుకుంటాను. కానీ ఈరోజున మీ సౌందర్యాన్ని ఆరాధించే మొదటి స్త్రీను నేను"

సౌగంధిని మెత్తటి మాటలు, ఈ అపూర్వ ప్రశంసలకు లావినియాలో తన్మయం, మైకం కమ్ముకున్నాయి. పైగా ఈ పొగడ్తలు సామాన్యమయినవా! అందులో సౌగంధినివంటిమరో సుందర స్త్రీనుంచి.

సౌగంధినికి ఈ సరికే అర్థం అయింది 'లావినియాకు తను అంటే స్నేహభావం ఏర్పడింది'

మళ్ళీ అన్నది లావినియాతో



# మలయాళంపై మక్కువ

ఆరేళ్ళకుపైగా దక్షిణాదిలో పాగావేసిన ముంబయ్ తార ఇషా తల్వార్ కేరళకు మకాం మార్చేయబోతున్నది. దక్షిణాదిలో ముఖ్యంగా మలయాళంలో మరిన్ని సినిమాలు చేయాలన్నది తన కోరిక అంటున్నది.

"నేను ఆరేళ్ళుగా మలయాళం సినిమాల్లో నటిస్తున్నాను. భాష బాగా వచ్చేసింది. ఇక్కడ లభించే పాత్రలు కూడా చాలా ప్రత్యేకంగా ఉంటున్నాయి. నా ప్రతిభను చూపగల అవకాశం లభిస్తోంది. కేరళలోని ప్రతి ప్రదేశం నాకు తెలుసు.

సినిమా షూటింగ్‌లకోసం విస్తృతంగా పర్యటించాను. కేరళ సంస్కృతి, ఆహారం బాగా వంటబట్టాయి. మాలీవుడ్ ప్రతిభకు పట్టంకట్టే పరిశ్రమ. కొన్నాళ్ళపాటు ఇక్కడే పనిచేయాలని కోరుకుంటున్నా" అని చెప్పింది.



"ఎక్కడయినా నల్లని వజ్రం గురించి విన్నారా?" అన్నది సౌగంధిని.

తల అడ్డంగాఊపింది లావినియా అదోలా చూస్తూ.

"ఇదిగో మీరే ఆ నల్లని వజ్రం"

లావినియా విస్మయంగా చూసింది. "నల్లని వలువలలో కాంతులీనుతూ ఆ నలుపుకే తేజస్సును సంతరిస్తోన్న ఆవజ్రం మీరే లావినియా!"

'అయిపోయింది' ఈసారి లావినియా పూర్తిమైకంలోపడింది. ఈసారి పలువరసలు తళుక్కు మనేంతమేరగా నవ్వింది లావినియా. సౌగంధిని మరింతగా పుంజుకొంది.

"ఇంతకీ ఈ చంద్రుడ్ని కప్పిన మబ్బులవైనం ఏమిటో"

ప్రశ్నార్థకంగాచూసింది లావినియా. "లావినియా ఆపదలో ఉన్నారని వార్త. అంతవరకే తెలుసు"

హఠాత్తుగా లావినియా మొహంలో నీలినీడలు.సౌగంధిని బాధపడుతున్న దానిలా తలవంచి "క్షమించాలి. మీకు ఏదైనా గుర్తుచేసి మీ మనస్సు నొప్పిస్తే ఈ నేరస్తురాలిని క్షమించండి" అంది.

లావినియా తల అడ్డంగా తాటించింది. కొంతసేపయ్యాక సౌగంధిని "లావినియా! ఒక్కసారి మీ కంఠ స్వరాన్ని వినాలని కోరుకుంటున్నాను"

మరోసారి స్నేహంగా చూసింది లావినియా "మీ పేరు చెప్పనేలేదు" మంద్రంగా అడిగింది.

వీణను ఆలపిస్తున్నట్లుగా ఉంది లావినియా కంఠస్వరం.

సౌగంధినికయితే లోపల ఏడుపు వస్తోంది. 'భగవంతుడు ఈమెకుసౌందర్యాన్నే కాదు, అద్భుతమైన సుస్వరాన్ని కూడా ప్రసాదించాడు"

"అవునవునూ ఇంతవరకు నాపేరు చెప్పుకోలేదు కదూ! నాపేరు సౌగంధిని. రాజనర్తకిని"

"అవును మిమ్మల్ని చూస్తూనే అనుకున్నాను సౌగంధినీ! నాట్యాన్ని ఆరాధించేవాళ్ళకు సొగసు ఉంటుంది. ఆ సొగసు మీలో ఉన్నది"

"నిజంగానా"

"అవును సౌగంధినీ"

'లావినియా తనకొక ప్రశంసాపత్రాన్ని ఇచ్చింది. తనలో ఏదో సొగసు ఉన్నదట' ఒక్కక్షణం పన్నీటి జల్లులా తోచింది సౌగంధినికి.

మాటమారుస్తూ "ఇంతకీ మీకొచ్చిన ఆపదను చెప్పనేలేదు. మీ ఆంతరంగికులమయ్యే అనుగ్రహాన్ని ప్రసాదించమని వేడుకుంటున్నాను లావినియా!"

ఈమాటలకు లావినియా పూర్తిగా వశురాలయి పోయింది.

"నాతల్లిదండ్రుల్ని చంపిన కిరాతకుడ్ని హతమొనర్చాలని నాసంకల్పం. అందుకోసం యువరాజుని ఆశ్రయించాను" క్లుప్తంగా అర్థమయింది సౌగంధినికి. "ప్రతీకారమా!"

లావినియా రోషాయుత నేత్రాలలో ఈసారి చిప్పిలిన కన్నీరు. "ఇంద్రప్రస్థంలో నాకు కిరాతకుడి పీడ. అబలనైన నేను పారిపోవాల్సి వచ్చింది"

"ఎవరతడు లావినియా!"

"నాగాయకుడు. ఇంద్రప్రస్థరాజు"

సౌగంధిని ఆశ్చర్యపోలేదు. 'సాక్షాత్తు ఆ ఇంద్రుడినే దాసోహమన్పించే లావినియా సౌందర్యానికి ఆ నాగాయకుడు వెంటబడటంలో ఆశ్చర్యం ఏముంది?'

"అవును లావినియా...! మీ గురించి రాజులూ రాజ్యాలూ తల్లక్రిందులయిపోయి యుద్ధాలు, రక్తపాతాలు జరగకపోతేనే ఆశ్చర్యపోవాలి"

లావినియా మౌనంగా వింటోంది.

"అందుకేనా యువరాజుల్ని ఆశ్రయించారు" తలవూపింది లావినియా.

"సముద్రగుప్త యువరాజు శృంగార సామ్రాజ్యరాజు. ఆనందలోకానికిరేడు. సుకుమార నవనీత హృదయులు. వారికి రక్తపాతాలంటే అసలు గిట్టవే!" అదోలా చూసింది సౌగంధిని.

"అదేమిటి యువరాజులు క్షత్రియులు. శౌర్యం వారి రక్తంలోనే ఉంటుంది సౌగంధినీ"

"అలా ఉండాలనిలేదు. తథాగతుడు రాజవంశంలో జన్మించాడు. కానీ ఎంతటి దయాస్వరూపుడు. ఎంతటి సున్నితమనస్కుడు. రాజుగా జన్మించినా కత్తిని చేబూనలేదు. రాజ్యాన్ని పరిపాలించలేదు. చివరకు కామాన్ని పరిత్యజించి మోక్షకామి అయ్యాడు"

"యువరాజు అహింసావాదా!" కళ్ళు వెడల్పుచేసి ఉత్కంఠతో అడిగింది లావినియా.

"అహింసావాదని కాదు. యువరాజులో విచిత్రవైఖరి. జన్మకు రాజయినా యువరాజులో సాత్త్విక ప్రవృత్తి మెండు. కత్తి అంటే వెరపు. రక్తపాతమంటే ఏవగింపు"

"ఏమిటీ!" లావినియా కళ్ళు విస్ఫారితమయ్యాయి.

"సముద్రగుప్తులకు కత్తి అంటే వెరపా! గుప్త సామ్రాజ్యాధీశులు, సుక్షత్రియుడు అయిన రాజాధి రాజు బిరుదాంకిత చంద్రగుప్త సామ్రాట్ పుత్రుడికి రక్తమంటే ఏవగింపా! ఆశ్చర్యంగా ఉందే!"

సౌగంధిని మరింత పుంజుకుంది "ఈ విషయం మీకు తెలియదా! లావినియా!"

"ఉహూ!" తల అడ్డంగా తాటించింది.

"సముద్రగుప్తులు మహా సౌందర్య పురుషులని విన్నాను. మహాపండితుడని, వీణాకోవిదుడనికూడా విన్నాను. కనిష్ఠులైన యువరాజులకు రాజ్యభారం మోయాల్సిన అవసరం లేదు కదా! తండ్రి చంద్రగుప్తుడు, జ్యేష్ఠ సోదరుడు కచులు బరువు బాధ్యతలు మోస్తూ యువరాజుకు కష్టమనేది తెలియకుండా పెరిగి ఉన్నాడనీ విన్నాను"

"మీరు చెప్పినవన్నీ నిజమే లావినియా! అయితే ఈ సత్యం వెనుక



ప్రజాస్వామ్య వ్యవస్థలో ధర్మం దారి తప్పినప్పుడు సాధుసమాజం రాజకీయాలలో జోక్యం చేసుకుంటుంది. -స్వామి పరిపూర్ణానంద, ఆధ్యాత్మిక గురు

ఉన్న యువరాజుల సత్వగుణవైఖరి ఈ దేశంలో అందరికీ తెలుసు.

ఈ విషయం గురించి ప్రభువులలో కూడా అంతర్లీనంగా చింత ఉందని అంతఃపురంలో అక్కడక్కడా అనుకుంటుంటే విన్నాను"

లావినియా ఆలోచనలో పడింది.

సౌగంధిని లావినియాను గమనిస్తోంది. అలాగే లావినియా అంతరంగంలో కదులుతున్న ఆలోచనల్ని పసిగట్టాలని ప్రయత్నం చేస్తోంది.

అయినా అంతరంగంలో ఆలోచనలు ఎవరికి తెలుస్తాయ్!

సౌగంధిని ఈసారి లావినియాను నింపాదిగా చూస్తూ యథాలాపంగా అడుగుతున్నట్టుగా అడిగింది-

"ఇంతకీ లావినియాకు యువరాజుల్ని ఆశ్రయించమని సలహా ఇచ్చిన వారెవరో?"

ఆ ప్రశ్నకు లావినియాలో ఉలికిపాటు. సౌగంధినిని అదోలా చూసి సంబాళించుకొంది "సలహానా!" ఆమెలో తడబాటు ఒక లిప్తకాలం మెరుపులా మెరిసింది.

"ఎవరూ చెప్పలేదు. నా అంతట నేనే వెతుక్కుంటూ వచ్చాను"

సౌగంధిని ఈసారి మరింత నిశితంగా చూస్తూ "కానీ అన్ని యోజనల దూరంలో ఉన్న ఇంద్రప్రస్థం నుండి పాటలీపుత్రానికి ఇంత సౌందర్యవతి క్షేమంగా ఎలా చేరగలిగారు లావినియా!" అన్నది.

ఆ మాటలకు లావినియాలో సంశయం, ఇబ్బంది - ఇక్కడసౌగంధినికి ప్రస్ఫుటంగా కన్పిస్తున్నాయ్!

ఎందుకనో సౌగంధినికి ఆ సమయంలో అంతకుమించి గుచ్చిగుచ్చి అడగకూడదని అన్పించింది.

అలాచేస్తే లావినియాలో అనుమానమో లేదా సంశయమో కలుగుతుందేమోనని భయం వేసింది.

ఆ వెంటనే మాట మార్చివేస్తూ "క్షమించాలి అతి చనువు తీసుకున్నట్లున్నాను లావినియా! ఇంతకీ మీరిక్కడ ఎలా ఉన్నారో చెప్పండి... యువరాజుల ప్రత్యేక అతిథి మీరు.మీకు సకల సదుపాయాల్ని కలుగచేయాలని, రవ్వంత కూడా అసౌకర్యం కల్గించకూడదని యువరాజుల ఉత్తర్వు" అన్నది.

సంభాషణ మలుపు తిరగటంతో, లావినియాలో తొలగిపోయిన ఇబ్బంది. ఈ విషయాన్ని మరోసారి సునిశితంగా గుర్తించింది సౌగంధిని.

సౌగంధిని అంతః పురంలో మొదటి నుంచి మసలుకున్న యువతి.

రాజాశ్రయంలో జీవించే వాళ్ళకు కొన్ని విచిత్రమైన అలవాట్లువస్తాయి.

వాటిల్లో అతి ముఖ్యమయినదీ తమ అంతరంగంలో భావాలు బయటకు తెలియకుండా ఇతరుల ఆలోచనలను బయటకు లాగటం, పసిగట్టటం.

ఇది వెన్నతో పెట్టిన విద్య అవుతుంది. ఐతే జనప్రవంతిలో జీవించే ప్రజానీకానికి తమలో భావోద్వేగాన్ని, ఆలోచనలను బహిర్గతం చేయుటం పరిపాటి అయిన విషయం.

లావినియా, సౌగంధిని అంత 'లోతైన' స్త్రీకాదు. పైగా కపటము, కుత్సితము తెలియని అమాయకురాలు. సౌగంధిని తన కుతూహలాన్ని బయటకు కన్పించకుండా జాగ్రత్తపడింది.

'లావినియా రాక యాదృచ్ఛికమైనదా... లేక ఆమె వెనుక ఏవైనా విషయాలు వెన్నాడుతున్నాయా' ఎంత ఆలోచించినా సౌగంధినికి తట్టడం లేదు. 'తను అనవసరంగా ఊహించటం లేదుకదా!' అని అన్పించసాగింది. అలా ఆలోచిస్తూ, ఆలోచిస్తుంటే ఈ నమ్మకమే ఆమెకు క్రమంగా బలీయమవటం ప్రారంభించింది.

"లావినియా! మీకేం కావాల్సినా నాకు కబురుపెట్టగలరు. మీ ఆజ్ఞాబద్ధురాల్ని"

ఆ చివరిమాటలకు లావినియా నొచ్చుకున్నట్లుగా అయింది. "ఇందులో ఆజ్ఞల ప్రసక్తి దేనికీ సౌగంధినీ!నువ్వునాకు మిత్రురాలివి"

"ఏమో... లావినియా! మీరు ఈనాడు ముఖ్యఅతిథి.

రేపు ఈ అంతఃపురం ఏలే మహారాణే కావచ్చునేమో!" అంది.

ఆ మాటలకు లావినియాలో విచిత్ర సంచలనం. ఏదో చెపుదామని నోరు విప్పబోయింది. ఇంతలో సుకన్య వచ్చింది. "సౌగంధినీ! బయట ఒక విచిత్ర వ్యక్తి వచ్చాడు. అతడి దగ్గర ఒక అపూర్వమైన, అత్యద్భుతమైన పక్షుల జంట వున్నది.

మహారాణి కుమారదేవి అంతఃపురానికి తరలివెళుతూంటే ఆ వ్యక్తిని మార్గమధ్యంలోనిలిపి ఇక్కడికి తీసుకువచ్చాను. ఆ పక్షుల జంటను మనమే స్వంతం చేసుకుంటే బాగుంటుందని అన్పించింది"

సుకన్య మాటలకు ఆ ఇరువురూ ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. "పక్షులజంటా... ఏమిటో ఆ గొప్పతనం... ఇంతకీ వెల ఎంత?" సౌగంధిని ఆశ్చర్యపోతూ అడిగింది.

"ఆ పక్షుల జంటను బహుమతిగా పొందగల వ్యక్తికోసం, అర్హత ఉన్నవ్యక్తి కోసం అతడుఅంతటా గాలిస్తున్నాడట. కాని ఇంతవరకూ అటువంటి వ్యక్తియే తారసపడలేదుటా సౌగంధినీ!"

మరోసారి లావినియా, సౌగంధినీలు మొహామొహాలు చూసుకున్నారు. "చాలాఆశ్చర్యంగా ఉందే" సౌగంధిని తనలోతాను అనుకున్నట్లుగా పైకి అన్నది. "ఇంతకీ ఆ పక్షి జంట ఏ ప్రాంతానికి చెందినవి సుకన్యా?"

"అవి ఈ ఆర్యావర్తంలోని పక్షులే కావుట సౌగంధినీ!"

"మరి....?" సౌగంధిని ప్రశ్న.

"అవి పశ్చిమ దేశపు అరుదయిన అద్భుత జంటట" సౌగంధిని లావినియా వైపుచూసింది.

లావినియా తల వూపింది.

"ఏదీ ప్రవేశపెట్టు సుకన్యా!" సౌగంధిని ఉత్తర్వు ఇచ్చింది.

ఇంతలో మళ్ళీ గుర్తుకువచ్చిన దానిలా వెళ్ళబోతున్న సుకన్యను వెనక్కి పిలిచింది సౌగంధిని"ఇంతకీ ఆఅపూర్వ జంట పేరు ఏమిటో సుకన్యా"

## భిన్న షేడ్స్

'రక్షక భటుడు' తర్వాత లక్నో పోరి రిచాపనయ్ మరో సినిమాకు రెడీఅయిపోయింది. పేరుఇంకా ఖరారుకాని సినిమాలోని తన పాత్రగురించి అదే పనిగా చెప్పుకుంటున్నది.

"ఇంతకు ముందు నేను గ్లామరస్ లేదా గ్రామీణ యువతి పాత్రలు చేశా. ఈ సినిమాలో రెండూ కలగలసి వుంటుంది. పాశ్చాత్య, సంప్రదాయ దుస్తులు రెండూ ధరిస్తాను.

నా పాత్ర విభిన్న షేడ్స్‌తోవుంటుంది. దర్శకుడు శ్రీధర్‌మేము సౌకర్యంగా ప్రతి సన్నివేశాన్నీ చేసేలా చూస్తున్నారు. షూటింగ్ అనుభవాలు సంతృప్తిగా వున్నాయి. తెలుగు బాగా తెలుస్తున్నది" అంటూ సకల సంగతులూ ఏకరువుపెట్టింది.



భారతదేశ రాజకీయాలకు
దశ, దిశ చూపించి దేశ
ప్రజలకు అద్భుతమైన
మార్గదర్శనం చేస్తా.

-కె.సి.ఆర్., తెలంగాణ సి.ఎమ్.



## ఏదో... అనుకోకుండా

నిండా పద్దెనిమిది ఏళ్ళు లేవు, ఇంకా ఒక్క సినిమా కూడా విడుదల కాలేదు. కాని రాత్రికి రాత్రి మలయాళీ బ్యూటీ ప్రియాప్రకాష్ ఫేమ్ అయిపోయింది. తను నటించే తొలి మలయాళ చిత్రం 'ఒరు ఆధార్ లవ్'లో ఓ పాటలో స్కూల్ డ్రెస్‌లో వున్న ప్రియాప్రకాష్ కన్నుగీటింది.

ఓ కాటుకరేకల కన్ను తెరిచి మరో కన్నుగీటిన ఆమె చిత్తరువు సోషల్ మీడియాలో వైరల్‌గా మారింది. కొన్ని లక్షలమంది దీన్ని వీక్షించడంతో టాలీవుడ్, కోలీవుడ్, బాలీవుడ్ అన్న వ్యత్యాసాలు లేకుండా భారతీయ సినిమా అంతా తనగురించిన ఆలోచన చేసే స్థాయికి ఎదిగిపోయింది.

దీనిపై ప్రియ స్పందనమాత్రం ఆమె వయస్సుకు తగినట్లు సింపుల్‌గానే సాగింది. 'ఏదో అనుకోకుండా' అని తేల్చేసింది. ఇదంతా పక్కనపెడితే, ఈ సినిమా షూటింగ్ కోసం తొలిసారిగా విమానం ఎక్కానంటూ చిన్నపిల్లమాదిరి సందడిగా చెప్పుకుంటున్నది.



సుకన్య వెనుదిరిగింది. కొంచెంసేపు జ్ఞాపకం తెచ్చుకోవడానికి సతమతమవుతున్న దానిలా తనలో తాను గొణుక్కుంది 'విచిత్రమైన పేరు... నిజంగా విచిత్రమైన పేరు కదూ' కొంతసేపయ్యాకగాని సుకన్యకు గుర్తురాలేదు.

"అవును.. గుర్తుకువచ్చింది" తల విదిలిస్తూ అంది వారిరువురితో.

"జాక్ డాస్... ఆ అపూర్వ విచిత్ర పక్షుల జంటపేరు జాక్ - డాస్"

యువరాజు సముద్రగుప్తుడు ఒంటరిగా అశ్వాన్ని అధిరోహించి గంగానది ఒడ్డున ప్రయాణం చేస్తున్నాడు. ఎంతదూరం అలా ప్రయాణించాడో కాని గుర్రంమాత్రం అలసిపోయింది. సముద్రగుప్తుడు అశ్వం పైనుండి దిగాడు.

అశ్వాన్ని ఒదిలివేశాడు. అది వెంటనే గంగానది పాయవైపుగా వెళ్ళి ఆ నది ప్రవాహంలోకి తలవంచి నీరుత్రాగటం ప్రారంభించింది. ఆ తర్వాత ఆ చుట్టు పక్కల బయళ్ళలో ఉన్న పచ్చికను తినటం ప్రారంభించింది.

అలా మరో ఘడియ వరకు అశ్వానికి విశ్రాంతి ఇచ్చి ఆ తర్వాత కళ్ళాన్ని చేతబూని అలా నడుచుకుంటూ గంగానదికి ఆవలవైపు ఉన్న అడవిలోకి ప్రవేశించాడు సముద్రగుప్తుడు.

అపుడే సంధ్యాసమయం వ్రాలుతోంది. ఇటువైపు గంగాప్రవాహం, అటువైపు సుందరవనం. మధ్యలో రాకుమారుడు పచ్చికను పరచుకొన్న విశాల మైదానంలోని సన్నని దారిలో ప్రయాణం చేస్తున్నాడు. గాలి కూడా గంగానది నీరు లాగా స్వచ్ఛంగా వీస్తోంది. దూరంగా చెట్లమీద రకరకాల పక్షులుచేసే విచిత్ర శబ్దాలు.

ఆ వైపున అందమైన సూర్యాస్తమయం. దిగంతాలు బంగారు వర్ణంతో మేళవింపు అయిన పారాణి రంగును పులుముకున్నట్లుగా ఉంది. సముద్రగుప్తుడు గుర్రాన్ని ఆపి అలా ఆకాశంవైపు తదేకంగా చూడటం మొదలుపెట్టాడు.

అసలే సౌందర్య పిపాసి అయిన సముద్రుడికి ఆ అందమైన అరుణారుణవర్ణ సంధ్యా సూర్యుడు అద్భుతంగా తోచాడు. అతని హృదయంలో సౌందర్య కీల రగులుకొంది.

ఎదురుగా సవితృదేవుడు ముగ్ధ మనోహరంగా జగన్మోహనంగా మెరుస్తున్నాడు. సముద్రుడిలోని సౌందర్య పిపాసకుడు తన్మయుడైపోయి చేష్టలుడిగి రెప్పవాల్చకుండా చూస్తున్నాడు.

ఉన్నట్టుండి గుర్రం పెద్దపెట్టున సకిలించింది. సముద్రగుప్తుడు ఆ శబ్దానికి ఉలిక్కిపడి ఈలోకంలో పడి ఇటువైపు చూశాడు.

గుర్రం కళ్ళాన్ని లాక్కొని ఒక్కసారిగా బెదిరిపోయి పారిపోయింది. అపుడుగాని సముద్ర గుప్తుడికి కన్పడలేదు. తన పక్కగా ఎటువైపు నుంచో బాణాలు శరవేగంతో వస్తున్నాయి.

సముద్రగుప్తుడు ఒక్కసారిగా ఆ వైపుగా రెండంగలు వేసి బాణాల నుంచి రక్షించుకున్నాడు.

ఆశ్చర్యంగా ఉన్నట్టుండి శరపరంపర ఆగిపోయింది. సముద్రగుప్తుడు నలువైపులా చూశాడు. ఆ తర్వాత బాణాలు వచ్చినవైపు మరింత తీక్షణ దృక్కులతో చూశాడు.

ఆపై నుంచి విల్లంబులు ధరించి కాషాయాంబరధారి వస్తున్నాడు.

'ఆ వస్తున్న వ్యక్తి శత్రువా... మిత్రువా!' సముద్రగుప్తుడిలో ఆలోచనలు. హఠాత్తుగా యువరాజు చేతులు నడుమును తడిమాయ్.

అక్కడ ఖాళీగా ఉంది. అపుడుగానీ సముద్రగుప్తుడికి గుర్తుకురాలేదు. 'తనవద్ద ఆత్మరక్షణకోసమై కనీసం ఒక కత్తిగాని, చురికగాని లేదు' మళ్ళీ సముద్రుడికి స్ఫురణకు వచ్చింది 'ఒకవేళ ఉన్నా ఖడ్గవిద్యలో నైపుణ్యం లేనివాడు తను' ఈభావం తోచగానే యువరాజుకు ఎక్కడో గుచ్చుకున్నట్టైంది.

ఇన్నాళ్ళు తండ్రిచాటున తన ఆత్మరక్షణకోసం ఇతరులమీదనే ఆధారపడేటట్టుగా తయారయ్యాడు' మొట్టమొదటిసారిగా సముద్రగుప్తుడికి ఎందుకనో క్రుంగిపోయిన అనుభూతికి గురైయ్యాడు.

'శత్రువును సంహరించటం సంగతి అలా ఉంచి, కనీసం ఆత్మరక్షణ కూడా చేసుకోలేని సుక్షత్రియుడు. 'మహారాజాధిరాజు'గా బిరుదాన్నిపొంది అరివీర భయంకరుడుగా పేరుకన్న చంద్రగుప్తుడి అనుంగు కుమారుడు, రాకుమారుడు'

కాషాయాంబరధారి ఈసారి మరింత చేరువయ్యాడు.

సముద్రగుప్తుడు గుర్తుపట్టాడు. అతడిలో అంతులేని ఆశ్చర్యం.

"గురుదేవా, మీరా!"

కాషాయాంబరధారి దగ్గరకువచ్చి రాకుమారుడ్ని గుర్తుపట్టాడు.

అతడు సారంగుడు, రాకుమారుడి గురుకులంలోని గురువు.

"ఏమిటీ యువరాజు సముద్రులా!" కాషాయాంబరధారి నలువైపులాచూస్తున్నాడు. "రాకుమారుడేమిటి,ఇలా ఒంటరిగా, తోడుగా కనీసం అంగరక్షకులు కూడా లేకుండా రావటమేమిటి?"

సముద్రగుప్తుడు ఈసారి నిశ్చింతగా నిట్టూర్పు విడిచి "గురుదేవులకు ప్రణామం" తలవంచి నమస్కరించి, తర్వాత పాదాభివందనం చేశాడు.

"ఆయుష్మాన్‌భవ...!" చేయెత్తి సారంగుడు ఆశీర్వదించాడు.

**ఇంకా ఉంది**

**ఓ మిత్రమా! నిన్ను దుఃఖితునిగా చేస్తున్నది ఏది? సర్వశక్తీ నీలోనే వుంది. ఓ శక్తిశాలీ! నీ సర్వశక్తి స్వభావాన్ని వ్యక్తీకరించు. ఈ సమస్త లోకమూ నీకు పాదాక్రాంతమవుతుంది.**

# అంతా రాజకీయమే



## ఓటమి మంచిదే

రాజస్థాన్‌లో జరిగిన ఉప ఎన్నికల్లో బి.జె.పి. ఓడిపోయి కాంగ్రెస్ గెలిచింది. ఒడిషా, మధ్య ప్రదేశ్‌లో బి.జె.పి., కాంగ్రెస్‌లు తమ తమ స్థానాలను నిలబెట్టుకుని బి.జె.పి.ని ఓడించాయి.

ఆ ఓటమి భారంనుండి బిజెపి కోలుకోలేదేమో అనుకుంటుండగా 'ఓటమి మంచిదే' అని అమిత్‌షా అన్నాడని తెలిసి కాంగ్రెస్‌పార్టీ ఆశ్చర్యపోయింది. అమిత్‌షా ఎత్తుగడలు వెయ్యటంలో దిట్ట. కాబట్టి ఆ మంచిది ఏమిటో తెలుసుకోవాలని కాంగ్రెస్‌పార్టీవారు నానాతంటాలుపడ్డారు.

చివరికి తేలిందేమిటంటే వచ్చే సంవత్సరం ఎన్నికలు జరగబోతున్న సమయంలో ఓటమివల్ల ఓటర్ల మనసులో ఉన్న అసంతృప్తి అర్థంచేసుకుని, వారిని బుజ్జగించి తమవైపు తిప్పుకునే అవకాశం వచ్చిందని, గెలుపు ధీమాలో ఉన్న పార్టీ క్యాడర్, ఓటమి షాక్‌తో తిరిగి మరింత గట్టిగా పార్టీకోసం పనిచేస్తారని, అందుకే అమిత్‌షాఓటమి మంచిదేనన్న నినాదం ఇచ్చాడని తేలింది. ◆

## ఇక ఎటు!!

ఇంతకాలం వామపక్షం... సోషలిజం, సెక్యులరిజమ్ అంటూ ఓటర్లను ఆకట్టుకుని దేశంలోని మూడు ప్రాంతాలలో ఎర్రకోటలు కట్టుకున్నారు కమ్యూనిస్టులు. బెంగాల్‌లోని పెద్ద కోట ఎప్పుడో కూలింది. ఈలోగా త్రిపురలోని బుల్లికోట బద్దలయింది. పాతికేళ్ళ పాలనతర్వాత సి.పి.యం. తిరస్కారణకు గురైంది.

ఇక ఇప్పుడు మిగిలింది కేరళ. అదికూడా బీటలువారిన కోట. ఎవరితో జతకడితే రాజకీయంగా బ్రతికి బట్టకట్టగల్గుతామనే అంశంమీద సి.పి.యం. తేల్చుకోవాల్సిన సమయం వచ్చింది. కాంగ్రెస్ చెయ్యి అందుకునే విషయంలో రెండు వర్గాలుగా విడిపోయింది పార్టీ.

సి.పి.ఐ.కి పెద్దన్న సి.పి.యం. రాజకీయం అంతుపట్టటం లేదు. ఒంటరిగా పోరాటం చేసే శక్తి లేదు. మరి తదుపరి అడుగు ఎటు!

హైదరాబాద్‌లో జరిగే జాతీయ మహాసభలో మరోసారి చీలికకు బీజం పడుతుందా అన్న భయం కార్యకర్తలది. ◆

## త్రిపుర పాఠం

ఈశాన్య భారతంలో ఉన్న త్రిపుర రాష్ట్రానికి దక్షిణ భారతదేశంలో ఉన్న ఆంధ్రప్రదేశ్‌కి ఎటువంటి పోలిక లేదు. త్రిపుర ముఖ్యమంత్రి మాణిక్ సర్కార్ సి.ఎమ్.లలో నిరుపేద.

రాజకీయంగా కూడా ఆ రెండు రాష్ట్రాలకు సంబంధం లేదు. అయితే త్రిపుర రాష్ట్ర ఎన్నికల ఫలితాలు ఎ.పి. ముఖ్యమంత్రికి పాఠం చెపుతున్నాయి. త్రిపుర ముఖ్యమంత్రి మాణిక్‌సర్కార్ రాజకీయాలలో అత్యంత నిజాయితీపరుడు. పేదల మనిషి. అటువంటి వ్యక్తి నాయకత్వంలోని పార్టీ ఓడిపోయింది. అందుకు కారణం ఆయన కాదు, ఆయన పార్టీ ఎమ్.ఎల్.ఎ.లు.

సి.పి.యం. పార్టీ ఎమ్.ఎల్.ఎ.లు సంపాదించినంత డబ్బు మరే పార్టీ ఎమ్.ఎల్.ఎ.లు సంపాదించలేదు త్రిపురలో. ప్రతి నియోజకవర్గంలో పూర్తి పెత్తనం ఆ ఎమ్.ఎల్.ఎ.దే.

అక్కడి ఇసుక, నీరు, పంపిణీ భూముల అమ్మకాలు, రిజిస్ట్రేషన్‌వంటివేవీ స్థానిక ఎమ్.ఎల్.ఎ.కి చెప్పకుండా జరగటానికి వీలులేదు.

ఆ ఎమ్.ఎల్.ఎ.ల మీద ఓటరు కసి సి.పి.ఎమ్. ఓటమికి దారితీసింది. ఇప్పుడు ఎ.పి.లో ఉన్న పరిస్థితి సరిగా అటువంటిదే. ◆

## అవే సెల్ఫ్‌గోల్స్

ఆటలో పొరపాటున సెల్ఫ్‌గోల్ కొట్టి ప్రత్యర్థిని గెలిపించటం అరుదుగా జరుగుతుంది.

సెల్ఫ్‌గోల్స్ ఎందుకు పడుతున్నాయో అర్థం చేసుకుని వాటిని తదుపరి పోటీల్లో నివారించే యత్నం చేసుకుంటారు. కాని రాజకీయరంగంలో వరసగా సెల్ఫ్‌గోల్స్ కొట్టుకుని ప్రత్యర్థులను గెలిపిస్తున్న ఏకైక పార్టీ వై.కా.పా.

ఆ పార్టీకి సలహాదారులు ఎవరోగాని, ఆ పార్టీని తిరోగమనంలోకి తీసుకువెళుతున్నారు. ఎంతో అవసరమయితే తప్పించి శాసనసభ సమావేశాల కాలం మొత్తం బహిష్కరించటం జరగదు.

కాని వైకాపా పార్టీకి శాసనసభ బహిష్కరణ ఒక జోక్‌గా మారింది. చట్టసభల్లో ప్రజల వాణిని వినిపించమని ప్రజలు ఓట్లేసి పంపితే మేము సభకే వెళ్ళమంటే ఎలా.

తన పార్టీ ఎమ్.ఎల్.ఎ.లు ఎక్కడ అసెంబ్లీలో మాట్లాడి తనని దాటిపోతారనే భయమన్నా ఉండాలి లేదా సభకు వెళితే అటునుండి అటే అధికార పార్టీలోకి జంప్ అవుతారన్న భయమన్నా ఉండాలి. కారణం ఏదయినా సభ బహిష్కరణ మాత్రం సెల్ఫ్‌గోలే. ◆

## అధికారుల అదృష్టం

రాష్ట్ర ముఖ్యమంత్రులందరు తమకంటూ ఒక ప్రత్యేక హెలికాప్టర్లను ఏర్పాటుచేసుకున్నారు. కొందరు సొంతంగా కొనుక్కున్నారు. మరి కొందరు అద్దెకు తీసుకున్నారు.

ఆ కోవలోనే బెంగాల్ ముఖ్యమంత్రి మమతా బెనర్జీకి ఒక హెలికాప్టర్ ఉంది. ఇటీవల బెంగాల్‌లో అధికారులు మారుమూల ప్రదేశాలకు వెళ్ళాల్సిన అవసరం వస్తే నా హెలికాప్టర్‌లో వెళ్ళి రండి అంటూ పంపిస్తున్నదట మమతాబెనర్జీ. ఆమె ఇస్తున్న ఆ సౌకర్యం చూసి అదంతా తమ భద్రత మీద చూపిస్తున్న శ్రద్ధ అనుకున్నారట.

కాని ఆ తర్వాత వారికి తెలియవచ్చింది అసలు విషయం ఆ హెలికాప్టర్‌కి అద్దె నెలకు 50 లక్షలు. నెల మొత్తంలో ఆమె అనుకున్నన్ని గంటలు హెలికాప్టర్‌లో వెళ్ళలేకపోతున్నది. ఫలితంగా వాడుకోకుండా కంపెనీకి డబ్బులు చెల్లించాల్సివస్తోంది.

ఆ విషయం తెలిసిన మమతాబెనర్జీ మిగిలిన గంటలు అధికారులకు కేటాయించి, తద్వారా వారి మద్దతు కూడగట్టుకునే ఆలోచన చేసి వారికి హెలికాప్టర్ సౌకర్యం ఇస్తోంది. ◆

## అవసర మాయ

బి.ఎస్.పి. నేత మాయావతి మారు మనసు పొంది ములాయంసింగ్ కుటుంబ పార్టీకి లోక్‌సభ ఉప ఎన్నికలో మద్దతు ప్రకటించింది.

అయితే నాయకురాలిగా ఆమె వేసిన ఆ ఎత్తుగడ కిందిస్థాయి కార్యకర్తలకు అస్సలు నచ్చలేదు. అందుకే అలజడి మొదలైంది.

సమాజవాద పార్టీ, బిఎస్‌పి పార్టీలు రెండూ సామాజికంగా బద్ధవైర వర్గాలకు చెందినవి.

ఒక వర్గం ఓటు రెండవ వర్గానికి బదిలీ కానే కావు. మరే ఇతర పార్టీకైనా బదిలీ అవుతాయేమో కాని ఎస్.పి. పార్టీకి కావు. అయితే మాయావతికి రాజ్యసభ సీటు కావాలి.

అందుకోసం లోక్‌సభ ఉప ఎన్నికలో ఎస్.పి.కి మద్దతు ప్రకటించి, రాజ్యసభ ఎన్నికలో తనకు మద్దతు పొందాలన్నది ఆమె ఆలోచన. ఆ మేరకు ఆమె ఎత్తుగడ ఓ.కే. కాని గ్రామస్థాయిల్లో ఎస్.పి., బి.ఎస్.పి.ల మధ్య సఖ్యత సాధ్యమయ్యేనా! ◆

Review

## మాయా లేదు మంత్రమూ లేదు

ఆలోచన మంచిదైతే సరిపోదు. ఆచరణ కూడా అంతకుమించి వుండాలి. లేదూ అంటే అయ్యోపాపం అనుకోవడంతప్ప వేరే అవకాశం వుండదు. ఈ వారం విడుదలైన 'ఏ మంత్రం వేసావె' సినిమా ఇలాంటిదే. కాస్త కొత్త ఆలోచన.

దాన్ని ఆచరణలో పెట్టడంలోనే అస్సలు అనుభవం అన్నది కనిపించలేదు.

సినిమా ఆద్యంతం అనుభవరాహిత్యం తొంగి చూస్తూ వుంటుంది. సినిమాలు చూసి, చూసి పండిపోయిన ప్రేక్షకులకు ఈ వైనం అస్సలు రుచించదు. దాంతో అనాసక్తిగా సినిమా చూసి రావడం మినహా చేసేదేమీ వుండదు.

ఇంతకీ కాస్తయినా కొత్త ఆలోచన అనడానికి కథలో ఏమి వుందీ అంటే, వీడియో గేమింగ్ నేపథ్యంలో కథ సాగుతుంది. రానురాను యువత బానిసైపోతున్న సోషల్ నెట్‌వర్క్ వ్యవహారాలు అందరికీ తెలిసినవే. ఇప్పటికే పలు సినిమాల్లో టచ్ చేసినదే.

దానికి కంప్యూటర్ గేమింగ్ కాన్సెప్ట్‌ను జోడించి, ఊహా ప్రపంచంలోనుంచి వాస్తవ ప్రపంచంలోకి నడవండి అంటూ యువతకు చిన్న మెసేజ్ ఇచ్చే ప్రయత్నం కథలో వుంటుంది.

నిక్కీ (విజయ్ దేవరకొండ) ఓ సగటు కుర్రాడు. 24 గంటలూ కంప్యూటర్ గేమ్స్ ఆడుతూ కాలం గడిపేస్తుంటాడు.

రాగలహరి (శివానీసింగ్) గేమ్ డిజైనర్. యువతను తాత్కాలిక ఉద్రేకానికి గురిచేసే ఊహా ప్రపంచపు యాక్షన్ గేమ్‌లు కాకుండా, మంచి విషయాల వైపు, వాస్తవ దృక్పథంవైపు మళ్ళించే గేమ్ తయారు చేయాలన్నది ఆమె సంకల్పం.

ఇలాంటి టైమ్‌లో రాగలహరిని తన ప్రేమలోదింపే సవాల్ తీసుకుంటాడు నిక్కీ. అలాంటి టైమ్‌లో అతను తనకు తెలియకుండానే ఓ పజిల్‌లో చిక్కుకు పోతాడు. అప్పుడు ఏం జరిగిందన్నది మిగిలిన సినిమా.

ఓ యూత్‌ఫుల్ థ్రిల్లర్ తీయడానికి వీలయినంత ముడిసరుకు సినిమాలో వుంది. అది వాస్తవం. చక్కటి ట్విస్ట్‌కు ఆస్కారం వుంది.

థ్రిల్లింగ్ ఎలిమెంట్స్‌కు అవకాశం వుంది. కానీ దర్శకుడు శశిధర్ మర్రి ఆ అవకాశాలు ఏవీ సరిగ్గా వినియోగించుకోలేకపోయాడు.

అనుభవరాహిత్యం కొట్టొచ్చినట్లు కనిపించింది. దానికి తోడు బడ్జెట్ పరిమితుల దృష్ట్యా, తీసుకున్న నటులందరూ తేలిపోయారు.

అది దర్శకుడి పనితీరుమీద మరింత ప్రభావం చూపించింది. షార్ట్ ఫిలిమ్స్‌లో కనిపించే పాటి నటన కూడా కనిపించలేదు చాలామంది నుంచి. హీరో విజయ్ దేవరకొండ కొంతవరకు ఓకె.

అలాగే నిర్మాణ వ్యయపరిమితులవల్ల సినిమా మేకింగ్ క్వాలిటీ కూడా రాలేదు. ఆ కలర్ వర్క్ చూస్తే, గేవా కలర్ నాటి రోజులు గుర్తుకువస్తాయి.

సినిమా ప్రథమార్థం ప్రేక్షకుడి సహనాన్ని పూర్తిగా పరీక్షిస్తుంది. ఎప్పుడు విశ్రాంతి కార్డు పడుతుందా? అని చూసేవాళ్ళు లేదా డబ్బులు పోతే పోయాయి అని లేచి వెళ్ళిపోయేవాళ్ళు థియేటర్లో



## 'మంత్రం' వేస్తోంది

ఢిల్లీ పిల్ల శివానీసింగ్ ప్రస్తుతం 'ఏం మంత్రంవేశావే'తో ప్రేక్షకులకు మంత్రం వేసే పనిలో వుంది.

ఈ సినిమా తన కెరీర్‌కు సాయపడుతుందో లేదోకాని, మంచి సినిమాలో పనిచేశానన్న సంతృప్తి మాత్రం పుష్కలంగా దక్కిందంటున్నది.

"మాది ఢిల్లీ. సినీ నేపథ్యం అస్సలు లేదు. మోడలింగ్ మీదున్న ఇష్టంతో డిగ్రీ చేశాక ఎన్నో బ్రాండ్స్‌కు మోడల్‌గా పనిచేశాను,రియాలిటీషోలు చేశాను. నాకు తెలుగు రాదు. యూనిట్‌లోని అందరూ ఎంతో సహకరించారు.

హిందీలో డైలాగ్స్ రానుకుని, ఇంగ్లీష్‌లోకి మార్చుకుని అర్థంచేసుకునే దాన్ని" అంటూ సకల సంగతులూ చెప్పుకొచ్చింది. ◆



## విభిన్నతకే ప్రాధాన్యం

తన తెలుగు సినిమా 47 రోజులు షూటింగ్ పూర్తిచేసి, సదరు పాత్ర కబుర్లను పదేపదే చెప్పుకుంటున్నది పూజాఝవేరి. "జూలియట్ వంటి పాత్ర కళ్ళతోనే ఎక్కువ కబుర్లు చెప్పాలి.

చాలాసార్లు దర్శకుడు నన్ను స్ట్రెయిట్‌గా ముఖం పెట్టమని చెప్పేవారు. ఈ పాత్ర నాలోని భిన్న కోణాన్ని ప్రతిబింబిస్తుంది. నేను గ్లామరస్‌గా ఎప్పుడైనా నటించగలను. విభిన్నంగా,ప్రత్యేకంగా వుండే పాత్రల కోసం చూస్తున్నా. అటువంటి పాత్రల అవకాశం వస్తే, వాటిని వదులుకోను. తెలుగు సినిమాల్లో పని నన్ను క్రమశిక్షణగా మార్చింది" అని చెప్పింది. ◆




క్లియర్‌గా కనిపిస్తారు. ప్రథమార్థంతో పోల్చుకుంటే ద్వితీయార్థం కాస్త బెటర్.

అసలు వ్యవహారం అంతా అక్కడే వుంటుంది. అది బాగానే అల్లుకున్నాడు దర్శకుడు. టోటల్‌గా చూసుకుంటే లాజిక్‌లు కాస్త మిస్సయినా కథనం వరకు ఓకె. కానీ ముందే చెప్పుకున్నట్లు దర్శకుడికి అనుభవరాహిత్యం, బడ్జెట్ పరిమితులు, కొత్త నటీ నటులు కలిపి సినిమా స్థాయిని తగ్గించేశాయి.

ఈ సినిమా విజయ్ దేవరకొండ తొలినాళ్ళలో చేసింది. ఇప్పుడు ఆలస్యంగా విడుదలయింది. అయినా ఫరవాలేదు బాగానే చేశాడు. మిగిలినవారి గురించి మాట్లాడుకోవడం అనవసరం. అసలు ఆ హీరోయిన్‌ను ఏ విధంగా ఈ సినిమాకు ఎంపిక చేశారో దర్శక నిర్మాతలకే తెలియాలి.

నిర్మాణ విలువలు, సంగీతం, ఇలా అన్ని విభాగాల గురించి కూడా అదే పరిస్థితి.

టోటల్‌గా ఓ చిన్న సినిమా వచ్చింది. వెళ్ళింది. టికెట్ తీసిన కొద్దిమంది జనాలకు నష్టం. అధిక శాతం జనాలు టికెట్ తీసి, సినిమాకు రాకపోవడం వల్ల నిర్మాతకూ నష్టమే.

ప్లస్‌పాయింట్స్...
సబ్జెక్ట్

మైనస్‌పాయింట్స్...
చేత-తీత

పంఛ్‌లైన్
'మంత్రం' పారలేదు ◆



## గుర్తింపు వచ్చింది

'అ'లో రెజీనా రూపం, నటనా రెండింటికీ మార్కులు బాగానే పడ్డాయి. డ్రగ్స్‌కు అలవాటుపడ్డ అమ్మాయి పాత్రలో బాడీ లాంగ్వేజ్‌ని కూడా బాగా పండించింది. దీంతో టాలీవుడ్‌లో ప్రశంసలు దక్కించుకోవడంతోపాటు బాలీవుడ్‌లో కూడా ఎంతో గుర్తింపు గడించింది.

బాలీవుడ్‌లో సోనమ్‌కపూర్, అనిల్ కపూర్‌లు నటిస్తున్న చిత్రంలో ఓ విభిన్న పాత్రకోసం చాలామందిని ఆడిషన్‌కు పిలిచారు. ఈ పాత్రకు రెజీనా సరిగ్గా సరిపోతుందని దర్శక నిర్మాతలు ఓటేయడంతో అమ్మడు బాలీవుడ్‌బాటపట్టింది.

తెలుగులో మాదిరే అక్కడ కూడా మెప్పిస్తే 'అ'దిరే! ◆



## మళ్ళీ ఇక్కడే...

'జూలి 2' సినిమాతో వీలయినంత అందాల జోరుతో బాలీవుడ్‌లో పాగా వెయ్యగలనని రాయ్ లక్ష్మిబోల్డెన్ని ఆశలుపెట్టుకుంది. తన అందచందాలతో ఉత్తరాదిన రివ్వున ఎగరగలనని ఆశపడింది.

ఎందుకో కాని, రాయ్ అందాలకు అక్కడి ప్రేక్షకులు ఫిదా అవనే లేదు. బికినీలు, హాటెస్ట్ అందాలు వారిని మెప్పించలేదు. ఇక లాభం లేదనుకుంటూ మళ్ళీ దక్షిణాదికి చేరింది. ఓ సినిమాలో పోలీస్ ఆఫీసర్‌గా నటిస్తున్న ఈ సోకులాడికి మరో ప్రాజెక్టు లభించింది. నలభై ఏళ్ళక్రితం కమల్‌హాసన్, శ్రీప్రియ జంటగా నటించిన 'నీయా' చిత్రానికి సీక్వెల్ ఇది.

అప్పటి శ్రీప్రియ పాత్రను ఇప్పుడు రాయ్ పోషిస్తూ, తానీ సినిమాలో నాగుపాము పాత్రలో కనిపిస్తానని, ఈ 'నీయా 2' తనకు దక్షిణాదిలో మంచి పేరు తీసుకువస్తుందని అంటోంది. మంచిదేగా! పైగా, బాలీవుడ్ ఆప్షన్ లేదాయే! ◆



## టూవీలర్ రైడ్

'క్షణం' సినిమా ప్రీ-రిలీజ్ ఫంక్షన్‌కోసం సాయి పల్లవి ఏకంగా టూవీలర్‌పై వచ్చి అందరినీ అబ్బుర పరిచింది. ఫంక్షన్‌కు ట్రాఫిక్‌లో చిక్కుకోకుండా సకాలంలో హాజరయ్యేందుకు రెండు చక్రాలబండిని ఆశ్రయించింది. ఎయిర్‌పోర్ట్‌నుంచి నేరుగా ఫంక్షన్ జరిగే బంజారాహిల్స్‌కు ఎంచక్కా టూవీలర్ వెనుక సీటుపై కూర్చుని ప్రయాణించింది.

"నాకు ఆలస్యం అయింది. ఈవెంట్‌కు వెళ్ళాలి. బంజారాహిల్స్‌లో ట్రాఫిక్ జామ్ ఎక్కువ. దాంతో, మరింత జాప్యం జరగకుండా టూవీలర్ తీసుకుని ఫంక్షన్‌కు వెళ్ళాను. ఈ వాహనంపై వెళ్ళడం చాలా సరదాగా, ఆసక్తిదాయక అనుభవంగా ఉంది" అంటూ ఉత్సాహంగా చెప్పింది. ◆



## ఆ ప్రభావం పడలేదు

'జువ్వ'లో జామ్‌జామ్‌గా కనపడిన పాలక్‌లల్వానీ ఇంకో రెండు సినిమాలనుకూడా పూర్తిచేసింది. "నా మొదటి సినిమా 'అబ్బాయితో అమ్మాయి' బాక్సాఫీస్ విజయాన్ని అందుకోలేకపోయినప్పటికీ ఆ ప్రభావం నాపైన ఏమాత్రం పడలేదు.

జయాపజయాలన్నవి నటీనటులపై ప్రభావం చూపవనేది నా అభిప్రాయం.నేనిప్పుడు ఆరంభ దశలోనే వున్నాను.హీరోయిన్‌గా మంచి పొజిషన్‌కు చేరుకున్నాక మరింత మంచి పాత్రలు ఎంచుకోవడానికి ప్రయత్నిస్తాను. ఇప్పటికైతే దర్శకులను నమ్మే సినిమాలు చేస్తున్నాను" అని చెప్పింది. ◆



## మతిపోతున్నదండోయ్

'పైసా వసూల్' సినిమాలో అందాలను యథేచ్ఛగా విరజిమ్మిన మస్కాన్‌సేతి ఎందరికి గుర్తుందో ఏమోకాని ఈ పిల్లకు ఆపైన సినిమా ల్లేవ్. అలా అని మౌనంగా ఊరుకుంటే పని జరుగుతుందా?

అందుకే తనకు చేతనైనరీతిలో చూపరులకు గుబులురేపుతున్నది.

అందాల విందుకు ఎలాగూ సోషల్ మీడియా ఉందేమో- దీన్ని ఎంచక్కా అందిపుచ్చుకుంటున్నది మస్కాన్.

చిట్టిపొట్టి దుస్తులతో, గుర్తుపట్టడానికి కష్టపడేంతగా తన రూపాన్ని సెక్సీగా మలిచేసింది.

కోటుమాటున దాగనంటున్న అందాలను బంధించే ప్రయత్నాలు అసలే చేయట్లేదు. నిజమో కాదో ఎవరికీ తెలియదుకాని తన చేతిలో రెండుపెద్ద చిత్రాలున్నాయంటూ చెప్పుకుంటున్నది. మస్కానూ- ఇంతగా మతులు చెడగొట్టడం అవసరమా. ◆



## ఏగా ఆడుతున్నాయి?

- సినిమా థియేటర్లు బంద్ కారణంగా దాదాపు రెండు వారాలపాటు మార్కెట్ పూర్తిగా పడిపోయింది. మరోపక్క ఎగ్జామ్స్ సీజన్ కావడం కూడా కారణమయింది.
- దీంతో మార్చి సెకెండ్‌వీక్‌నుంచి కానీ మళ్ళీ బాక్సాఫీస్ పుంజుకోని పరిస్థితికనిపిస్తోంది.

మార్చి 16 నుంచి ఇకవరుసగా జూన్ నెలాఖరు వరకు సినిమాలే సినిమాలు వచ్చేలా వున్నాయి. పైగా రామ్ చరణ్, మహేష్‌బాబు, బన్నీవంటి టాప్‌లైన్ హీరోల సినిమాలు అన్నీ ఈ సీజన్‌లోనే రానున్నాయి. అందువల్ల ఒక్కవారం ఓపికపడితే ఇక థియేటర్లవద్ద జనాలు, కౌంటర్లలో కాసులు హల్‌చల్ చేస్తాయి.

# చివరి రోజుల్లో...

## బెంజిమిన్ ఫ్రాంక్లిన్ (1706-1790)



బెంజిమిన్ ఫ్రాంక్లిన్ యు.ఎస్.ఎ.ని ఏర్పరిచిన జాతిపితలలో ఒకరు.

బెంజిమిన్ ఫ్రాంక్లిన్ రాజకీయవేత్త మాత్రమే కాదు, అసలు ఆయన అమెరికా అధ్యక్షుడు కాదు. కాని అమెరికా అధ్యక్షులందరికీ అధ్యక్షుడు ఆయన. అమెరికా రాజ్యాంగం రూపొందించిన వ్యక్తి.

అమెరికన్ సమాజంచేత 'ఫస్ట్ అమెరికన్' అని గౌరవించబడినవాడు. అమెరికాకి విద్య, కష్టించి పని చేయటం, పెట్టుబడి పెట్టటం, లాభాలు ఆర్జించి ఆర్థికంగా ఎదగటం అనేవాటిని నేర్పించినవాడు బెంజిమిన్ ఫ్రాంక్లిన్. అమెరికా రాజకీయవ్యవస్థకు పునాది వేసినవాడు. స్వేచ్ఛ, సమానత్వం కలిగిన ఒక అమెరికన్ సమాజం ఆయన కన్న కల.

ఆ కల వాస్తవరూపం ధరించేవిధంగా విధివిధానాలను తయారుచేసినవాడు బెంజిమిన్ ఫ్రాంక్లిన్. ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి.

ఆయన ప్రవేశించని, ప్రభావితం చెయ్యని రంగం లేదు. బెంజిమిన్ ఫ్రాంక్లిన్ రచయిత, పరిశోధకుడు. సైంటిస్ట్‌గా కొత్త పరికరాలు కనుగొన్నాడు. పెయింటింగ్‌లు వేసేవాడు. పత్రికా సంపాదకుడు. పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయ స్థాపకుడు.

విద్యుత్ ఉత్పత్తికి సంబంధించి ఆయన ప్రతిపాదించిన సిద్ధాంతం ఆధారంగానే విద్యుత్ శక్తి కనుగొనబడింది. విద్యుత్ శక్తి రాకతో ప్రపంచంలో వచ్చిన మార్పుగురించి ప్రత్యేకంగా చెప్పాల్సిన అవసరం లేదు. రాజకీయంగా పెద్దమనిషి. ముందు చూపున్న మనిషి. అమెరికా దౌత్యవేత్త.

ఏ విషయంమీదైనా, ఎవరితోనైనా చర్చలు జరిపి, వారిని తనవైపుకు తిప్పుకోగలిగిన సమర్థత కలిగినవాడు. అమెరికా-ఫ్రాన్స్ సంబంధాలకు పునాది పడింది ఆయన హయాంలోనే.

బెంజిమిన్ ఫ్రాంక్లిన్ అమెరికాకి చేసిన సేవలు, ఆ దేశానికి తెచ్చిన గుర్తింపుకు గౌరవంగా ఆ దేశం వంద డాలర్ల నోటుమీద ఆయన బొమ్మను ముద్రించింది. అమెరికన్ డాలర్‌మీద పొడుగు జులపాల జుట్టు, తల ముందుభాగం బట్టతల, కొద్దిగా పొట్టతో కనిపించే బొమ్మ బెంజిమిన్ ఫ్రాంక్లిన్‌దే.

బోస్టన్‌లో పుట్టి తన 17వ ఏట ఫిలడేల్ఫియాకి పారిపోయిన బెంజిమిన్ ఫ్రాంక్లిన్ ప్రింటింగ్ ప్రెస్‌లో పనిచేశాడు. అతని పనితీరు చూసి ఇంగ్లండ్ పంపి శిక్షణనిప్పించి, కొత్త ప్రింటింగ్ పరికరాలతో రప్పించి ప్రోత్సహించాడు నాటి ఫిలడేల్ఫియా గవర్నర్.

తన 21 ఏళ్ళ వయసులో తాను ఎదుగుతూ, దేశాన్ని ప్రగతిపథంలో తీసుకువెళ్ళే ఒక యువ బృందాన్ని రూపొందించుకుని దానికి 'జుంటో' అని పేరు పెట్టుకున్నారు. విజ్ఞానం పంచాలన్నది ఆ గ్రూప్ ఆలోచన. విజ్ఞాన ఆధారిత సమాజ నిర్మాణం ఆలోచనను స్వయంగా ముందుకు తీసుకువెళ్ళాడు.

బెంజిమిన్ ఫ్రాంక్లిన్ అమెరికాకి చేసిన సేవలు, ఆ దేశానికి తెచ్చిన గుర్తింపుకు గౌరవంగా ఆ దేశం వంద డాలర్ల నోటుమీద ఆయన బొమ్మను ముద్రించింది. అమెరికన్ డాలర్‌మీద పొడుగు జులపాల జుట్టు, తల ముందుభాగం బట్టతల, కొద్దిగా పొట్టతో కనిపించే బొమ్మ బెంజిమిన్ ఫ్రాంక్లిన్‌దే.

అమెరికన్ స్వాతంత్ర్య ప్రకటనలో ఆయనది కీలకపాత్ర. అనారోగ్యం వేధిస్తున్నా, అన్ని సమావేశాలలో పాల్గొనలేకపోయినా అమెరికా స్వాతంత్ర్య ప్రకటన, అమెరికా లక్ష్యాల రూపకల్పన 1776లో జరిగేలా చేసింది బెంజిమిన్ ఫ్రాంక్లిన్.

ఫ్రాన్స్ దౌత్యవేత్తగా వెళ్ళి 1785లో ఫ్రాంక్లిన్ తిరిగి అమెరికాకి వచ్చాడు. నాటికి అమెరికాలో ఒక అధ్యక్ష వ్యవస్థవైపు రూపుదిద్దుకుంటున్నది. నాటి అమెరికన్ స్వాతంత్ర్య సమరయోధుడు జార్జి వాషింగ్టన్‌కి సహాయకుడిగా తన కృషిని కొనసాగించాడు.

నల్ల బానిసలకు స్వాతంత్ర్యం ప్రకటించటంలో పాత్ర వహించాడు. మతంకన్నా మానవత్వం ముఖ్యమని వాదించినవాడు. తాను కలలుకన్న అమెరికా రూపుదిద్దుకుంటున్నందుకు ఎంతో ఆనందంలో ఉన్నాడు. కాని ఫ్రాంక్లిన్‌కి శరీరం సహకరించటం తగ్గింది. బెంజిమిన్ ఫ్రాంక్లిన్‌ది భారీకాయం.

మధ్యవయసులోనే బరువు బాగా పెరిగాడు. అంత పెద్ద పొట్టవేసుకుని నడుస్తుంటే చూసేవారికి వింతగా అనిపించేది. భారీకాయంవలన సహజంగానే అనారోగ్యాలు వస్తాయి.

బెంజిమిన్ ఫ్రాంక్లిన్‌కి అది తప్పలేదు. మధ్య వయసులోనే ఆయనకు 'గౌట్' వ్యాధి వచ్చింది. అది కీళ్ళవాపు వ్యాధి. కీళ్ళు ఎర్రగా మారి, విపరీతంగా బాధించేవి. ఒకసారి నొప్పి మొదలైతే అది 12 గంటల కాలంలో అత్యంత తీవ్రస్థాయికి చేరేవి.

కాలి బొటనవేలు ఉబ్బినట్టుగా తయారై గట్టిగా పీక్కుతింటున్నట్టుగా ఉండేది. కాలు తీసి కాలు వెయ్యాలంటే ఇబ్బంది. ఐనా భరిస్తూనే 'అమెరికన్ డిక్లరేషన్' పనిని ముగించాడు.

మూత్రపిండాల సమస్య కూడా ప్రారంభమైవుంటుంది అనేది సందేహం. ఆనాటికి మూత్రపిండంలో రాళ్ళు అనేది తెలియదు. ఆయన ఇబ్బందులు గమనించి, నమోదు చేసినదానినిబట్టి బెంజిమిన్ ఫ్రాంక్లిన్ అనారోగ్యం ఆ తర్వాతికాలంలో అంచనా వేశారు.

1787లో అమెరికన్ రాజ్యాంగం సిద్ధమైంది. ఆ ఘడియకోసమే బెంజిమిన్ ఫ్రాంక్లిన్ ఎదురుచూశాడు. ఎంతో తృప్తిగా ఆ రాజ్యాంగ ప్రతిని తడిమి చూసుకుని, దానిమీద సంతకం చేశాడు.

అమెరికన్లకి ఒక గుర్తింపు ఇచ్చిన తృప్తి ఫ్రాంక్లిన్‌కి మిగిలింది. రాజ్యాంగ ప్రతిపై సంతకం చెయ్యటంతో తన లక్ష్యం నెరవేరిందనుకున్నాడేమో ఇక ఆ తర్వాత ఆయన ఎన్నడూ బహిరంగంగా కనిపించలేదు.

తాను కన్న అమెరికన్ సమాజం నిర్మితమవుతుందన్న ధైర్యం ఆయనకు వచ్చింది. అప్పటికే ఆయన వయసు 81 ఏళ్ళు. చివరి మూడేళ్ళు అనారోగ్యంతో బాధపడినా ఆ విషయం బయటివారికి తెలీదు.

శ్వాసకోశ ఇబ్బందులు వచ్చాయి. క్రమంగా శ్వాస పీల్చుకోవటం ఇబ్బంది అయింది. ఊపిరితిత్తులలో ఏర్పడిన కణితులవంటివి పగిలి, ద్రవాలు బయటకు తన్నుకువచ్చేవి. అయితే వాటిని బయటకు ఉమ్మేయగలిగిన శక్తికూడా క్రమంగా సన్నగిల్లింది. క్రమంగా ఊపిరితిత్తులలోనే ద్రవాలు నిలిచిపోయాయి.

శరీరానికి అవసరమయిన ఆక్సిజన్‌ని అందించగలిగిన పరిస్థితి లేకుండా పోయింది. క్రమంగా స్పృహకోల్పోతున్న బెంజిమిన్ ఫ్రాంక్లిన్‌ని తిరిగి బ్రతికించే యత్నం కుటుంబ సభ్యులు చేసినా కోలుకోలేదు.

వారందరిని ఒక్కసారి చూస్తూ 1790, ఏప్రిల్ 17 రాత్రి 11 గంటల ప్రాంతంలో కన్నుమూశారు. అయితేనేం అమెరికా జాతిని సృష్టించిన ఘనత ఆయన శాశ్వతంగా మిగుల్చుకున్నాడు.

ఉత్తమ ప్రశ్నకు ₹ 500, ప్రతి ప్రశ్నకు ₹ 300 బహుమతి

# ఈ శీర్షిక మీదే



## ఉత్తమ ప్రశ్న సమాధానం

→ పి.వి.రమణకుమార్, చిలకలూరిపేట

ఏ 'పాలసీ' తీసుకుంటే హాయిగా ఉంటుంది?

టేకిట్ ఈజీ 'పాలసి'.

→ ఎన్.ఎస్.చంద్రబోస్, విశాఖపట్నం

తేడా?

ప్రేమలో పడడం 'అద్భుతం' ఆ ప్రేమనుండి బయటపడడం 'మహాద్భుతం'.

→ ఆర్.ప్రశాంతి, విజయనగరం

చీరను 'కోక' అని కూడా అంటారెందుకు?

'కో''రి''క' కలిగిస్తుంది కాబట్టి.

→ ఆర్.ప్రశాంతి, విజయనగరం

లోకంలో ఎక్కువమంది ఆడేది?

ఊగిసలాట.

→ వై.ముత్యాలరావు, రాయకుదురు

మనకి ఏమీ పాలుపోకపోతే?

నీళ్ళు నములుతాము.

→ సిహెచ్.వి.వి.ఎస్.మూర్తి, పాల్వంచ

రెక్కల కష్టం చేసేది?

ఫ్యాను.

→ ఎ.ఆరాధ్య, హైదరాబాద్

అబద్ధాలు ఎప్పుడు రాయాలనిపిస్తుంది?

లవ్ లెటర్‌లో-లీవ్ లెటర్‌లో.

→ తాజీప్రసాద్, చెన్నై

బ్యాంకులు?

దేశభక్తులు స్థాపిస్తారు. దేశద్రోహులు కొల్లగొడతారు.

→ డి.వి.చంద్రశేఖర్, కర్నూలు

శంకుస్థాపనకొచ్చిన వివిపీలు ఏం చూస్తారు?

ముందుగా ఆ శిలాఫలకంమీద తమ పేరు ఉందో లేదో చూసుకుంటారు.

→ వై.లక్ష్మీ సరోజ, రాయకుదురు

మనిషి కుదురుగా కూర్చునే ప్రదేశాలు?

ఆసుపత్రి, బార్బర్ షాపు.

→ ఎ.అశోక్‌కుమార్, హైదరాబాద్

రంగులు మారే వర్ణం?

వాతా'వరణం'.

## ఈ కార్టూన్ మీదే




మా తాతదగ్గర చాలా పెద్ద చాప ఉండేది. అది పరిస్తే మా ఊళ్ళోవాళ్ళందరు వచ్చి పడుకున్నా ఇంకా కొంత ఖాళీ ఉండేది అని కోశాడు ఒకడు.

అంతేనా... మా తాత ఎంత ఎత్తు, లావు ఉండేవాడంటే మా గ్రామంలో వారందరు తమ ఇళ్ళలోని చాపలు తెచ్చి పరిస్తే వాటిమీద పడుకుని నిద్రపోయేవాడు అన్నాడు రెండోవాడు.

మరి గ్రామస్థులంతా ఎక్కడ పడుకునేవారు.

వాళ్ళంతా మా తాత పరిచిన చాపమీద వచ్చి పడుకునేవాళ్ళు...

భార్యాభర్తలిద్దరూ పిసినారులు. ఒకరోజు భార్య నా దువ్వెనలో ఒక పన్ను విరిగింది. కొత్త దువ్వెన కొనుక్కోవాలి అంది.

అది విన్న భర్త మరీ దుబారా చేయకు. ఒక పన్ను ఊడితే దువ్వెనే కొనాలా! అని విసుక్కున్నాడు.

అదికాదండీ... నా దువ్వెనలో ఉన్న చివరి పన్ను ఒకటి ఊడిపోయింది. ఇక తప్పక... అని తన ఖర్చుని సమర్థించుకుంది.

## B హ్యాపీ

వచ్చే నెల మొదటి తేదీనుండి కలకత్తాలో మినీ బస్సులు ప్రవేశపెడుతున్నాం అని తన నిర్ణయాన్ని బెంగాల్ ముఖ్యమంత్రి జ్యోతిబసు ప్రకటించగానే-

ఒక కాంగ్రెస్ అభ్యర్థి లేచి వచ్చే నెల మొదటి తేదీ... అంటే ఏప్రిల్ ఫస్ట్ 'ఆల్ ఫూల్స్ డే' ముహూర్తం భలే నిర్ణయించారే అని జ్యోతిబసు వాగ్దానంమీద ఒక జోక్‌లా వేశాడు.

అవును మీలాంటివారిని దృష్టిలో పెట్టుకునే 'ఆల్ ఫూల్స్ డే' ముహూర్తం నిర్ణయించాం అని జ్యోతిబసు చమత్కరించాడు.

"మా ఆవిడ గొంతుకు వైరస్ సోకింది. వారం రోజులు మాట్లాడలేదు" అని శంభు చెప్పగానే-

"అయితే ఇవ్వాళే నేను మా ఆవిడను తీసుకుని మీ ఇంటికి వస్తారా" అన్నాడు రమణ.

"అబ్బే అంత పలకరించాల్సిన జబ్బుకాదురా"

"అదికాదురా... అది వైరస్ కదా... మీ ఆవిడ దగ్గర కూర్చుంటే మా ఆవిడ గొంతుకు సోకదా!" అని చిన్న ఆశ...

మా ఆయన కొట్టిన బంతి అలా ఆకాశంలోకి వెళ్ళిపోయి పదినిమిషాలతర్వాతగాని కిందపడలేదు తెలుసా... అన్నది ఒక క్రికెటర్ భార్య.

ఓస్ అంతేనా... మా ఆయన కొట్టిన బంతి దెబ్బకు మా గ్రహంమీదికి బాల్స్ పడనీయకండి అంటూ అంగారక గ్రహంవాళ్ళు సందేశం పంపారు తెలుసా... అంది రెండవ క్రికెటర్ భార్య.

సంతోషంలో ఉన్నప్పుడు ఆనందించే మిత్రులు వద్దు. బాధల్లో వెన్నంటివుండే మిత్రులు కావాలి.

SWATI SAPARIVARA PATRIKA PRINTED AT ANIL SWATI PRESS AUTONAGAR VIJAYAWADA
RNI 38008 / 1984 REGD NO.VJ / 025 / 2018-20